# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 2 హైదరాబాద్ 103 ఫిబ్రవరి 2010 పేజీలు : 60 రు. 10

* ఫోకస్ : ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపద ఎవరి బొక్కసాలలోకి?
* వికేంద్రీకరణ - కేంద్రీకరణ
* ఆత్మహత్యలు పరిష్కారాలు కావు!
* పవర్‌లూం పరిశ్రమ దశ - దిశ
* హైతీ భూకంపం - సామ్రాజ్యవాదం
* మార్క్సిజం - రెండు నగరాల కథ

# వీక్షణం రచయితల సమావేశానికి ఆహ్వానం !

**(డిసెంబర్ 13న జరగవలసిన సమావేశం అనివార్య కారణాల వల్ల ఫిబ్రవరి 7కు వాయిదా పడింది)**

**తేది** : ఫిబ్రవరి 7, 2010 ఆదివారం

**సమయం** : ఉదయం 10 గంటల నుంచి భోజన విరామం దాకా

***స్థలం** : ఇండియన్ మెడికల్ అసోసియేషన్ (ఐ.ఎం.ఎ.) హాల్
బొమ్మన బ్రదర్స్ పక్కన, కోఠి, హైదరాబాద్

పాఠకుల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొంటూ ఏడు సంవత్సరాలుగా నిరంతరాయంగా సాగుతున్న వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు బలం చేకూరుస్తున్నది మీ వంటి రచయితల రచనలే. ఇప్పటికి వెలువడిన వంద సంచికలలో వీక్షణం 1200 వ్యాసాలు, రచనలు ప్రచురించింది. ఆరువందల మందికి పైగా రచయితలు ఈ కృషిలో పాలుపంచుకున్నారు. అందులో కనీసం రెండు వందలమంది వీక్షణం ద్వారానే మొదటిసారిగా సామాజిక, రాజకీయార్థిక విశ్లేషణ ప్రారంభించారు. వీక్షణం రచయితల జాబితా ఎంత విస్తృతమయినదంటే, ఆ జాబితాలో లేని తెలుగు సామాజిక శాస్త్రవేత్తలు, మేధావులు, వ్యాఖ్యాతలు అతి తక్కువమంది. ఇలా వీక్షణం పురోగతికి, తెలుగు సమాజంలో అత్యవసరమైన భావజాల కృషికి మీరు చేస్తున్న దోహదానికి ధన్యవాదాలు.

ఐనా సాధించవలసింది ఎంతో ఉంది. మరెన్నో రంగాలమీద రచనలు, చర్చలు, విశ్లేషణలు, అనువాదాలు జరగవలసే ఉన్నాయి. తెలుగు సమాజం తెలుసుకోవలసిన, చర్చించవలసిన విషయాలు, ప్రపంచానికి చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఆ కృషికంతటికీ వేదిక కల్పించవలసిన బాధ్యత వీక్షణం పైన కూడ ఉంది. ఆ బాధ్యత నెరవేర్చడానికి మరింతమంది రచయితలు కావాలి. అనువాదకులు కావాలి. ఇతోధికమైన సలహాలు, సూచనలు కావాలి.

అందువల్ల రచయితలతోనూ, రచనలు చేయదలచుకున్నవారితోనూ నిరంతర సంభాషణ జరుపుతూ ఉండాలని, రచయితల మధ్య సంభాషణకు వేదిక కల్పించాలనీ వీక్షణం సంపాదకవర్గం భావిస్తోంది. ఆ దిశగా, గతంలో జరిగిన సమావేశాలకు కొనసాగింపుగా, వీక్షణం రచయితల సమావేశాన్ని ఫిబ్రవరి 7న ఆదివారం జరపదలిచాం. వీక్షణంకు రాసినవారూ, రాయదలచుకున్నవారూ అందరూ ఆహ్వానితులే. మీరు తప్పనిసరిగా ఈ సమావేశంలో పాల్గొనాలని, మీ విలువైన అభిప్రాయాలను పంచుకుని, వీక్షణం అభివృద్ధికి తోడ్పడాలని మా కోరిక.

**వివరాలకు** : కార్యాలయం – 040 66843495 (ఉ. 10.00 నుంచి సా. 6.00 గం. వరకు)

*** గమనిక : సమావేశ స్థలం కోఠి ఐ.ఎం.ఎ. హాల్‌కు మారింది.**

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com

# వీక్షణం 103

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

ఫిబ్రవరి 2010
సంపుటి : 8
సంచిక : 2



గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com
www.veekshanam.wordpress.com
వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
98482 49695

**ప్రింటర్స్**
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


## సంపాదకీయం

# ఈ సాచివేత ఎంతకాలం?

ప్రజలను ఆందోళన పరుస్తున్న సమస్యలకు వీలయినంత త్వరగా సముచిత పరిష్కారాలు కనిపెట్టి ఆచరణలో పెట్టవలసిన బాధ్యత ప్రభుత్వాలది. నిజానికి పార్లమెంటరీ రాజకీయ వ్యవస్థలో రాజకీయపక్షాలు అధికారానికి వచ్చేదే ప్రజల సమస్యలకు పరిష్కారాలు చూపెడతామనే వాగ్దానంతో. ఆ వాగ్దానాన్ని నెరవేర్చడం మాట అలా ఉంచి, ప్రజలకు కొత్త సమస్యలు తెచ్చిపెట్టడం, సులభంగా పరిష్కరించగలిగిన సమస్యలను జటిలం చేయడం, సాధ్యమైన పరిష్కారాలను కూడ తాత్సారం చేయడం మన రాజకీయపక్షాలకు అలవాటయిపోయింది. ప్రజాసమూహాల కన్న ఎక్కువ చైతన్యంతో, ఎక్కువ దూరదృష్టితో, ఎక్కువ ప్రజాస్వామిక స్ఫూర్తితో ప్రవర్తించవలసిన రాజకీయపక్షాలు అటువంటి స్పృహ ఏమాత్రం లేని స్థితిలో ఉన్నాయి. గత రెండు నెలలుగా రాష్ట్రంలో అట్టుడికి పోతున్న ప్రజాందోళనల విషయంలో అధికారపక్షమూ ప్రతిపక్షాలూ కూడ ఇటువంటి విమర్శార్హమైన పద్ధతిలోనే పనిచేస్తున్నాయి. కనీసం డిసెంబర్ 9 కేంద్ర హోంమంత్రి ప్రకటన నుంచి అయినా అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కూడ సమస్య పరిష్కార దిశగా ఎటువంటి ప్రయత్నమూ చేయడం లేదనిపిస్తున్నది. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర విభజనకు అనుకూలంగా ఉన్నదని డిసెంబర్ 9 నాటి ప్రకటనలో స్పష్టంగా, జనవరి 5 సమావేశ ప్రారంభోపన్యాసంలో పరోక్షంగా సూచనలు వచ్చాయి. అది నిజమైతే, రాష్ట్ర విభజనను వ్యతిరేకించేవారితో సంప్రదింపులు జరపడం, వారి అభ్యంతరాలు ఏమిటో తెలుసుకోవడం, వారి సందేహాలను నివృత్తి చేయడం, తన నిర్ణయానికి ఇతోధికంగా మద్దతు కూడగట్టుకుని, వీలయినంత త్వరితంగా ఆ నిర్ణయాన్ని అమలు చేయడం కేంద్ర ప్రభుత్వ బాధ్యత. మరొకవైపు నుంచి చూస్తే డిసెంబర్ 23 కేంద్ర హోంమంత్రి ప్రకటనలోను, ప్రాంతీయ వాదానికి వ్యతిరేకంగా ప్రధానమంత్రి చేసిన ప్రకటనలోను, కాంగ్రెస్ పార్టీ అధికార ప్రతినిధుల వ్యాఖ్యలలోను, యుపిఎ చైర్‌పర్సన్ మౌనంలోను రాష్ట్ర విభజనకు కేంద్ర ప్రభుత్వం సుముఖంగా లేదేమోననే సూచనలు కనబడుతున్నాయి. ఇది నిజమైతే, తెలంగాణ వాదులతో సంప్రదింపులు జరపడం, రాష్ట్రవిభజన ఎందుకు సాధ్యం కాదో వారిని ఒప్పించడం, వారు రాష్ట్ర విభజన ఎందుకు కోరుతున్నారో తెలుసుకుని వారి సందేహాలను నివృత్తి చేయడం కేంద్ర ప్రభుత్వ బాధ్యత. కాని దురదృష్టకరంగా కేంద్ర ప్రభుత్వపు పెద్దలు, ఆ ప్రభుత్వాన్ని నడుపుతున్న యుపిఎ కూటమికి నాయకత్వం వహిస్తున్న కాంగ్రెస్ పార్టీ పెద్దలు ఆ బాధ్యతనయినా, ఈ బాధ్యతనయినా తీసుకోవడానికి సిద్ధంగా లేరు. వారి బాధ్యతారాహిత్యానికి మూల్యం చెల్లిస్తున్నది అటూ ఇటూ కూడ అమాయకులైన తెలుగు ప్రజలు. తెలంగాణ ప్రాంతంలో ఊరూరా సాగుతున్న ఆందోళనలతో భావోద్వేగాలు పెచ్చరిల్లిన స్థితిలో రాష్ట్ర విభజన జరగకపోతే తమ బతుకు వ్యర్థమని విద్యార్థులు, యువజనులు భావిస్తున్నారు. ఇది రాస్తున్న సమయానికి రెండు వందలమంది అసహజ మరణాల పాలయ్యారు, అందులో కనీసం సగం మంది తమ ఆత్మహత్యా కారణం తెలంగాణ రాదనే నిరాశ మాత్రమేనని లేఖలు రాసి చనిపోయారు. విద్యాలయాలు అరకొరగా నడుస్తున్నాయి. పరీక్షలు సక్రమంగా జరిపే అవకాశాలు మృగ్యమవుతున్నాయి. రెండునెలల కాలంలో కనీసం పదిహేను రోజులు బంద్ జరిగింది. ప్రజాజీవనం అస్తవ్యస్తమవుతున్నది. మరొకవైపు కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో కూడ డిసెంబర్ 10–23 ఆందోళన తర్వాత బహిరంగ నిరసన ప్రదర్శనలు పెద్దగా లేకపోయినప్పటికీ, విద్యార్థి యువజనులలో విద్యా, ఉద్యోగ అవకాశాల గురించి, హైదరాబాద్ గురించి ఆందోళన, రైతులలో సాగునీటి సౌకర్యాల భవిష్యత్తు గురించి ఆందోళన కనబడుతున్నాయి. కోస్తాంధ్ర, రాయలసీమలలో కూడ ఆత్మార్పణ అనే నిరసనరూపం కనబడుతున్నది. ఈ క్రమంలో ఒకే జాతికి చెందిన, ఒకే భాష మాట్లాడే విభిన్న ప్రాంతాల ప్రజల మధ్య అవాంఛనీయమైన, అనవసరమైన వైమనస్యాలు, ఉద్రేకాలు, విద్వేషాలు చోటు చేసుకుంటున్నాయి. ఈ వైమనస్యాన్ని తొలగించవలసిన రాజకీయనాయకులు ఆపని చేయకపోగా, వాస్తవాలను మరుగుపరుస్తూ, అబద్ధాలతో, అనవసరపు, వివాదాస్పద వ్యాఖ్యలతో, నోటి దురుసుతో పరిస్థితిని మరింత దిగజారుస్తున్నారు. కాలయాపన జరిగిన కొద్దీ ఈ పరిస్థితి మరింత విచారకరంగా, విషాదకరంగా మారుతున్నది. ఇప్పటికైనా మేల్కొని పరిస్థితిని చక్కదిద్దే రాజకీయ విజ్ఞతను ప్రదర్శించడం అన్ని రాజకీయ పక్షాల బాధ్యత. ఆ బాధ్యతలో సింహభాగం అధికార కాంగ్రెస్‌ది కాగా, అన్ని రాజకీయ పక్షాలు, ప్రజాసంఘాలు, ఆలోచనాపరులు, సామాజిక నాయకులు ఆ బాధ్యతను పంచుకోవలసి ఉన్నది. భయ సందేహాలతో, నిరాశతో ప్రాణాలు పోగొట్టుకుంటున్న, చదువులను, కుటుంబాలను, సాధారణ జీవితాన్ని విస్మరిస్తూ ఆందోళనాపథంలో ఉన్న వేలాది విద్యార్థుల, యువకుల సాక్షిగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తక్షణమే ఈ సమస్యకు పరిష్కారాలు చూపాలని ప్రతిఒక్కరూ డిమాండ్ చేయవలసి ఉంది. వీ

## జ్యోతిబసు విధానాలేమిటి?

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అగ్రనాయకుడు, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగా ఇరవైనాలుగు సంవత్సరాలు నిరాటంకంగా పనిచేసి పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థలో మార్క్సిస్టు పార్టీకి తిరుగులేని స్థానం కలిపించిన నేత జ్యోతి బసు మరణంతో ఆయన గురించి అన్ని రాజకీయ పక్షాలూ, ప్రచారసాధనాలూ ప్రగాఢమైన సంతాపాన్ని ప్రకటించాయి. వ్యక్తిగానూ, నాయకుడిగానూ, మార్క్సిస్టు పాలనాదక్షుడిగానూ ఆయన ఎంత ఉన్నతుడో ప్రశంసించాయి. ఆరు దశాబ్దాలకు పైగా కమ్యూనిస్టుపార్టీతో కొనసాగడం, రెండున్నర దశాబ్దాలపాటు ఒక రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉండగలగడం, భూసంస్కరణలను అమలు చేయడానికి ప్రయత్నించడం, వ్యక్తిగా నిరాడంబరంగానూ, సౌమ్యంగానూ, అవినీతి మచ్చ లేకుండానూ జీవితం గడపడం తప్పనిసరిగా గౌరవించవలసిన అంశాలే. ఆ భూసంస్కరణలు సక్రమంగా అమలు కాలేదనో, కొడుకు చందన్ బసు పరిశ్రమల విషయంలోనో, సాల్ట్ లేక్ భూముల కెటాయింపు విషయంలోనో విమర్శలు ఉంటే ఉండవచ్చు గాని మొత్తం మీద ఆయన వ్యక్తిత్వం గౌరవనీయమైనదే. అయితే వ్యక్తిగా జ్యోతి బసు ఏమిటనేదానికన్న భారత ప్రజా ఉద్యమ, కమ్యూనిస్టు సంప్రదాయాలలో ఆయన అనుసరించిన విధానాల ఫలితాలు, పర్యవసానాలు ఏమిటనేదే చరిత్రలో గీటురాయి అవుతుంది. అటువంటి అంచనా వేసేటప్పుడు రాగద్వేషాలను పక్కనపెట్టి కొన్ని ముఖ్యమైన సన్నివేశాలలో ఆయన తీసుకున్న వైఖరిని చర్చించవలసి ఉంటుంది. 1967లోనూ, 1969లోనూ అధికారంలో భాగం కోసం ఆయన అనుసరించిన వైఖరి తప్పకుండా చర్చనీయమే. కాంగ్రెస్ నుంచి విడిపోయి బంగ్లా కాంగ్రెస్ అనే సొంత కుంపటి పెట్టుకున్న అజయ్ ముఖర్జీ ఎన్నికలకు ముందు సిపిఐతో పొత్తు పెట్టుకున్న ప్రత్యర్థి కూటమి నాయకుడు. ఏ కూటమికీ తగిన ఆధిక్యత రాని సమయంలో శాసనసభలో మూడో స్థానంలో అతి తక్కువ సీట్లు వచ్చినప్పటికీ అజయ్ ముఖర్జీని ముఖ్యమంత్రి చేసి, తాను ఉప ముఖ్యమంత్రి కావడానికి జ్యోతి బసు సిద్ధపడ్డారు. ఫిరాయింపులతో ఆ ప్రభుత్వం కూలిపోయి, 1969లో ఎన్నికలు జరిగిన తర్వాత, ఉప ముఖ్యమంత్రి పదవి, హోంశాఖ ఇస్తేనే తక్కువ మెజారిటీ ఉన్న అజయ్ ముఖర్జీని మళ్లీ ముఖ్యమంత్రిగా సమర్థించడానికి సిద్ధపడ్డారు. పెట్టుబడిదారీ పరిభాషలో దీన్ని ప్రాగ్మాటిజం – ప్రాప్తకాల వైఖరి – అంటున్నారు గాని మార్క్సిస్టు పరిభాషలో అది అవకాశవాదం. చివరికి హోంశాఖను రెండుగా విభజించి సగం హోంశాఖ మంత్రిగా పనిచేసిన పదమూడు నెలల్లో జ్యోతి బసు సాధించినదల్లా నక్సల్బరీ రైతాంగ ఉద్యమం మీద ఉక్కుపాదం మోపడం. స్థానిక పోలీసు బలగాలు చాలవన్నట్టు, ఈస్టర్న్ ఫ్రాంటియర్ పోలీస్ బలగాలను దించి దమననీతిని అమలు చేయడం. ఎన్‌కౌంటర్ హత్యల పరంపరను ప్రారంభించడం. నిజానికి మార్క్సిస్టు పార్టీ ఈ ఐక్యసంఘటన ప్రభుత్వాలలో చేరేటప్పుడు శాసనసభ, ప్రభుత్వం కూడ పోరాట సాధనాలేనని, ప్రజలకు మరింత చేరువయ్యేందుకే వాటిని వాడుకుంటామని ప్రకటించింది. కాని ఆ సాధనాలను ప్రజలమీద అణచివేత అమలుచేయడానికే వాడుకున్నారు. ఇక ప్రపంచీకరణ క్రమంలో ఆయన ఎక్కువగా ముఖ్యమంత్రిగానే ప్రవర్తించారు గాని మార్క్సిస్టుగా ప్రవర్తించలేదు. పారిశ్రామికీకరణ, ఆధునికీకరణ, పోటీ వంటి మాటలతో ఆయన ప్రపంచీకరణ క్రమాన్ని ఆమోదించారు. కేంద్రంలో ప్రధాని పదవికి అవకాశం వచ్చినప్పుడు దాన్ని అందుకోవాలని అనుకుని కూడ, పార్టీ అందుకు అంగీకరించలేదని కినుక వహించి అది చారిత్రక తప్పిదం అని వ్యాఖ్యానించారు. ఎన్నోసార్లు ప్రజాప్రజ్వలనకు అవకాశం వచ్చినా, భౌతిక పరిస్థితులు అనుకూలించినా విప్లవం సాధించలేకపోవడం చారిత్రక తప్పిదమని అనుకోని మార్క్సిస్టు నేత, పాలకవర్గ రాజకీయాలలో ప్రధాని పదవిని వదులుకోవడమే చారిత్రక తప్పిదమని అనుకోవడమే ఆలోచించవలసిన విషయం.

## హైతీ మహావిషాదం

అట్లాంటిక్ మహాసముద్రంలోని కరీబియన్ దేశం రిపబ్లిక్ ఆఫ్ హైతీ తరతరాలుగా విషాదాలకు, పరాయి దురాక్రమణలకు, సైనికకుట్రలకు, రక్తపాతాలకు, అసహజ మరణాలకు ఆలవాలం. ఆ చిన్నారి దేశం మీద ప్రకృతి కూడ కన్నెర్ర చేసింది. కోటి జనాభా గల ఆ దేశాన్ని జనవరి 12న అతలాకుతలం చేసిన భూకంపం లక్షలాది మంది ప్రాణాలు బలిగొంది. మృతుల సంఖ్య లక్షన్నర ఉండవచ్చుననే ప్రాథమిక అంచనాలు ప్రస్తుతం మూడు లక్షలకు చేరాయి. అతితక్కువ తలసరి ఆదాయంతో, సగం జనాభా నిరక్షరాస్యతతో, నలభై శాతం ప్రజలు అనారోగ్యంతో చివికిపోతున్న హైతీ ఈ భూకంపపు దెబ్బను తట్టుకోవడం కష్టమే. భూకంపం ప్రకృతి సహజమైన బీభత్సమే కావచ్చు కాని మానవప్రయత్నంతో దాన్ని నివారించవచ్చు, దాని నష్టాన్ని తగ్గించవచ్చు. వేల ఏళ్ల నాగరికతలో మనుషులు ప్రకృతి వైపరీత్యాలనుంచి తమను తాము కాపాడుకోవడం నేర్చుకున్నారు. భూకంపాలను అరికట్టే, దిశమార్చే వైపుగా భూభౌతిక శాస్త్రప్రయోగాలు జరిగితే భూకంప తీవ్రతను తగ్గించడం పెద్ద సమస్య కాదు. సామ్రాజ్యవాదం యుద్ధ సాంకేతిక పరిజ్ఞానం కోసం వెచ్చిస్తున్న నిధులలో పావో, పదో వంతో ఖర్చుపెట్టినా ఈవిషయంలో విజయం చేకూరి ఉండేది. అంత దీర్ఘకాలికమైన, విస్తృతమైన సాంకేతిక విజయాలు కాకపోయినా, కనీసం భూకంపం వంటి ప్రకృతి విలయాలను ముందస్తుగా గుర్తించగలిగే పరిజ్ఞానం అభివృద్ధి చేసినా, బాధిత ప్రజానీకాన్ని సురక్షిత ప్రాంతాలకు తరలించడం, నష్టపు తీవ్రతను తగ్గించడం సాధ్యమవుతాయి. లేదా భూకంప అవకాశం ఉన్న ప్రాంతాలలో తగిన భవన నిర్మాణ సామగ్రిని వాడడం ద్వారా, బహుళ అంతస్తుల భవనాలు నిర్మంచకుండా ఉండడం ద్వారా నష్టాలను తగ్గించవచ్చు. ఇవేవీ కాకపోయినా, భూకంపం వచ్చిన తర్వాత ఎంత తక్కువ వ్యవధిలో సాధ్యమయితే అంత తక్కువ వ్యవధిలో బాధితులకు సహాయ పునరావాస సౌకర్యాలు కల్పించడం ప్రభుత్వాల బాధ్యత. స్వయంగా అధ్యక్ష భవనం కూడ ధ్వంసమైపోయిన స్థితిలో ఇవాళ హైతీ ప్రభుత్వానికి ఈ సహాయ పునరావాస చర్యలకు తగిన శక్తి లేకపోవచ్చు. కాని కూతవేటు దూరంలో మహా సంపన్నమైన అమెరికా ఉంది. హైతీ కోరితేనో, ఐక్యరాజ్యసమితి కోరితేనో అరకొర సహాయం చేయడం కాక బాధితులను ఆదుకోవడం తన నైతిక బాధ్యతగా అమెరికా భావించాలి. ఇరాక్ మీద దండెత్తడానికి దేశదేశాల సైన్యాలను తరలించుకుపోయి, లక్షల కోట్ల డాలర్లు భస్మీపటలం చేయడానికి చూపిన ఉత్సాహంలో కొంతయినా, పొరుగువారిని ఆదుకోవడానికి చూపాలి. అట్లాగే పక్కనే సోషలిస్టు నిర్మాణ ప్రయోగం చేస్తున్న క్యూబా ఉంది. తమది శ్రామికవర్గ అంతర్జాతీయ దృష్టి అని, ఎక్కడి మానవ విషాదాన్ని అధిగమించడానికైనా సోషలిస్టులు ముందుకు వస్తారని క్యూబా నిరూపించాలి. వీ

## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపద ఎవరి బొక్కసాలకు?

*ఇసుక తవ్వకుపోతూ వాగులు వట్టిపోయేలా చేయడం దగ్గరి నుంచి వేల సంవత్సరాలుగా భూమిలో భద్రంగా ఉన్న ఖనిజ నిలువలను, ఆ ప్రాంతవాసులకు ఉపయోగపడవలసిన సంపదను కొల్లగొట్టడం వరకూ మన సమాజంలో ఈ అక్రమవ్యాపారం సర్వత్రా వ్యాపించి ఉంది. ఈ గనుల తవ్వకాలు మన సంపదను మనకు కాకుండా చేస్తున్నాయి, అక్రమార్జనాపరుల పాలు చేస్తున్నాయి. మన పర్యావరణాన్ని, ఆరోగ్యాలను దెబ్బతీస్తున్నాయి. మన రాజకీయార్థిక విధానాలను శాసిస్తున్నాయి. చివరికి ప్రభుత్వాదాయానికి కూడ గండి కొడుతున్నాయి.*



‘వీక్షణం’లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. ‘వీక్షణం’ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. ‘వీక్షణం’ కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. ‘వీక్షణం’ పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను ‘వీక్షణం’కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028












- **1969 ఉద్యమం - చారిత్రక పత్రాలు -** సంపాదకులు : తడకమళ్ల వివేక్, మరింగంటి రాఘవాచారి, శ్రీధర్‌రావు దేశ్‌పాండే, సంగిశెట్టి శ్రీనివాస్ - తెలంగాణ హిస్టరీ సొసైటీ - 456 పేజీలు, 1/8 డెమీ, రు.100, ప్రతులకు : సంగిశెట్టి శ్రీనివాస్, ఫ్లాట్ నెం. 305, హిమగిరి ఎవెన్యూ, 13-6-434/బి/38, ఓంనగర్, మెహదీపట్నం రింగ్‌రోడ్, హైదరాబాద్ - 500 008; ఫోన్ : 9849220321; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **నేలగంధం -** కవిత్వం - దర్భశయనం శ్రీనివాసాచార్య - 140 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : దర్భశయనం శ్రీనివాసాచార్య, సీనియర్ మేనేజర్, ఆంధ్రాబ్యాంక్, హ్యూమన్ రిసోర్సెస్ డిపార్ట్‌మెంట్, హెడ్ ఆఫీస్, సైఫాబాద్, హైదరాబాద్ - 500 004; సెల్ : 9440419039; ఇమెయిల్ : darbhasayanam@yahoo.co.in ; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, నవోదయ పబ్లిషర్స్, నవోదయ బుక్ హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్
- **మానవీయ బాలగోపాల్ -** నివాళి వ్యాసాలు - సంపాదకుడు : జూలూరు గౌరీశంకర్ - చెలిమి ఫౌండేషన్, రామయ్య విద్యాపీఠం ప్రచురణ - 64 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ - 500 044; 'చంద్రమ్' 490, రోడ్ నెం. 11, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029; ఫోన్ : 040 27635668
- **మరో ప్రపంచపు మహాకవి -** (శ్రీశ్రీ శతజయంతి ప్రత్యేక సంచిక) సంపాదకులు : ఆవునూరి సమ్మయ్య, డా. విప్లవదత్ శుక్లా - జనసాహితి ప్రచురణ - 80 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు పి. ఈశ్వర్‌రెడ్డి, ఇ.నెం. 12-281/1, కాకతీయ కాలనీ, హుజూరాబాద్, కరీంనగర్ - 505 468; సెల్ : 9948237909, 9700555425
- **క్రాంతదర్శి లోహియా -** శతజయంతి నివాళి - సంకలనం : రావెల సోమయ్య - డా. రామ్ మనోహర్ లోహియా సమతా ట్రస్ట్, డా. లోహియా శతజయంతి ఉత్సవ సమితి, 255 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : రావెల సోమయ్య, 101, 'గోదా నిలయం' 555, మయూరి మార్గ్, బేగంపేట్, హైదరాబాద్ - 500 016; ఫోన్ : 040 27760124, సెల్ : 9985810903; సి.ఎచ్. సురేష్, చిలువూరు, (వయా) దుగ్గిరాల - 522 330; సెల్ : 9347661122
- **తెలంగాణ కవిత 2008-** సంపాదకులు : సుంకర రమేశ్ - మట్టి ముద్రణలు - 203 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : పుట్ట పుస్తక కేంద్రం, ఆలగడప, నల్లగొండ జిల్లా; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **ఫ్రెడరిక్ ఎంగెల్సు -** జీవితం : ఉపదేశాలు - వి.ఐ. లెనిన్, జెల్డా కోట్కు - లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ - 85 పేజీలు, 1/8 డెమీ, రు.30, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5-85-4/బి, పందరీపురం, 1వ లేను, గుంటూరు - 522 002, సెల్ : 9985377760; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్స్
- **ఒంటరి శరీరం -** కథా సంపుటి - సలీం - శ్రీ విజయలక్ష్మి పబ్లికేషన్స్ - 224 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: సలీం, ఫ్లాట్ నెం. 306, జె.బి. అపార్ట్‌మెంట్స్, దోమలగూడ, హైదరాబాద్; విశాలాంధ్ర బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్, తెలుగు బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్
- **ఆర్తారావం -** కథా సంపుటి - జాతశ్రీ - సృజనాలయ ప్రచురణలు - 170 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: సృజనాలయం, 3-2-45/1, విద్యానగర్ కాలనీ, కొత్తగూడెం - 507 101; సెల్ : 9396798165
- **అన్యాయాన్ని ఎదిరించండి -** తాగునీరు - సాగునీరుకై పోరాడండి - నల్లమడ రైతు సంఘం ప్రచురణ - 72 పేజీలు, 1/4 క్రౌన్, ప్రతులకు: డా. కొల్లా రాజమోహన్, నల్లమడ రైతు సంఘం, నల్లమడ, చిలకలూరిపేట - 522616; సెల్ : 9000657799











వీక్షణంలో జనవరి సంచికలో ఫోకస్‌గా 'చదవవలసిన పుస్తకాలు' లో వచ్చిన వ్యాసాలు చాలా బాగున్నాయి. ఇప్పుడున్న ఉరుకుల పరుగుల జీవితంలో పుస్తక పఠనం చాలా తగ్గిపోయింది. ఈ వ్యాసాలలో నన్ను చాలా ప్రభావితం చేసిన వ్యాసం స్నేహలత రాసిన 'జీవిత వాస్తవాల శారద'. ఇది చదివిన తరువాత నాకు కూడా శారద జీవితం, ఆయన రచనలు చదవాలన్న ఆసక్తి కలిగింది. ఇలా మంచి పుస్తకాల పరిచయం చేయడం ద్వారా ఇప్పుడు వస్తున్న ఇబ్బడి ముబ్బడిగా వస్తున్న పుస్తకాల్లో ఏ పుస్తకం చదవాలి అన్న మీమాంసలో ఉన్నవారికి చక్కటి మార్గదర్శకంగా ఉంటాయి. ఈ శీర్షికను ఇలానే కొనసాగించి, చదవవలసిన విలువైన పుస్తకాలను పాఠకులకు, ముఖ్యంగా కొత్తతరానికి పరిచయం చేయాల్సిన అవసరం ఎంతో ఉంది.

**– సి. జ్యోతి**
హైదరాబాద్

జనవరి సంచికలో కొడవటిగంటి రోహిణీప్రసాద్ 'మనుషుల ఆవిర్భావం' వ్యాసం చదివిన తరువాత మనిషి మనుగడ సాధించిన తీరు అబ్బురపరిచింది. భూమి పుట్టిన ఎన్నో కోట్ల సంవత్సరాల తర్వాత మనిషి ఆవిర్భావం, మానవ జాతి తన మనుగడ సాధించడానికి ఎంత దూరం ప్రయాణం చేయాల్సి వచ్చిందో చదువుతుంటే ఆశ్చర్యం వేసింది. ఇన్ని ప్రయాసాలు ఓర్చి సాధించిన మనుగడ, మనిషి తన స్వార్థంతో చేతులారా పర్యావరణ కాలుష్యాన్ని పెంచుతూ, జీవజాతి ఉనికికే ప్రమాదంగా మారుతున్నాడు.

**– తుమ్మురుగోటి కృష్ణ**
మిర్యాలగూడ

చదవాల్సిన పుస్తకాల శీర్షికతో వీక్షణం అందించిన వ్యాసాలు బాగున్నాయి. ఇలాగే మరిన్ని చదవాల్సిన పుస్తకాలను పాఠకులకు పరిచయం చేయడం మంచి ఆలోచన.

**– డి. యశోద**
కాకినాడ

కడపకు వైఎస్ పేరు సమంజసమా పేరిట జనవరి సంచికలో అచ్చయిన ప్రజా సంఘాల పిటీషన్ కడప చరిత్రను పరిచయం చేసింది. ఎంతో చరిత్ర ఉన్న ప్రాంతాలకు వ్యక్తుల పేర్లను పెట్టడం నిజంగా ఆలోచించాల్సిన విషయం. ఇది చరిత్రను అవమానించడం అవుతుంది.

**– బషీర్**
కర్నూలు

సామాజిక దృక్పథంతో వస్తున్న పత్రికలను సంవత్సరానికి ఒకసారయినా వీక్షణంలో పరిచయం చేస్తే ఎక్కువ మంది పాఠకులకు అందుబాటులోకి వచ్చే అవకాశం ఉంటుంది. అటువంటి ప్రయత్నం ఇదివరకు వీక్షణం చేసి ఉంది. దాన్ని కొనసాగించవలసిందిగా కోరుతున్నాం.

**– కె. రమేష్**
కరీంనగర్

ఒకపక్కన సమాచార హక్కుకోసం ప్రభుత్వాలు ఊదరగొడుతున్నాయి. ఎవరయినా, ఎప్పుడయినా, ఏ సమాచారాన్నయినా ప్రభుత్వం నుంచి పొందవచ్చునని సమాచార హక్కు చట్టం కూడా రూపొందించారు. కాని, ఇటువంటి చట్టాలు నారాయణ్‌పాట్నా లాంటి సంఘటనలలో ఎంత అబద్ధాలో అర్థమవుతున్నాయి. ఒక దేశస్థాయిలోని మహిళా బృందం వాస్తవాలను పరిశీలించడానికి వెళితే ఎదురయిన అనుభవాలు, అవమానాలు, అసలు చేరాల్సిన బాధితుల వద్దకు చేరకుండానే వెనక్కి మరలివచ్చిన స్థితి మన 'రాజ్యాంగబద్ధ' పాలన ఏ విధంగా ఉందో తెలియచెబుతోంది. నారాయణ్‌పాట్నాలోని నిర్బంధ స్థితిగతులను తెలియజేసినందుకు వీక్షణానికి కృతజ్ఞతలు.

**– జి. ఫిలిప్స్**
విశాఖపట్నం

వీక్షణంలో జనవరి సంచికలో చదవాల్సిన పుస్తకాలు శీర్షికన వచ్చిన వ్యాసాల ప్రేరణతో మంచి పుస్తకాలు చదివించడానికి మా ఊరిలో 'వీక్షణం రీడింగ్ క్లబ్' ఏర్పాటు చేసుకుంటున్నాం.

**– సి.ఎచ్. శ్రీమన్నారాయణ**
మంచిర్యాల

## కథా నిలయం పదమూడవ వార్షికోత్సవ సభలకు ఆహ్వానం

**కథానిలయం వార్షికోత్సవ సభలు**
ఫిబ్రవరి 13 – 14, 2010

**కార్యక్రమ వివరాలు :**
**ఫిబ్రవరి 13, శనివారం మధ్యాహ్నం 2–30లకు**
అతిథులతో ఇష్టాగోష్టి – పుస్తకావిష్కరణలు

**ఫిబ్రవరి 14, ఆదివారం  ఉదయం 10–00**
కథానిలయం 13వ వార్షికోత్సవసభ
రాచకొండ రచనా పురస్కార సభ
రాచకొండ రచనా పురస్కారం ప్రసిద్ధ రచయిత
డి. వెంకట్రామయ్య (హైదరాబాద్) గారికి యిస్తున్నారు

వక్తలుగా :
శ్రీ పెనుగొండ లక్ష్మీ నారాయణ, గుంటూరు (సాహితీ విమర్శకులు)
డా. కోడూరి శ్రీరామమూర్తి, రాజమండ్రి (రచయిత, విమర్శకులు)
శ్రీ వివిన మూర్తి, శ్రీకాకుళం (రచయిత)
శ్రీ అట్టాడ అప్పల్నాయుడు, శ్రీకాకుళం (రచయిత)

*ఈ సభలకు – సాహిత్యాభిమానులందరూ ఆహ్వానితులే*

సంప్రదించండి :
**డా. బి.వి.ఎ. రామారావు నాయుడు** (కార్యదర్శి) 9441095961
**డా. కాళీపట్నం రామారావు** (అధ్యక్షులు) 9440578506
కథానిలయం, విశాఖ ఏ కాలనీ, శ్రీకాకుళం – 532001

**వీక్షణం పత్రికను వెబ్ పేజీల్లో కూడా చూడవచ్చు!**

www.veekshanam.wordpress.com

మీ అభిప్రాయాలను, సూచనలను ఎప్పటికప్పుడు మాకు తెలియజేయండి!
తెలుగు సమాజం తన గురించి తాను చేసుకుంటున్న అన్వేషణలో మీరూ పాలుపంచుకోండి!
Email : veekshanam2003@gmail.com

వీక్షణంకు చందాలు, వీక్షణం పబ్లికేషన్ పుస్తకాల కోసం మీరు ఆన్‌లైన్ ద్వారా డబ్బులు కట్టడానికి వీలుగా
వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

## శ్రీకాకుళాన్ని కాపాడుకుందాం

శ్రీకాకుళం జిల్లాలో పదివేల మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యం గల ఆరు థర్మల్ ప్లాంట్‌లు సంతబొమ్మాళి, కవిటి, సోంపేట, కంచిలి, ఇచ్ఛాపురం మండలాలలో రాబోతున్నాయి. మరో రెండు అణు విద్యుత్తు కేంద్రాల ఏర్పాటుకు ప్రతిపాదనలు ఉన్నాయి. పాలమూరు తర్వాత పనుల కోసం వలసపోయే ప్రజలు అత్యధికంగా ఉన్న శ్రీకాకుళం జిల్లా ఈ ప్రాజెక్టుల వల్ల తీరప్రాంతాన్ని చాలా వరకు కోల్పోయి, అదనంగా కొన్ని వేల మంది నిర్వాసితులు అవుతారని మానవ హక్కుల వేదిక పేర్కొంది. ఈ వినాశకర పారిశ్రామికాభివృద్ధిని వ్యతిరేకిస్తూ ప్రచార యాత్రలు చేపడుతున్నట్లు మానవ హక్కుల వేదిక తన కరపత్రంలో తెలియపరిచింది.

## దొరికితేనే దొంగలు

రాష్ట్ర గవర్నర్ ఎన్.డి.తివారీ రాసలీలలు బయటపడ్డాక, తదనంతర పరిణమాల్లో భాగంగా గవర్నర్ తన పదవికి డిసెంబర్ 27న రాజీనామా చేశారు. ఆయన స్థానంలో ఛత్తీస్‌గడ్ గవర్నర్ ఇ.ఎస్.ఎల్. నరసింహన్ తాత్కాలిక గవర్నర్‌గా బాధ్యతలు తీసుకున్నారు. రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ అనీల్ రమేష్ ధవే రాజభవన్‌లో డిసెంబర్ 28న ఆయనచే ప్రమాణ స్వీకారం చేయించారు. జనవరి 22న గవర్నర్‌గా పూర్తిస్థాయి బాధ్యతలు తీసుకున్నారు.

## జై ఆంధ్రా... ప్రత్యేక ఆంధ్రా...

డిసెంబర్ 30న పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి, ఏలూరు నగరాలలో ప్రత్యేక ఆంధ్రవాదులు తలపెట్టిన సభలను సమైక్యవాదులు అడ్డుకున్నారు. ఏలూరులోనూ ఇదే పరిస్థితి తలెత్తింది. డిసెంబర్ 31న బిజెపి విశాఖపట్నంలో ఏర్పాటు చేసిన జై ఆంధ్ర సదస్సుకు కూడా సమైక్యవాదుల నుంచి ప్రతిఘటన ఏదురయ్యింది.

## సమైక్యాంధ్ర జె.ఎ.సి. ఆవిర్భావం

తెలంగాణ తరహాలోనే సమైక్యాంధ్ర కార్యాచరణ సంయుక్త కమిటీ (జె.ఎ.సి.) జనవరి 2న విజయవాడలో ఆవిర్భవించింది. ఉద్యమ నిర్మాణమే లక్ష్యంగా కాంగ్రెస్, తెలుగుదేశం, ప్రజారాజ్యం పార్టీల ప్రతినిధులు, విద్యార్థి, ఉపాధ్యాయ తదితర సంఘాల ప్రతినిధులు ఏకమయ్యారు. ఈ సమావేశం విజయవాడ బెంజ్ సర్కిల్‌లోని కృష్ణా జిల్లా లారీ యజమానుల సంఘ కార్యాలయంలో జరిగింది. ఈ కమిటీకి సిద్ధాంతకర్తగా ప్రొఫెసర్ శామ్యూల్ వ్యవహరిస్తారు.

## తెలంగాణ కోసం విద్యార్థి గర్జన

విద్యార్థి గర్జనకు హైకోర్టు షరతులతో కూడిన అనుమతి ఇచ్చింది. సభను జనవరి 3న సాయంత్రం 4 గంటల నుంచి 6.30 గంటల వరకు జరుపుకోవాలని, విద్యార్థులు మాత్రమే పాల్గొనాలని షరతులు విధించింది. ఈ సభకు తెలంగాణ జిల్లాల నుంచి వేలాది మంది విద్యార్థులు తరలివచ్చారు. సభలో తెలంగాణ స్టూడెంట్స్ జాయింట్ ఆక్షన్ కమిటీ (టి.ఎస్. జె.ఎ.సి.) నాయకులు, ప్రజాసంఘాల నేతలు, మేధావులు పాల్గొని ప్రసంగించారు. కళాకారుల బృందాలు తమ పాటలతో విద్యార్థులలో ఉత్సాహాన్ని నింపాయి. జనవరి 19న వేణుగోపాల్‌రెడ్డి అనే విద్యార్థి ఆత్మహత్యతో తెలంగాణ ప్రాంతం అంతా మళ్లీ వేడెక్కింది. ఇప్పటికి 205 మంది ఆతార్పణలు చేసుకొన్నారు.

## 61 శాతం ఫిట్‌మెంట్ కావాలి

తొమ్మిదవ వేతన సవరణ కమిషన్ (పి.ఆర్.సి.) నివేదికను 61 శాతం ఫిట్‌మెంట్‌తో ప్రకటించాలన్న ప్రధాన డిమాండ్‌తో రాష్ట్ర వ్యాప్తంగా పదమూడు లక్షల మంది ఉద్యోగులు జనవరి 6న సామూహిక సెలవు పెట్టారు. అన్ని జిల్లాల్లో కలెక్టరేట్ వరకూ భారీ ఎత్తున ర్యాలీలు నిర్వహించి తమ నిరసనలు తెలియజేశారు. ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రభుత్వం వెంటనే ఈ ఫిట్‌మెంట్‌ను 1 జూలై 2008 నుంచి అమలు చేయాలని కోరారు.

## ప్రమాదం వల్లనే వై.ఎస్. మృతి

ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి దుర్మరణం వెనుక రిలయన్స్ అధినేతల కుట్ర ఉందేమోననే ఒక ఊహాత్మక కథనాన్ని నాలుగు నెలల క్రితం రష్యాకు చెందిన 'ది ఎగ్జయిల్డ్' అనే వెబ్ పత్రిక తన వెబ్‌పేజీలలో పెట్టింది. ఆ సమాచారం ఆధారంగా కొన్ని ఛానల్‌లు కుట్ర కథనాన్ని ప్రసారం చేశాయి. దీంతో కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలు ఆవేశంతో రియలన్స్ ఆస్తులపై దాడులు చేశారు. ఈ వార్తా కథనాన్ని ప్రసరించిన ఛానల్ జర్నలిస్టుల అరెస్ట్‌లు, బెయిల్ పై విడుదల వంటి పరిణామాలు చోటు చేసుకొన్నాయి. జనవరి 20న డైరెక్టర్ జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ (డిజిసిఎ) బృందం కేంద్రానికి అందజేసిన నివేదికలో వైఎస్ మృతికి ప్రమాదమే కారణమని పేర్కొంది.

## చార్జీల మోత - రేషన్ కోత

నిత్యావసరాల ధరల పెరుగుదలతో సతమతమవుతున్న రాష్ట్ర ప్రజానీకం ఆర్.టి.సి. బస్సు చార్జీలు పెంచడంతో మరింత అతలాకుతలం అయ్యారు. కిలోమీటర్‌కు 8-25 పైసలు పెంచేశారు. ఆర్.టి.సి. ఎం.డి. ముఖ్యమంత్రితో సంబంధం లేకుండా ఏకపక్షంగా ఛార్జీలు పెంచేశారు. ఇదిలా ఉండగా కార్పొరేషన్‌లు, మునిసిపాలిటీలలో తెల్లకార్డులపై ఇచ్చే చక్కెర, కిరోసిన్ కోటాను తగ్గించారు. కిరోసిన్‌లో రెండు లీటర్లు తగ్గించారు. చక్కెర అరకేజీకి పరిమితం చేశారు. పౌరసరఫరాల శాఖ మంత్రి జూపల్లి కృష్ణారావుతో ముఖ్యమంత్రి సమీక్షించి ఈ నిర్ణయం తీసుకున్నారు.

## బొగ్గు కుంభకోణం

ఆంధ్రప్రదేశ్ విద్యుత్ ఉత్పత్తి సంస్థ (జెన్‌కో) కు చెందిన వరంగల్ జిల్లాలోని తాడిచెర్ల బ్లాక్ 1 గనులు కేంద్రంగా జరుగుతున్న కుంభకోణంలో ఆసక్తికరమైన విషయాలు వెలుగుచూసాయి. దీని వలనే రాబోయే ఇరవై ఏళ్లలో 15 వేల కోట్ల రూపాయల దారిమళ్లే అవకాశం ఉంది. సింగరేణి సంస్థ తన సొంత గనులలో నుంచి వెలికితీసి విక్రయిస్తున్న బొగ్గురేటు టన్నుకు 1128 రూపాయలు కాగా, జెన్‌కో తన సొంత గనులలోంచి బొగ్గు వెలికితీసి సరఫరా చేసేందుకే టన్నుకు 2499 రూపాయలు చెల్లించేందుకు సిద్ధపడుతోంది. ఈ మొత్తాన్ని కోట్ చేసిన ఇటిఎ-పిఎల్ఆర్‌కు 'తక్కువ' కోట్ చేసినట్లు పేర్కొని బొగ్గు మైనింగ్ కాంట్రాక్ట్‌ను ఇచ్చింది. ఈ విషయాన్ని సమీక్షిస్తామని మంత్రులు పేర్కొన్నారు. ఏ

*ఒక ప్రాంత వెనుకబాటుతనానికి చారిత్రకంగా, పాలనాపరంగా ఇంకా ఇతరత్రా అనేక కారణాలు ఉంటాయంటున్నారు* **వి. హనుమంతరావు**

# విధానం వికేంద్రీకరణ, ఆచరణ కేంద్రీకరణ

దేశంలో పరిపాలనాధికారాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కాంగ్రెస్ నాయకులకు 1947లో అప్పగించి వెళ్లిపోయిన తర్వాత పరిపాలనా వ్యవస్థను సమూలంగా అత్యున్నత స్థాయిలో సంస్కరించక పోయినా (ఇప్పటికీ కూడా), ఆ వ్యవస్థను కింది స్థాయిలో సంస్కరించడానికి ఓ ప్రయత్నం జరిగింది. ఆ ప్రయత్నమే పరిపాలనా వికేంద్రీకరణ. అదే పంచాయితీరాజ్ వ్యవస్థ. రాష్ట్రం ఏర్పడిన రెండు సంవత్సరాల్లోనే, దేశంలో మొదటిసారిగా ఈ సంస్కరణను ప్రవేశపెట్టింది మన రాష్ట్రమే (మొదటి రాష్ట్రం రాజస్థాన్ అని కొందరంటారు). అంతకు ముందున్న తాలూకా వ్యవస్థ స్థానే ఈ నూతన వ్యవస్థ ఏర్పాటు చేయడం వల్ల పరిపాలనా వ్యవస్థను ప్రజలకు మరింత దగ్గరగా తీసుకొని వెళ్లడమే తమ లక్ష్యమని పాలకులు ప్రకటించారు. 1983లో ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రిగా అధికారంలోకి వచ్చిన తర్వాత, ఈ వ్యవస్థను ప్రజలకు మరింత దగ్గరగా తీసుకొని వెళతానని ప్రకటించి మండల్ వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఆ తర్వాత కాలంలో ఎస్.సి., ఎస్.టి., మహిళలకు ఎన్నికైన మండళ్లలో రిజర్వేషన్ కల్పించారు. కొన్ని మండళ్ల అధ్యక్ష పదవులను స్త్రీలకు, ఎస్.సి., ఎస్.టి.లకు కేటాయించారు. రాజ్యాంగ చట్టాన్ని సవరించి 27 రకాల అధికారాలను పంచాయితీలకు దఖలు పరిచారు. ఇందుకు సంబంధించిన చట్టాలు, జి.ఒ.లు చదవుతూంటే సోషలిజానికి కూత వేటు దూరంలో ఉన్నట్లనిపిస్తుంది కదూ? ఆగండి. రాజూ ఏడు చేపల కథ మొదట్లోనే ఉన్నాం.

ఇది ప్రకటిత లక్ష్యం మాత్రమే. దీని వెనుక పాలక పార్టీ పదవీ వ్యామోహం ఉంది. మొట్టమొదటి ఎన్నికల తర్వాత శాసనసభలకు, పార్లమెంట్‌కు దేశవ్యాప్తంగా కాంగ్రెస్‌వాదులు పెద్ద సంఖ్యలో ఎన్నికయ్యారు. స్వాతంత్ర్యం కోసం మేమూ పోరాడాం, మాకూ అధికారంలో వాటా కావాలంటూ పార్టీ కార్యాలయాల తలుపులు తట్టడం ప్రారంభించారు. చట్ట సభల్లో సభ్యుల సంఖ్య పరిమితం. ఇంత మందికి అధికారంలో వాటా ఇవ్వాలంటే ఎలా. కొన్ని అధికార పదవులను సృష్టించకపోతే తమను పీక్కుతినేస్తారని అధికార, పదవులలంకరించిన నాయకులు ఒక వ్యూహ రచనకు పూనుకొన్నారు. ఆ వ్యూహ రచన చేయడానికి అప్పటి కాంగ్రెస్ నాయకుడు బల్వంతరాయ్ మెహతాకు అప్పగించారు. అప్పటి వరకూ ఉన్న గ్రామ పంచాయితీలకు రాష్ట్ర శాసనసభలకు మధ్య జిల్లా పరిషత్తులు, పంచాయితీ సమితులు ఏర్పాటు చేసి ఆ పథకానికి పరిపాలనా వికేంద్రీకరణ అనే ప్రజాస్వామ్య ముసుగు తగిలించారు. అదనంగా కొన్ని వేల పదవుల సృష్టి జరిగింది. (ప్రస్తుతం జిల్లా పరిషత్తులు, సమితులు, గ్రామ పంచాయితీల సంఖ్య 2,43,685; సభ్యుల సంఖ్య కూడా కలిపితే మరిన్ని లక్షల పదవులు). అతనికంటే ఘనుడు ఆచంట మల్లన్న అన్నట్లు 1983లో అధికారంలోకి వచ్చిన తెలుగుదేశం పార్టీ అధినేత ఎన్.టి.రామారావు 300 చిల్లర ఉన్న పంచాయితీల స్థానే 1100 మండల సమితులను సృష్టించారు. ఎందుకు? పరిపాలనా వ్యవస్థను ప్రజలకు మరింత దగ్గరగా తీసుకొని పోవడానికా? కాదు. ఆయన అధికార పగ్గాలు చేపట్టే నాటికి పంచాయితీ సమితుల్లో అత్యధిక శాతం కాంగ్రెస్ వారి చేతుల్లో ఉన్నాయి. వాటిని తన పార్టీ సభ్యులతో నింపడం ఎలా? తన పార్టీకేమో పాపులారిటి బాగానే ఉన్నా, కింది స్థాయిలో పార్టీ సభ్యత్వం, పార్టీ నిర్మాణం లేదు. గ్రామాలకు ఎలా విస్తరించాలి? మండల వ్యవస్థ సృష్టి వెనుక ఉన్న అసలు రహస్యం ఇది. ఇది రామారావు మార్క్ వికేంద్రీకరణ. ఎన్నికలు జరిపించారు. మండలాలలో అత్యధిక భాగం తెలుగుదేశం ఒళ్లో పడ్డాయి. అధికార వ్యవస్థతోపాటు పార్టీ యంత్రాంగం కూడా ఏర్పడింది. మామను వెన్నుపోటు పొడిచి అధికారం చేజిక్కించుకున్న చంద్రబాబు – ఈ పాటి ప్రజాస్వామ్యం కూడా అనుమతిస్తే ప్రజలు తెలివి మీరిపోతారేమోనన్నట్లు తన చెప్పు చేతుల్లో ఉండే ప్రత్యామ్నాయ వ్యవస్థకు ప్రాణం పోశాడు. మండల స్థాయిలో నోడల్ అధికారి అనే అధికారి నేర్పాటు చేసి అతనికే మండల సర్వాధికారాలు ఇచ్చారు. గ్రామ స్థాయిలో పాఠశాల కమిటీలు, నీటి కమిటీల లాంటి వాటినేర్పాటుచేసి ఆ కమిటీలను తన పార్టీ వారితో నింపి, మ్యామ్యాలు భోం చేసే అవకాశాలు కల్పించారు. ప్రజాస్వామ్య వ్యవస్థ అప్రజాస్వామిక వ్యవస్థగా తయారయేందుకు.

పాలకులకు వికేంద్రీకరణ సిద్ధాంతంలో విశ్వాసమే లేదనడానికి అందుకు సంబంధించిన చట్టమే నిలువెత్తు ఉదాహరణ. సమితులు, పరిషత్‌లు అన్నీ నిధుల కోసం రాష్ట్ర స్థాయి పరిపాలన వ్యవస్థ వైపు ఎదురు చూడాల్సిన నిబంధనలను ఆ చట్టంలో చేర్చడం ద్వారా ఆ సంస్థల మనుగడే తమపై ఆధారపడేలా, తాము జోక్యం చేసుకొనే విధంగా క్లాజులను పొందుపరచుకొన్నారు. నిధులు కొన్ని సేకరించుకొనే అధికారాలను ఈ సంస్థలకు దఖలు పరిచిన మాట వాస్తవం. ఆ ప్రకారంగా నిధులు సేకరించుకొంటే రాష్ట్ర ప్రభుత్వం వైపు చూడాల్సిన అవసరం ఉండేది కాదు. కాని గ్రామీణ ఆర్థిక, సాంఘిక వ్యవస్థ అలా సేకరించుకోలేదని పాలకులకు తెలుసు. ఈ బలహీనతను గమనంలో ఉంచుకొని అధికారాలు ఇచ్చినట్లే ఇచ్చి, వాళ్ల జుట్టు తమ చేతుల్లో

ఉండేలా చట్టాన్ని రూపొందించుకొన్నారు. అయితే అదే సమయంలో పరిపాలనా వికేంద్రీకరణతోపాటు అవినీతి కూడా వికేంద్రీకృతమైంది. రహదారులు, భవనాల నిర్మాణం, కాలువల తవ్వకాలు లాంటి పనులన్నీ సమితి పరిధుల్లోకి వెళ్లడంతో ఆ పనుల కాంట్రాక్టులన్నీ సమితి అధ్యక్షులో, లేక బినామీ పేర్లతో వారి అనుయాయులే సొంతం చేసుకున్నారు. రాష్ట్ర స్థాయి పరిపాలనా వ్యవస్థలో ఉన్న లంచగొండితనం వికేంద్రీకరణ జరిగింది. 90వ దశకంలో ప్రధాని రాజీవ్‌గాంధీ ప్రభుత్వం అమలు పరిచే అభివృద్ధి పథకాలు 15 శాతం మంది ప్రజలకు మాత్రమే చేరుతున్నాయనే పరిణామానికి వికేంద్రీకరణ వ్యవస్థే పునాదులు వేసింది. అధికారంలో ఉన్న తర్వాత, ఆశ్రిత పక్షపాతం దాని వెనకే వస్తుంది. వంధిమాగధులు చుట్టూ చేరుతారు, ఉడతా భక్తిగా తామూ కొంత బొక్కుతారు. పై నాయకులను, వారి చేష్టలను, అవినీతిని గమనిస్తూ – మన మూలానే ఇదంతా సాధ్యమవుతుంది కాబట్టి మనమే ఆ స్థానాలను ఆక్రమించేస్తే – అని వీళ్ల స్థాయిలో ఆలోచనలు రాగా, పై స్థాయిలో ఉన్న వారు ఇంకా పైకి ఎగబాకాలని ప్రయత్నాలు, పైరవీలు, సంచుల మార్పిడి జరిగింది. ఇలాంటి వ్యవహారాల్లో అసాంఘిక శక్తులు చోటు చేసుకోవడం సహజం. సమితి స్థాయిలో కాంట్రాక్టర్లు, ఎన్నికైన ప్రతినిధులు, అవినీతిలో చేయి తిరిగిన అధికారులు ఈ అసాంఘిక శక్తులకు తోడయ్యారు. ఈ రోజున మనమంతా ఆందోళన చెందుతున్న చట్ట సభల్లో అసాంఘిక శక్తుల ప్రవేశానికి ఆనాటి వికేంద్రీకరణచే ద్వారాలు తెరువబడ్డాయి. డబ్బు సంచులు చేతులు మారడమే అధికారానికి సోపానంగా ఎప్పుడు ప్రారంభమైందో అప్పుడే ఎన్నికల్లో హద్దు మీరి లక్షలు, కోట్లు ఖర్చు పెట్టడం అలాంటి శక్తులకు అనివార్యమైంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పలుచనైంది. ఈనాటి పార్లమెంటరీ ప్రజాస్వామ్య దీనావస్థకు, ఆనాటి పరిపాలన వికేంద్రీకరణకు ఉన్న సంబంధాన్ని గమనించాలి. విత్తనం ఒకటయితే చెట్టు వేరొకటవుతుందా? స్వతంత్రం రాకముందు గ్రామాల్లో పెత్తనం చెలాయించి గ్రామీణ ప్రజల జీవితాలను ఏ వర్గం శాసించిందో అదేవర్గం స్వతంత్రం తర్వాత కాంగ్రెస్ టోపీ ధరించింది. అవే శక్తులు, అదే వర్గం తమ పెత్తనాన్ని పంచాయితీ రాజ్ వ్యవస్థ ద్వారా కొనసాగించింది.

ఇదేదో ఆంధ్రప్రదేశ్‌కు మాత్రమే పరిమితమైంది కాదని, దేశ వ్యాపితంగా పరిస్థితి ఇదేనని రిజర్వ్ బ్యాంక్ డెవలప్‌మెంట్ రిసెర్చ్ గ్రూప్ చేసిన ఒక అధ్యయనం తెలియజేసింది. అయితే, ఆ గ్రూప్ పైన ఉదహరించినంత పచ్చిపచ్చిగా వికేంద్రీకరణ ముసుగును తొలగించి పంచాయితీరాజ్ నిజస్వరూపాన్ని ఆవిష్కరించలేదు. ఈ వైఫల్యాన్ని వారూ అంగీకరించారు. అయితే వారి పరిశీలన ఆర్థిక కోణం నుంచి జరిగింది. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎకనమిక్ ఎనాలిసిస్ అండ్ పాలసీకి చెందిన అభయ్ పెథే, బి.ఎం. మిశ్రా పి.బి. రాంఖే అనే పరిశోధకులు వారి పరిశోధనా ఫలితాలను 'స్ట్రెంతనింగ్ డీసెంట్రలైజేషన్ – అగ్‌మెంటింగ్ ది కంసాలిడేటెడ్ ఫండ్ ఆఫ్ ది స్టేట్స్ బై ది థర్టీన్త్ ఫైనాన్స్ కమిషన్ : ఎ నార్మటివ్ అప్రోచ్' అనే పత్రాన్ని విడుదల చేశారు.

దేశంలో గ్రామీణ, పట్టణ స్థానిక సంస్థల్లో ద్రవ్య పరిస్థితులు నిస్తేజంగా ఉన్నాయని పత్రం మొదట్లోనే అభిప్రాయం వ్యక్తం చేశారు. రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్ల సిఫార్సుల మేరకు స్థానిక సంస్థలకు నిధుల బదలాయింపు సమర్థవంతంగా జరగడం లేదన్నారు. రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్ల సిఫార్సుల పట్ల, రాష్ట్ర ప్రభుత్వాల వైఖరి పట్ల అసంతృప్తిని వ్యక్తం చేశారు. మంచినీరు, రహదారులు, విద్య – ఈ మూడు ప్రజాహిత కార్యక్రమాల నిర్వహణ, స్థిరాస్తుల మెయిన్‌టెనెన్స్ కోసం 12వ ఫైనాన్స్ కమిషన్ అయిదేళ్లకు 25 వేల కోట్లు కేటాయించాలని సిఫార్సు చేయగా, 13వ ఫైనాన్స్ కమిషన్ (గత నెలలోనే) మనది ఫెడరల్ రాజ్యాంగమైనా, ఆచరణలో అధికారాలు, నిధులు కేంద్రం చేతుల్లో ఉండిపోతాయి. స్థానిక సంస్థల నుంచి నిధుల కోసం రాష్ట్ర ప్రభుత్వం మీద ఒత్తిడి, రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రం మీద ఒత్తిడి పెంచుతూ వస్తున్నాయి. కేంద్ర, రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్లు నిధులు కేటాయించినా, సిఫార్సులు చేసినా, స్థానిక సంస్థల ద్రవ్య పరిస్థితులు ఎంత అధ్వాన్నంగా ఉన్నాయంటే, ఎంత చేసినా పరిస్థితులు మెరుగుపడడం లేదు. రాష్ట్రాల్లో ప్రాంతీయ పార్టీలు అధికారంలోకి రావడంతో, అలాగే బహుళ పార్టీల ప్రభుత్వాలు ఏర్పాటు చేస్తుండడంతో, రాజకీయ ఒత్తిళ్లు పెరుగుతున్నాయి. ఈ సంస్థల మీద రాజకీయ ఒత్తిడి పెరుగుతుండడంతో స్థానిక సంస్థల రెవెన్యూ వసూళ్లు మందగిస్తున్నాయి. ఈ మందగింపు పెరిగేకొలది, ఈ సంస్థలు రాష్ట్ర ప్రభుత్వాల మీద, రాష్ట్రాలు కేంద్రం మీద ఒత్తిళ్లు పెరగడం, ఈ నిధుల బట్వాడా ఎలా చేయాలో అని ఆ బాధ్యతను కేంద్ర ఫైనాన్స్ కమిషన్‌కు అప్పగించడం, దాని సిఫారసుల మేరకు, స్థానిక సంస్థలకు, నిధులు కేటాయించడం, ఆ నిధులు రాష్ట్ర ప్రభుత్వం ద్వారా స్థానిక సంస్థలకు సరిగా అందకపోవడంతో 'వాస్తవంగా వికేంద్రీకరణ వ్యవస్థ పనిచేయడం, స్థిరత్వం సంపాదించడం జరిగే వరకూ, కేంద్ర ఫైనాన్స్ కమిషన్ కేటాయించే నిధులను నేరుగా జిల్లా పరిషత్తులకే అందచేసే ఏర్పాటు చేయాలంటూ' పరిశోధనా పత్రం అభిప్రాయపడింది. ఫైనాన్స్ కమిషన్ గ్రాంట్ నిర్వహణ, మెయిన్‌టెనెన్స్ ఖర్చులో సగభాగం భరించి, మిగతా సగం స్థానిక సంస్థలే ఏర్పాటు చేసుకోవాలని సూచించింది. ఏ రాష్ట్రాలయితే వికేంద్రీకరణను చిత్తశుద్ధితో అమలు పరిచాయో, అక్కడే ఆర్థిక పరిస్థితులు చక్కగా ఉన్నాయని పరిశీలనలో తేలిందని చెప్పింది. ఏ రాష్ట్రాలు అయితే వికేంద్రీకరణ సమర్థవంతంగా అమలు జరిపాయో, ఆ రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రోత్సాహకాలు ప్రకటించాలని అభిప్రాయపడింది. ఈ సూచనలను కేంద్ర ఫైనాన్స్ కమిషన్ ఏ మేరకు అంగీకరించిందో, నివేదిక ప్రచురిస్తే తెలుస్తుంది.

మళ్లా రాష్ట్రంలోకి వస్తే జిల్లా పరిషత్తులు ఎలా పనిచేస్తున్నాయి, ప్రస్తుత తెలంగాణ ఉద్యమం నేపథ్యంలో వాటి ఆదాయ వ్యయాల తీరు తెన్నులు, తెలంగాణ జిల్లాలకు అన్యాయం జరుగుతుందా అనే విషయాన్ని పరిశీలిద్దాం.

ఆంధ్రప్రదేశ్‌లో కోస్తా, సీమ ఆంధ్రులు తెలంగాణ ప్రజలను దోచుకొంటున్నారని తెలంగాణ ఆంధ్ర నాయకుల ఆరోపణ. కాదు, ఆ రెండు ప్రాంతాల్లో ప్రజల నుంచి సేకరించిన ఆదాయాన్ని ఎక్కువగా తెలంగాణ ప్రాంతాల్లో ఖర్చు చేస్తున్నారని నేనంటా. తెలంగాణ ఆ ఇరు ప్రాంతాల వారిని దోచుకొంటున్నారనే ప్రత్యారోపణను నేను చేయడం లేదు. చేయను. వెనుకబడిన ప్రాంత అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం ఆ ఉభయ ప్రాంతాల్లో వసూలు చేసిన మొత్తాన్ని తెలంగాణలో ఖర్చు చేస్తున్నారని నేనంటాను. తెలంగాణ నాయకులు అసత్య ప్రచారం చేసి, తెలంగాణ ప్రజలను తప్పుదోవ పట్టించి, వైషమ్యాలను రెచ్చగొడ్డ తున్నారని నా ఆరోపణ. వెనుకబాటుతనానికి చారిత్రకంగా, పరిపాలనా

పరంగా తదితరంగా అనేక కారణాలుంటాయి. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత పారిశ్రామికంగా చాలా వెనుకబడిన రాష్ట్రం అని తెలిసిన విషయమే. కేంద్ర ప్రభుత్వరంగ పరిశ్రమలు వివిధ రాష్ట్రాల్లో ఉండగా ఆంధ్రప్రదేశ్‌లో ఒక్కటీ లేదు. ఈ విషయాన్ని కేంద్ర ప్రభుత్వ దృష్టికి తీసుకొని వెళ్లడానికి రాష్ట్రంలో ప్రజలు విధ్వంసకాండకు పూనుకోలేదు. రాష్ట్రంలో పరిశ్రమలు స్థాపించడానికి ఉన్న అవకాశాలను అధ్యయనం చేయించి ఒక నివేదిక తయారు చేసి, కేంద్రానికి పంపింది. ఈ అవకాశాలని వినియోగించుకోమని ఇతర రాష్ట్రాల్లో ఉన్న పారిశ్రామిక వేత్తలను ముఖ్యమంత్రి స్వయంగా వెళ్లి ఆహ్వానించారు. కేంద్రాన్ని ఒప్పించడానికి చేసిన ప్రయత్నాల ఫలితంగా బి.ఎచ్.ఇ.ఎల్., సింథటిక్ డ్రగ్స్, ఎచ్.ఎం.టి. లాంటి భారీపరిశ్రమలను రాష్ట్రానికి తెచ్చుకోగలిగాం. ఆనాడు ఆంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన ముఖ్యమంత్రులే పాలిస్తున్నా, ఈ పరిశ్రమలను తెలంగాణలో అంతర్భాగమే అంటున్న హైదరాబాద్ నగరంలో ఏర్పాటు చేయడం తెలంగాణ వాదులు గమనించాలి. అలాగే, నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నపుడే రెండు ప్రాంతాలకు రెండు నీటి పారుదల ప్రాజెక్టులను (ఆంధ్రకు నాగార్జునసాగర్, తెలంగాణకు శ్రీరాం సాగర్) సాధించుకొనివచ్చిన విషయాన్ని కూడా తెలంగాణ సోదరులు గమనించాలి.

ప్రజలకు దగ్గరగా ఉండేవి పంచాయితీరాజ్ సంస్థలు. ఈ సంస్థలు ఎంత సమర్థవంతంగా పనిచేస్తే, అవి ఆర్థికంగా ఎంత పటిష్ఠంగా ఉంటే ప్రజలకు అంత మేలు జరుగుతుంది. ఈ సంస్థల కీలకపాత్రను గుర్తించిన మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీ ఈ సంస్థలకు చట్టబద్ధత కల్పించారు. రాజ్యాంగాన్నే సవరించారు. అవి ఎలా పనిచేస్తున్నాయనేది వాటి ఆర్థిక సౌష్టవం మీద ఆధారపడి ఉంటుంది. ప్రస్తుత ఆంధ్ర – తెలంగాణ సంవాదం నేపథ్యంలో ఆంధ్ర నుంచి వచ్చిన ముఖ్యమంత్రులు తెలంగాణలోని జిల్లా పరిషత్‌ల పట్ల వివక్ష చూపించాలి అనే ప్రశ్నకు జవాబు కోసం వెతుకులాటలో రాష్ట్ర ఆర్థిక గణాంకశాఖ జిల్లా పరిషత్తుల ఆదాయ వ్యయాల సమాచారం ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణ ప్రాంతాల వారీగా ప్రచురించిన పుస్తకం లభించింది. ఆ సమాచారాన్ని మీతో పంచుకోవడమే ఈ వ్యాసం ఉద్దేశం. ఈ సంస్థల ఆర్థిక ఉనికి ప్రధానంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమకూర్చే నిధులే అని అందరికీ తెలిసిన విషయమే. అందుకుగాను, బడ్జెట్‌లోనే కేటాయింపు జరుగుతుంది.

2007–08 తాత్కాలిక అంచనాల ప్రకారం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు 22 జిల్లా పరిషత్తులకు రు. 2549 కోట్లు కేటాయించగా, అందులో 31 శాతం కోస్తా జిల్లాలకు, 26 శాతం రాయలసీమ జిల్లాలకు అందించగా తెలంగాణకు (హైదరాబాద్ మినహాయించి) 43 శాతం నిధులు అందాయి.

ఆ సంవత్సరంలో జిల్లా పరిషత్తులకు వచ్చిన ఆదాయం, ఆస్తుల సృష్టికి (కాపిటల్ రిసీట్స్) అందించిన ఆదాయం రు. 2693 కోట్లు కాగా తెలంగాణకు 43 శాతం, కోస్తాకు 32 శాతం, రాయలసీమకు 25 శాతం అందాయని గణాంకాలు తెలియచేస్తున్నాయి. ఇవి ఆదాయం లెక్కలైతే, ఖర్చు గురించిన సమాచారం ప్రకారం మొత్తం రు. 2213 కోట్లలో కోస్తాలో 31 శాతం, రాయలసీమలో 28 శాతం, తెలంగాణలో 41 శాతం వినియోగం జరిగింది. తెలంగాణలో ఆదాయం కన్నా వ్యయం తక్కువైంది. మరో విషయమేమంటే, మొత్తం ఖర్చులో ఆస్తుల కల్పనకు 81 శాతం ఖర్చు చేయడం జరిగింది. ఆస్తుల కల్పన అంటే రహదారులు, భవనాలు నుంచి నీటి సరఫరా వ్యవస్థ లాంటి ఖర్చులు. తెలంగాణకు అన్యాయం జరిగిందా? వివక్ష జరిగింది, తెలంగాణకు ఎక్కువ కేటాయింపు, ఎక్కువ ఖర్చు చేయడమే. తలసరి ఆదాయం వివరాలు చూస్తే రాష్ట్ర సగటు కన్నా ఎక్కువ ఆదాయం తెలంగాణలో మహబూబ్‌నగర్, మెదక్, నిజామాబాద్, ఖమ్మం, నల్లగొండలకు కాగా ఆంధ్రలో రెండు జిల్లాలకు, రాయలసీమలో రెండు జిల్లాలకు మాత్రమే ఎక్కువ ఆదాయం వచ్చింది.

తలసరి ఆదాయం తెలంగాణలో అంతకు ముందు ఏడాదిలో రు. 236లు కాగా, 2007–08లో రు. 338 కు పెరిగింది. ఈ విషయంలో తెలంగాణ కన్నా కోస్తా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల తలసరి ఆదాయం ఎక్కువగా ఉంది. ఇందుకు జనాభా ఎక్కువ తక్కువలు కావచ్చు. ఆ సంవత్సరం ఆదాయం ఎక్కువ వచ్చి ఉండవచ్చు. ఇక తలసరి ఖర్చు చూస్తే కోస్తా జిల్లాల్లో కన్నా (రు. 205లు) తెలంగాణలో (రు. 298లు) ఎక్కువ ఖర్చు జరిగింది. రాష్ట్ర సగటు కన్నా ఎక్కువ ఖర్చు తెలంగాణలో అయిదు, కోస్తా ఆంధ్ర మూడు, రాయలసీమలో రెండు జిల్లాల్లో జరిగింది.

జిల్లా పరిషత్తులకు ప్రధాన ఆర్థిక వనరు రాష్ట్రం, కేంద్రం ఇచ్చే గ్రాంట్లు అని చెప్పుకున్నాం. ఈ విషయంలో కూడా తెలంగాణకు పెద్ద పీటే వేశారు. ఈ ఆదాయంలో తెలంగాణ వాటా 43 శాతం, కోస్తా 31 శాతం, రాయలసీమ 26 శాతం. వివరాలు చూడండి.

| ప్రాంతం | రాష్ట్రం | | కేంద్రం | మొత్తం | శాతం |
|---|---|---|---|---|---|
| | **2007-08** | ఆస్తుల గ్రాంట్లు | ఆస్తుల గ్రాంట్లు | గ్రాంట్లు | |
| **కోస్తా ఆంధ్ర** | 15833 | 40393 | 22545 | 78772 | 30.91 |
| **రాయలసీమ** | 6459 | 39414 | 20806 | 66680 | 26.16 |
| **తెలంగాణ** | 11234 | 49769 | 48395 | 109398 | 42.93 |
| | **33526** | **129576** | **91747** | **254850** | **100.00** |

ఈ గ్రాంట్లలో రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చింది 64 శాతం అయితే, కేంద్రం ఇచ్చింది 36 శాతం. ఎక్కువలో ఎక్కువ కేంద్ర గ్రాంట్లు నల్లగొండ, మహబూబ్‌నగర్, మెదక్ జిల్లాలకు అందాయి. తెలంగాణ పట్ల వివక్ష చూపారనే ఆరోపణ ఎంత నిరాధారమైనదో పై గణాంకాలు తెలియజేస్తున్నాయి. గ్రాంట్లు అందుకోవడం లేదు, ఆ సొమ్మును సక్రమంగా ఖర్చు చేయడం లేదు. ఆ విషయాన్ని ఆయా జిల్లాల ప్రజలే తెలుసుకోవాలి. పరిషత్తుల సమావేశాల్లో సభ్యులు అధికారుల నుంచి సమాచారం రాబట్టు కోవాలి.

2007–08లో జిల్లా పరిషత్తులు జీత భత్యాల కోసం చేసిన ఖర్చు కోస్తాలో రు. 152 కోట్లు, రాయలసీమలో రు. 105 కోట్లు కాగా తెలంగాణలో రు. 101 కోట్లు ఖర్చు చేసాయి. స్థూల స్థిరాస్తుల కల్పన విలువ 2007–08లో కోస్తా రు. 540 కోట్లు, రాయలసీమ రు. 459 కోట్లు కాగా తెలంగాణలో రు. 810 కోట్లు. ఇంత నిధులు ఖర్చు చేసాయని, ఫలితంగా ఎంతో అభివృద్ధి జరిగిందని అనుకుంటే పొరపాటే. వీ

*సామూహికంగా ఉద్యమించి సాధించుకోవాల్సిన పరిష్కారాలకు బదులుగా ఒంటరిగా, నిరాశతో వెతుక్కునే సమాధానాలు సరైనవి కావంటూ, ప్రాణాలకు తెగించి పోరాడడమే మార్గం అంటున్నారు* **ఎ. అన్నపూర్ణ**

# ఆత్మహత్యలు పరిష్కారాలు కావు!

అయ్యో! ఆ తండాలో శ్వేత, ఈ వాడలో రజిత, ఆ పల్లెలో సువర్ణ, ఈ పట్టణంలో లక్ష్మి, మరోపక్క శ్రీకాంత్, వేణు, గంగాధర్, నరేందర్... ఇంకా ఎంతోమంది ఆత్మహత్యలతో అదృశ్యమైపోయారే. కన్నవాళ్లు, సహచరులు, కంటతడి పెడుతున్నారే. తిరిగిరాని బిడ్డల కోసం, ఆదివాసీ తండాలూ, దళితవాడలూ, పేదపల్లెలూ, పట్టణాలు శోకంలో మునిగిపోయాయే. ఈ రాజ్యానికి కనిపించదేం. పదవులకు పట్టదేం. ఓట్లను గుంజుకున్న ప్రభుత్వం భరోసానిచ్చే ఒక్క మాట మాట్లాడదేం.

చూసారా? ఈ రాజ్యపు క్రూరత్వం. ఆత్మహత్యల రూపంలో తెలంగాణమంతటా ఎంత వికృతంగా విజృంభిస్తుందో. ఈ రాకాసి రాజ్యపు రూపాలన్నీ పీడిత ప్రజలకీ, పోరాడే ప్రజలకీ ఎరుకే. అవగతమే. అయినా ఆ ప్రజలు తెలంగాణ కావాలనే అంటారు. మళ్లీ మళ్లీ అడుగుతారు. ఎందుకంటే తెలంగాణ ప్రజలకి స్వయంపాలన ఒక అవసరం. మనిషిని మనిషిని కలవనీయని అంతరాల దొంతర్లతో పెనవేసుకుపోయిన ఈ సమాజంలో మనిషికి స్వేచ్ఛ, ఆత్మగౌరవం ఆకలి కన్నా అత్యంత అవసరమైనదిగా ముందుకొస్తోంది. అలాంటిదే ఆరు దశాబ్దాలుగా తెలంగాణకై న్యాయపోరాటం. కానీ ఈ పాలక పార్టీలు హత్యలతో వందలాది ప్రజల ప్రాణాలను చితిలో చేర్చాయే తప్ప తెలంగాణ రాష్ట్ర ప్రతిపాదనను ఆమోదించలేదు.

ఇదిగో, ఈనాడు మళ్లీ రాజ్యం రగిలించిన ఆ చితిమంటల్లో మనమూ, మన పిల్లలూ అమాయకంగా దూకుతున్నాం. (రాజ్యానికి తూటా ఖర్చు కూడా మిగిలిస్తూ).

ప్రత్యేక తెలంగాణ ఒక ఉమ్మడి ఆశయం, ఉమ్మడి హక్కు, ఉమ్మడి ప్రయోజనం. ఈ ఆశయాన్ని, ఈ సమష్టి హక్కుని ఒంటరి పోరాటాలతో, ఆత్మహత్యలతో గెలుచుకోలేం. ఇది ఎంత సత్యమో మెరుగైన అవకాశం కోసమో, కోరిక కోసమో వ్యక్తమయ్యే ప్రతి ప్రజా పోరాటంలోనూ రాజ్యం రుజువు చేస్తూనే ఉంది. అంతేకాదు, అరవై ఏళ్లుగా తెలంగాణ చిందించిన రక్తం నిదర్శనం కాదా? ఇంతకన్నా ఏం కావాలి? ఈ బూర్జువా పార్టీలనూ, ప్రజాస్వామ్యంలో ఉన్న కుట్రను అర్థం చేసుకోవడానికి.

సాటి మనిషికి నష్టం జరిగితే అయ్యో అనలేని స్థితిలో ఉన్న సమాజంలో ఒక సమూహానికి జరిగే అన్యాయాన్నెట్లా గుర్తిస్తాం. ఎందుకు స్పందిస్తాం. మనమేం చేస్తున్నామో పక్కవాడికి తెలియదు. పొరుగువాడికేం కష్టం వచ్చిందో మనం గమనించం. ఒకరి గోడు మరొకరికెలా తెలుస్తుంది. ప్రజల కన్నీటి కథలూ, వ్యథలూ, పాటలూ, ఆటలూ దాచేసే పాలకుల చరిత్ర నడుస్తోంది. ప్రాంతాల నడుమనున్న అసమానతలు, మౌలిక అవసరాలు తెలియని అజ్ఞానంలో, అపోహల్లో ప్రజలు బతికేస్తున్నారు. అందుకే వ్యాపార పాలకులిచ్చే తప్పుడు సమాచారంతో, సంకేతాలతో నిన్నటి దాకా మిత్రులుగా, బంధువులుగా పెనవేసుకుపోయిన ప్రియమైన సాన్నిహిత్యానికి సైతం తప్పని ఎడబాటు. ఇదీ సామాన్య ప్రజల దుస్థితి. మరోపక్క అన్నీ అవగతమైన మేధావివర్గం, ప్రగతిశీలకులు సంకుచిత భావజాలంతో కొట్టుకుపోతున్నారు. నిశ్శబ్దంగా నిలిచిపోయారు.

మానవీయ స్పృహ, స్పందనలేని పాలకులు మనకి కాపు కాస్తున్నంత కాలం మనల్ని మనమే మరచిపోయే ధోరణికి అలవాటు పడిపోతాం. ఒంటరిగా మిగిలిపోతాం. ఈ బలహీనతని అధిగమిద్దాం. ఒక మనిషి హక్కుకోసం, విలువ కోసం అందరూ కలిసి పోరాడే, ప్రశ్నించే సంస్కృతికి దారులు వేద్దాం.

తెలంగాణ ప్రజలు కష్టాలనీ, నష్టాలనీ చవిచూసారు. ఈ కన్నీటి చరిత్రను మనచుట్టూ ఉన్న మన వర్గానికి వినిపిద్దాం. విశాల ప్రజా ఐక్యతతో, మద్దతుతో తెలంగాణను సాధించుకుందాం. అంతేగాని ఈ పోరాడేకాలాన్ని, బలవన్మరణాలకి సందర్భంగా మార్చొద్దు. కన్నతల్లికీ, ఉన్న ఊరుకీ ఆవేదననీ, అభద్రతనీ మిగల్చొద్దు. ఈ సమాజంలో ప్రతి మనిషికీ, భావాలకీ సమానమైన విలువల కోసం పరితపించిన హృదయాలెన్నో ఈ ప్రాంతం నుండే పోరాడి రాజ్యం తూటాలకు ఒరిగిపోయాయి. నేటికీ ఎదురొడ్డుతున్నాయి. మట్టికీ, మనిషికీ, ప్రాణానికీ విలువను పెంచిన ఉద్యమాల గనిలో, త్యాగాల పుట్టలో నేడు ఆత్మహత్యల గుట్టలా? నిజానికి ఈరోజు తెలంగాణ బలవన్మరణాల, ఆత్మార్పణాల సందర్భంలో ఉందా? ఇంతకాలం కొన్ని వర్గాలకే పరిమితమైన తెలంగాణ డిమాండ్‌ను ఈ రోజు ప్రతిపల్లె, ప్రతి ఇల్లూ, ప్రతి తండా, ప్రతి వాడా బలపరుస్తోంది. పోరాడుతోంది. పిల్లా-పెద్దా, ఆడా-మగా, కులం-మతం కలగలసిపోయాయి. ఒకే గొంతై తెలంగాణ సాధించుకుంటామంటున్నారు. ఈ ప్రభుత్వం చెప్పే కాకమ్మ కథలూ, బుజ్జగింపులూ, సముదాయింపులూ వినే, నమ్మే స్థితిని దాటిపోయారు. పనులను, బడులను పక్కనపెట్టారు. ఆకలినీ, అలసటనీ మరిచిపోయారు. కలాలనూ, గళాలనూ ఎత్తిపట్టి ఉద్యమిస్తున్నారు.

ఇంతటి ఉధృతమైపోయిన తెలంగాణలో ఆత్మార్పణలవసరమే లేదు. ప్రజాపోరాటాల పట్ల మనచుట్టూ పేరుకుపోయిన అజ్ఞానాన్నీ, చీకటినీ, నిశ్శబ్దాన్నీ బద్దలుకొట్టాల్సిన బాధ్యతను విస్మరించి ఆత్మహత్యల వైపు పయనించడం మరింత అజ్ఞానమే అవుతుంది. సమష్టిగా సాధిద్దాం.

తెలంగాణపై హోం మంత్రి ప్రకటన తర్వాత విద్యార్థులపై కేసులు ఎత్తివేయాలనే సూచన కూడా కనీసం అమలు చేయకపోవడాన్ని వివరిస్తూ, కేంద్ర ప్రభుత్వం అనేది ఎంత అవిశ్వసనీయంగా పనిచేస్తున్నదో వివరిస్తున్నారు **ఎడ్ల పోచయ్య**

# రాష్ట్రంలో ఆందోళనల దిశ ఎటు?

'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియను ప్రారంభిస్తున్నాం' అని డిసెంబర్ 9న కేంద్ర హోంమంత్రి ప్రకటించినప్పటి నుంచీ గడిచిన నెలన్నరలో రాష్ట్రంలో ఎన్నో అనూహ్యమైన, విషాదకరమైన, విచిత్రమైన, ప్రమాదకరమైన పరిణామాలు జరిగిపోయాయి. నడుస్తున్న చరిత్ర ఎంత వేగంగా మారిపోతున్నదంటే దీన్ని రాసేవాళ్లు ఎక్కడ ఆపినా చదివే సమయానికి చాల మార్పులు జరిగిఉండే అవకాశం ఉంది. దాదాపు ప్రతిరోజూ ఏదో ఒక కొత్త అంశం వచ్చి చేరుతున్నది. నిన్న ఊహించని మార్పు ఇవాళ జరిగిపోతున్నది. ఇవాళ జరుగుతున్న మార్పు అంతరార్థం ఏమిటో తెలియడం లేదు. రేపు ఏమి జరుగుతుందో ఊహించలేని పరిస్థితి నెలకొంటున్నది. ఈ పరిస్థితిలో డిసెంబర్ 9 ప్రకటన నాటినుంచి ఇది రాస్తున్న జనవరి 22 వరకూ ఆరువారాలలో జరిగిన పరిణామాలను విశ్లేషించడానికి చేస్తున్న ప్రయత్నమిది.

డిసెంబర్ 9 ప్రకటన మీద ఇప్పటికే చాలామంది తమ విమర్శలు, విశ్లేషణలు ప్రకటించారు గాని అసలు ఆ ప్రకటన గురించి చర్చించవలసిన విషయాలు ఇంకా మిగిలే ఉన్నాయి. ఆ ప్రకటనలో కేంద్ర హోంమంత్రి ప్రధానంగా మూడు విషయాలు చెప్పారు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతున్నదనే అంశం ఒకటి, అందుకోసం తగిన తీర్మానాన్ని ఆంధ్రప్రదేశ్ శాసనసభలో ప్రవేశ పెట్టనున్నారనేది మరొకటి, అప్పటికి పది రోజులుగా తెలంగాణలో జరిగిన ఆందోళనలో విద్యార్థుల మీద కేసులు ఉపసంహరించుకొమ్మని రాష్ట్ర ప్రభుత్వానికి చెపుతున్నామనేది మరొకటి. ఆరువారాలు గడిచిపోయినా ఈ మూడూ అమలులోకి రాలేదంటే ఈ దేశంలో కేంద్ర ప్రభుత్వమనేది ఎంత అవిశ్వసనీయంగా పనిచేస్తున్నదో రుజువవుతున్నది. కేంద్ర హోంమంత్రి మాటలకు ఎంతమాత్రం విలువలేదని, ఆ మాటలు ఆచరణలోకి రాకపోయినా లెక్కలేనంత తేలికయినవని రుజువవుతున్నది.

ఈ మూడు మాటలను కొంచెం జాగ్రత్తగా పరిశీలిద్దాం. మొదటి మాటకు, రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ అనే మాటకు, రాజ్యాంగం ప్రకారం ఉండగల అర్థం ఒకే ఒక్కటి. శషభిషలకు తావు లేదు. ఆ అర్థం ఏమంటే రాష్ట్ర విభజన కోసం, కొత్త రాష్ట్రం ఏర్పాటుకోసం ఒక బిల్లు తయారు చేసి పార్లమెంటులో ప్రవేశపెట్టడం. ఆ పని జరగాలంటే మొదట అటువంటి బిల్లు తయారుచేయడం కోసం హోంమంత్రిత్వశాఖ నుంచి న్యాయమంత్రిత్వశాఖకు అభ్యర్థన వెళ్లాలి. తగిన కాలవ్యవధిలో ఆ బిల్లు తయారయిన తర్వాత, రాష్ట్రపతి అనుమతితో ఆ బిల్లును లోకసభలోనూ, రాజ్యసభలోనూ ప్రవేశపెట్టాలి. అదేసమయంలో ఆ బిల్లును సంబంధిత రాష్ట్ర శాసనసభకు పంపించాలి. అలా పంపించడం కేవలం ఆ రాష్ట్ర శాసనసభ అభిప్రాయాలు తెలుసుకోవడానికి మాత్రమే గాని ఆమోదం కోసమో, తిరస్కారం కోసమో కాదు. రాష్ట్ర శాసనసభ ఆమోదించినా, తిరస్కరించినా, ఇచ్చిన గడువులోపల సమాధానం పంపకపోయినా పార్లమెంటులో బిల్లు చర్చకు వస్తుంది. రాజ్యాంగ అధికరణం, దాని మీద నిపుణుల వ్యాఖ్యలు, సుప్రీంకోర్టు తీర్పులు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. అసలు ఒక బిల్లును రాష్ట్ర శాసనసభకు పంపించిన తర్వాత కూడ, దాన్ని మార్చి, తిరిగి శాసనసభకు పంపకుండానే, పార్లమెంటులో ప్రవేశపెట్టడానికయినా కేంద్ర ప్రభుత్వానికి అధికారం ఉన్నదని సుప్రీంకోర్టు 1960లో ఒక తీర్పు చెప్పింది.

అందువల్ల హోంమంత్రి ప్రకటనలోని రెండో వాక్యం పూర్తిగా అనవసరమైనదీ, అర్థరహితమైనదీ. కొత్త రాష్ట్ర ఏర్పాటుకు పాత రాష్ట్ర శాసనసభ తీర్మానం అవసరమే లేదు. కాని స్వయంగా కేంద్ర హోంమంత్రి అటువంటి వ్యాఖ్య చేసి, రాజ్యాంగాన్ని, సుప్రీంకోర్టు తీర్పులను ఉల్లంఘించి, వక్రీకరించి దేశాన్ని తప్పుదారి పట్టించారు.

---

సమాన విలువలతో అనుభవించాల్సిన ఉన్నత అవకాశాన్నెవరూ కోల్పోకూడదు. అందుకే మిత్రులారా! తెలంగాణ ఇమ్మని మళ్లీ మళ్లీ అడుగుదాం. అవసరమైతే అరుద్దాం. ప్రాణాలకు తెగించి పోరాడుదాం.

తెలంగాణ కోసం దళితులే, మహిళలే, పేదలే ఆత్మహత్యలెందుకు చేసుకుంటున్నారు? ఒక్క ప్రజా ప్రతినిధి కూడా ఆత్మహత్య చేసుకోడేమని పోరాటాన్ని ఎద్దేవా చేసేవాళ్ల కోసం – తెలంగాణలోనే కాదు ప్రపంచం నలుమూలలా పోరాడేది, ప్రాణాలర్పించేది తిండిగింజలు లేని పేద ప్రజలే. ఆత్మగౌరవం కోసం పోరాడుతున్న దళితులే. జీవన స్రవంతిలో స్థానం లేని ఆదివాసులే. మనిషిగా గుర్తింపులేని మహిళలే. ఈ వర్గాలకే పోరాటాలు చేసే అవసరాన్ని, జీవితాలే త్యాగం చేసే పరిస్థితుల్ని కల్పిస్తూనే పాలకులు రాజ్యమేలు తున్నంత కాలం కడుపునిండిన ధనవంతులు రోడ్లెక్కరు. పదవులు, అధికారం ఉన్న బాబులు ఆత్మహత్యలు చేసుకోరు. మనందరం అనుభవిస్తోన్న స్వేచ్ఛకూ, హక్కుకూ పునాది పేదవాడు చిందించిన రక్తమేనని చరిత్ర సత్యాలని కుప్పగా పోసినా వివరం రాదేం. విజ్ఞానం కలగదేం.

ప్రజలారా! మేధావులారా! ప్రగతిశీలకాముకలారా! పిడికెడు స్వేచ్ఛ కోసం, గుప్పెడు అవకాశాల కోసం చేస్తోన్న తెలంగాణ ప్రజల ఆరాటాన్ని, పోరాటాన్ని అర్థం చేసుకొందాం. ఆహ్వానిద్దాం. బలపరుద్దాం. వీ

ఇక మూడో వాక్యంలో కేంద్ర హోంమంత్రి చెప్పినట్టుగా విద్యార్థుల మీద, ఆందోళనకారులమీద కేసులు ఉపసంహరించుకోవడం ఆరువారాల తర్వాత కూడ జరగలేదు. పైగా ఈ ఆరువారాలలో విద్యార్థుల మీద అదనంగా కొన్ని వందల కేసులు పెట్టారు. ఎంతమాత్రం సంబంధం లేని కేసులు పెట్టారు. విద్యాలయాలలోకి పోలీసులు ఇష్టారాజ్యంగా ప్రవేశిస్తూ తీవ్రమైన నిర్బంధకాండకు పాల్పడుతున్నారు.

అంటే మొత్తం మీద తేలేదేమంటే హోంమంత్రి ప్రకటనలోని మూడు వాక్యాలలో మొదటిది జరుగుతున్నదో లేదో తెలియదు. రెండవది జరగవలసిన అవసరమే లేదు. మూడోది జరగలేదు. ఈ దేశంలో అత్యున్నత అధికారంగల మంత్రి వ్యాఖ్యలకు పట్టిన గతి ఇది. దేశంలో పాలకవర్గాల మాటలకూ చేతలకూ మధ్య, పాలకవర్గ ప్రకటనలకూ ప్రజల ఆకాంక్షలకూ మధ్య ఉన్న దూరానికి సూచిక ఇది.

కేంద్ర హోంమంత్రి ప్రకటన తర్వాత కోస్తాంధ్ర, రాయలసీమలలో సమైక్యాంధ్ర, జై ఆంధ్ర, రాయలసీమ, గ్రేటర్ రాయలసీమ డిమాండ్లు, ఆందోళనలు చెలరేగాయి. కొన్నిచోట్ల నాయకుల ప్రోద్బలంతో ఈ ఆందోళనలు మొదలయినా, కాలక్రమంలో అనేక అనుమానాలతో, భయాలతో, సందేహాలతో విద్యార్థులు, ప్రజలు కూడ ఇందులో భాగం పంచుకున్నారు. వాస్తవాలు వివరించి, అనుమానాలను నివృత్తి చేసి, ప్రజాందోళనను ఆపి ఉండవలసిన ప్రజాప్రతినిధులే ప్రజలను రెచ్చగొట్టేలా ముందే రాజీనామాలు చేశారు, ప్రజలలో అనుమానాలను పెంచిపోషించారు.

ఆ ఆందోళన వల్ల, చివరికి డిసెంబర్ 23న కేంద్ర ప్రభుత్వం మరొక ప్రకటన చేయవలసి వచ్చింది. విస్తృత స్థాయి చర్చలు జరగవలసి ఉందని ప్రకటించింది. నిజానికి ఈ ప్రకటన డిసెంబర్ 9 ప్రకటనకు వ్యతిరేకమైనదేమీ కాదు గాని భిన్నమైనది. డిసెంబర్ 9 ప్రకారం పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టే ప్రక్రియ ప్రారంభించి ఆ తర్వాత ఎంతమందితో, ఎన్ని అంశాలపై, ఎంత విస్తృతస్థాయిలో చర్చలు జరిపినా ఫరవాలేదు. కాని బిల్లు ప్రక్రియను పక్కనపెట్టి చర్చలు జరుపుతామనడం డిసెంబర్ 9 ప్రకటన స్ఫూర్తిని ఉల్లంఘించడమే. విభిన్న ప్రజాసమూహాలు, అవసరాలు, ప్రయోజనాలు, ఆకాంక్షలు ఉన్న సమాజంలో చర్చలు, సంప్రదింపులు జరపవలసిన అవసరాన్ని ఎవరూ కాదనలేరు. తప్పనిసరిగా ఏ వివాదమైనా చర్చలద్వారా పరిష్కారం కావలసిందే.

కాని తెలంగాణ ఆకాంక్షల విషయంలో చర్చ యాభై సంవత్సరాలుగా జరుగుతూనే ఉన్నది. ఇప్పుడిక కొత్తగా తెలంగాణ ఏర్పడాలా లేదా అనే చర్చ అవసరం లేదు. తెలంగాణ రాష్ట్రం ఏర్పరిస్తే రాగల పరిణామాల గురించి చర్చ చేయవచ్చు. అంటే తెలంగాణ ఏర్పాటు ప్రక్రియను ఆపకుండానే, కొనసాగిస్తూనే ఆ చర్చ సాగించవచ్చు. కనుక డిసెంబర్ 23 ప్రకటన పూర్తిగా అనవసరమైనది, అర్థరహితమైనది. ఆ ప్రకటనవల్ల తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ వెనక్కిపోతున్నదేమోననే సందేహంతో తెలంగాణలో మళ్లీ ఒకసారి ప్రజాందోళన మొదలయింది.

డిసెంబర్ 23 ప్రకటనకు కొనసాగింపుగా జనవరి 5న ఢిల్లీలో సమావేశం ఏర్పాటయింది. రాష్ట్రంలోని గుర్తింపుపొందిన రాజకీయ పార్టీలన్నిటికీ డిసెంబర్ 30న ఆహ్వానం అందింది. అయితే ఆ ఆహ్వానంలో ఉపయోగించిన భాష తెలంగాణవాదులలో మరొకసారి అనుమానాలు రేకెత్తించింది. 'చర్చలకు అవసరమైన యంత్రాంగాన్ని, విధివిధానాలను రూపొందించడానికి' ఆ సమావేశమని కేంద్ర హోంమంత్రిత్వశాఖ లేఖలో రాయడంతో, రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమయిందని అన్నతర్వాత, ఆ ప్రక్రియ ముందుకు సాగకుండానే మళ్లీ చర్చలు ఏమిటని తెలంగాణవాదులు ప్రశ్నించారు.

అలాగే డిసెంబర్ 7న అఖిలపక్ష సమావేశంలో తెలిపిన అభిప్రాయాన్ని పార్టీలు మార్చుకున్నట్టు కనబడుతున్నదని, అందుకే మళ్లీ చర్చ అవసరమయిందనికూడ ఆ లేఖలో రాశారు. కాని అది నిజంకాదు. డిసెంబర్ 7 అఖిలపక్ష సమావేశంలో ప్రకటించిన వైఖరిని మార్చుకున్న పార్టీ ప్రజారాజ్యం ఒక్కటి మాత్రమే. మిగిలిన పార్టీలేవీ కూడ తమ అధికారిక అభిప్రాయాన్ని మార్చుకోలేదు. అందువల్ల ఆ కారణంతో చర్చ అవసరమే లేదు.

ఈలోగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జనవరి 3న విద్యార్థుల సభ 'విద్యార్థి గర్జన' జరిగింది. దాన్ని నిరోధించడానికి, ఆంక్షలు విధించడానికి ప్రభుత్వం, పోలీసు యంత్రాంగం అనేక ప్రయత్నాలు చేశాయి. చివరికి న్యాయస్థానం జోక్యంతో ఈ సభ జరిగింది. స్వతంత్ర పరిశీలకుల అంచనాల ప్రకారమే రెండు లక్షల మంది హాజరయిన ఈ సభ శాంతియుతంగా, న్యాయస్థానం షరతులకు లోబడే జరిగింది. తెలంగాణ రాష్ట్ర ఆకాంక్ష ఎంత ప్రబలంగా ఉన్నదో ఆ సభ చూపింది. అప్పటికే పది రోజులుగా తెలంగాణలోని పది జిల్లాలలోనూ అన్ని వర్గాల, సమూహాల ప్రజలు అనేక రూపాలలో తమ ఆకాంక్షలను ప్రకటిస్తూనే ఉన్నారు.

ఆ నేపథ్యంలో జనవరి 5 సమావేశంలో పాల్గొంటున్న అన్ని రాజకీయపక్షాలు తెలంగాణ రాష్ట్ర ఆకాంక్ష ప్రాముఖ్యతను, ప్రాబల్యాన్ని వివరించి, ఆ ప్రక్రియను వేగవంతం చేయమని కేంద్రప్రభుత్వాన్ని కోరి ఉండవలసింది. కాని కేంద్రప్రభుత్వ ఆహ్వానం దగ్గరినుంచీ కూడ ఈ సమావేశం తప్పులతడకగా సాగింది.

రాజకీయాల గురించి ఏ మాత్రం అవగాహన ఉన్నవాళ్లయినా రాజకీయపార్టీ అంటే స్థూలంగా ఒకే విశ్వాసం ఉండే మనుషుల సమూహం అని అనుకుంటారు. ఒకవేళ లోపల భిన్నాభిప్రాయాలు ఉన్నా అవి చర్చించుకుని పరిష్కరించుకుని ఒకేస్వరంతో బైటికి వస్తారని అనుకుంటారు. సమన్వయం కుదరకపోతే, అంతర్గతంగా వోటింగ్ జరుపుకుని మెజారిటీకి మైనారిటీ కట్టుబడి ఉండే సంప్రదాయం ఉంటుంది. అప్పుడప్పుడు ఒకే విశ్వాసానికి చెందిన భిన్న ఛాయలు, వ్యక్తీకరణలు కూడ వినబడవచ్చుగాని, ఒక పార్టీలో ఏకకాలంలో పరస్పర వ్యతిరేకమైన అభిప్రాయాలు ఉండవు. ఉంటే అది ఒక పార్టీ కానేకాదు. కాని విచిత్రంగా ఆంధ్రప్రదేశ్ లో రాజకీయవ్యవస్థ, రాజకీయపార్టీల సంప్రదాయాలు కుప్పకూలిపోయాయి. ఒక పార్టీ అధికారిక అభిప్రాయంగా ఒకటి ప్రకటిస్తుంది. దాని అగ్రనాయకులు ఆ పార్టీ కేంద్రకార్యాలయంలోనే పత్రికాసమావేశం పెట్టి ఆ అధికారిక అభిప్రాయానికి పూర్తిగా వ్యతిరేకమైన అభిప్రాయాన్ని ప్రకటిస్తుంటారు. పార్టీ అధినేతలు తమ అధికారిక అభిప్రాయం మారిందనీ చెప్పరు, మారలేదనీ చెప్పరు. అధికారిక వైఖరికి సంపూర్ణంగా వ్యతిరేక అభిప్రాయం ప్రకటించిన వాళ్లమీద ఎటువంటి క్రమశిక్షణా చర్యలు

ఉండవు. రాజకీయపార్టీల దివాళాకోరుతనానికి ఇంతకన్న మరొక నిదర్శనం అక్కరలేదు.

ఈ గందరగోళాన్ని సవరించవలసిన కేంద్ర ప్రభుత్వం ప్రతి పార్టీనుంచి ఇద్దరు ప్రతినిధులను పంపమని కోరి గందరగోళాన్ని మరింత పెంచింది. అంటే ప్రతిపార్టీకీ రెండు పరస్పర విరుద్ధ అభిప్రాయాలు ఉండే అవకాశాన్ని కేంద్రప్రభుత్వమే కల్పించింది. ముఖ్యమైన పార్టీలన్నీ రాష్ట్రంలోని రెండు ప్రాంతాలకు ప్రాతినిధ్యం వహించే ఇద్దరేసి ప్రతినిధులను పంపించాయి. అంటే వారందరూ ఆయా ప్రాంతాల ప్రతినిధులుగా వెళ్లారేగాని పార్టీల ప్రతినిధులుగా వెళ్లారనుకోవడానికి వీలులేదు. ఆమాటకొస్తే, తెలంగాణ నుంచి ఎంపికయిన ప్రతినిధులే అధికారిక అభిప్రాయం ప్రకటించారుగనుక వారు మాత్రమే పార్టీ ప్రతినిధులుగా వెళ్లారని, కోస్తాంధ్ర ప్రతినిధులుగా వెళ్లినవారు పార్టీ అభిప్రాయానికి భిన్నమైన వాదనను వినిపించారని అనవలసి ఉంటుంది.

జనవరి 5 సమావేశం ఏర్పాటులో ఎంత గందరగోళం జరిగినప్పటికీ, ఆ సమావేశాన్ని ప్రారంభిస్తూ కేంద్ర హోంమంత్రి చిదంబరం చేసిన ప్రసంగంలో తెలంగాణకు సానుకూలమైన అంశాలు రెండున్నాయి. ఒకటి, ఆయన తన డిసెంబర్ 9 ప్రకటనకు కోస్తాంధ్ర, రాయలసీమ నాయకులు చేసిన వక్రభాష్యాలను ఖండించారు. డిసెంబర్ 9 ప్రకటన హడావుడిగా రాత్రికి రాత్రి వచ్చిందనీ, ఎవరినీ సంప్రదించకుండా వచ్చిందనీ, చిదంబరం తమిళుడిగా వ్యక్తిగతంగా ఆ ప్రకటన చేశారనీ కోస్తాంధ్ర, రాయలసీమ నాయకులు, మేధావులు చెప్పిన మాటలను ఆయన నిర్ద్వంద్వంగా, స్పష్టంగా తోసిపుచ్చారు. అంటే కేంద్ర ప్రభుత్వం తన డిసెంబర్ 9 ప్రకటనకు, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు, కట్టుబడి ఉందని చెప్పకనే చెప్పారు.

అక్కడితో ఆగకుండా, తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షలు సుదీర్ఘకాలంగా సాగుతున్నాయని చెపుతూ హోంమంత్రి తెలంగాణ రాష్ట్ర ఉద్యమ చరిత్రనంతా వివరించారు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ నివేదిక, 1956 పెద్దమనుషుల ఒప్పందం, రాజ్యాంగంలోని 371 (1) అధికరణానికి సవరణ, ఆరు సూత్రాల పథకం, రాజ్యాంగంలో 371 డి అధికరణం చేర్పు, మే 2009లో అన్ని రాజకీయ పార్టీలు తమ ఎన్నికల ప్రణాళికలలో తెలంగాణ అంశం చేర్చడం గురించి ఆయన వివరించారు. ఈ వివరణ కూడ కేంద్రప్రభుత్వానికి తెలంగాణ అంశంలో సరయిన వైఖరి ఉందనే అభిప్రాయాన్ని కలిగించింది.

కాని అదే ఉపన్యాసంలో తెలంగాణ ఉద్యమాన్ని పక్కదారి పట్టించే ప్రయత్నాలు కూడ ఉన్నాయి. డిసెంబర్ 9 ప్రకటన తర్వాత పరిస్థితి మారిందని, అందువల్ల విస్తృత స్థాయి చర్చలు జరపవలసిన అవసరం ఉందని కేంద్ర ప్రభుత్వం భావిస్తున్నదని ఆయన అన్నారు. ఆ చర్చలకు అవసరమైన యంత్రాంగాన్ని, విధివిధానాలను రూపొందించడానికే ఈ సమావేశం అని ఆయన అన్నారు. అంటే అవి చర్చలు ఎట్లాజరగాలనే చర్చలు అని ఆయన అన్నారు. కావలసింది చర్యలు కాగా, చర్చల మీద చర్చలు జరపడం వృథా కాలయాపన, అసలు సమస్యను పక్కదారి పట్టించే ప్రయత్నమే.

అంతకన్న ఘోరంగా, డిసెంబర్ 9 ప్రకటన స్ఫూర్తిని, తెలంగాణ ప్రజల ఆకాంక్షలను పక్కనపెడుతూ మొత్తం సమస్యను శాంతి – అశాంతి సమస్యగా, శాంతి భద్రతల సమస్యగా మార్చే చాణక్యనీతిని కూడ హోంమంత్రి ప్రదర్శించారు. మొదట శాంతిని నెలకొల్పండి, తర్వాత మాట్లాడదాం అన్నారు. అశాంతి ఎందువల్ల ఏర్పడిందో కారణాలు తెలుసుకొని, వాటిని తొలగించకుండా, బాధితులనే మౌనం వహించమని, శ్మశాన శాంతిని నెలకొల్పమని అడగడం మౌలిక సమస్యమీద చర్చను వాయిదా వేయడానికే. భారతదేశంలో పాలకులకు ఎప్పుడూ అలవాటయిన కుటిలనీతి ఇదే. ప్రజలు తమ న్యాయమైన ఆకాంక్షల కోసం పోరాటానికి దిగిన ప్రతిసారీ, ఆ ఆకాంక్షలను నెరవేర్చే ప్రయత్నం ఏమాత్రం చేయకుండా, ఆ పోరాటంలో అశాంతి రగులుతున్నదనే పేరుతో, శాంతి నెలకొల్పమని ప్రబోధాలు పలకడం, అసాంఘిక శక్తులు అని ముద్రకొట్టి బాధితుల మీద నిర్బంధం ప్రయోగించడం మన పాలకులకు ఆనవాయితీ అయిపోయింది. జనవరి 5 సమావేశంలో పాల్గొన్న పార్టీలన్నీ పాలకవర్గ పార్టీలే కాబట్టి వారందరికీ కూడ ఈ శాంతి పరిభాష నచ్చింది. ఎనిమిది పార్టీల నాయకులూ ఒక ఉమ్మడి శాంతిప్రకటనమీద సంతకాలు చేశారు.

హోంమంత్రి ఆ ఉపన్యాసంలోనే అన్నిపార్లమెంటరీ పార్టీలనూ ఉద్దేశించి ఒక బెదిరింపు కూడ చేశారు. ఈ సమస్యలకు పార్లమెంటరీ ప్రజాస్వామ్య పరిష్కారం చూపడం తమ బాధ్యత అని చెపుతూ, 'పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే శక్తులు, మనం ఉమ్మడిగా విఫలమయితే సంతోషించడానికి పొంచికూచున్నాయని హెచ్చరిస్తున్నాను. ఆ శక్తులు బలపడడానికిగాని, ప్రాబల్యం సంతరించుకోవడానికి గాని మనం వీలు కల్పించగూడదు' అన్నారు.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే శక్తులు అనే మాట ద్వారా ఆయన మావోయిస్టు పార్టీని ఉద్దేశించారనేది స్పష్టమే. ఈ ఉద్యమంలో మావోయిస్టులు ఉన్నారనే బూచిచూపితే అసలు సమస్యను పక్కదారి పట్టించవచ్చు. ఉద్యమం మీద అణచివేత సాగించవచ్చు. ఆ తర్వాత రాష్ట్ర డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ నుంచి మొదలుపెట్టి కోస్తాంధ్ర, రాయలసీమలకు చెందిన నాయకుల వరకూ ఈ మాటనే వల్లించడం మొదలుపెట్టారు. తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో మావోయిస్టు శక్తులున్నాయని, వారే నాయకత్వం వహిస్తున్నారని, బలపడుతున్నారని, వారివల్లనే హింస జరుగుతున్నదని ఆరోపించడం మొదలుపెట్టారు. ఒక ప్రజా ఉద్యమంలో, అందులోనూ ప్రాంతీయ ఉద్యమంలో ఆ ప్రాంతంలోని అన్ని వర్గాలు, అన్ని సామాజిక బృందాలు, అన్ని భావజాలాలు, అన్ని రాజకీయ పక్షాలు, అన్ని ప్రజాసంఘాలు పాల్గొంటాయి. ఏ ఒక్కరికీ మినహాయింపు గాని, ప్రవేశానికి అనర్హత గాని ఉండదు. అలాగే ఒక రాజకీయ పార్టీగా మావోయిస్టు పార్టీ కూడ తెలంగాణ ఉద్యమంలో పాల్గొనదలచుకుంటే పాల్గొనవచ్చు. వారికి పాల్గొనే అర్హత లేదనే అర్హత ఎవరికీ ఉండదు. అంతేకాదు, తెలంగాణ ప్రజా ఆకాంక్షలను సమర్థించే విషయంలో అన్ని జాతీయ రాజకీయపార్టీలు, ప్రాంతీయపార్టీలు కూడ ఏదో ఒక సమయంలో మాట మార్చి ఉండవచ్చు గాని, 1969 నాటినుంచీ నిరంతరంగా, ఎన్నడూ మాటమార్చకుండా సమర్థిస్తున్నది మావోయిస్టు పార్టీ మాత్రమే. కనుక వారికి అర్హత లేదనో, వారు పాల్గొనడం తప్పనో అనడం కేవలం ఉద్యమం మీద నిర్బంధాన్ని ప్రయోగించడానికే.

జనవరి 5 సమావేశ ఫలితంగా ఒక కమిటీ వేస్తారనీ, సమావేశంలో స్థూలంగా తెలంగాణకే అనుకూలమైన వైఖరి

వెలువడిందనీ అనిపించినప్పటికీ, కొద్ది గంటలు గడవకుండానే ప్రణబ్ ముఖర్జీ తెలంగాణ ఏర్పాటుకు వ్యతిరేకమైన వ్యాఖ్యలు చేశారు. ఆ తర్వాత అభిషేక్ సింఘ్వీ, మనీష్ తివారీ, షకీల్ అహ్మద్, దిగ్విజయ్ సింగ్, అహ్మద్ పటేల్ వంటి వారు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియకు వ్యతిరేకమైన వ్యాఖ్యలు చేశారు. వీరందరూ కాంగ్రెస్ పార్టీ అధికార ప్రతినిధులు, సీనియర్ నాయకులు కాబట్టి అసలు కాంగ్రెస్ వైఖరి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు అనుకూలమా, ప్రతికూలమా తెలియని గందరగోళం వ్యాపించింది. మొత్తం మీద కేంద్ర ప్రభుత్వం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియను ప్రారంభించడంలో తాత్సారం చేస్తున్నదనీ, సాచివేత వైఖరిని అవలంబిస్తున్నదనీ, వీలయితే అసలు రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ నుంచి వెనక్కి పోవడానికి ప్రయత్నిస్తున్నదనీ అనుమానాలు తెలంగాణవాదులలో మొదలయ్యాయి.

ఈ ఆశోపహత స్థితి ఆత్మహత్యలకు, బలిదానాలకు దారితీసింది. ముఖ్యంగా నలభై ఏళ్ల ఎదురుచూపు తర్వాత డిసెంబర్ 9 ప్రకటనతో తమ సొంత రాష్ట్రపు కల సాకారమయిందనుకున్న విద్యార్థి యువజనులు ఈ కేంద్రప్రభుత్వ తాత్సారాన్ని, కోస్తాంధ్ర, రాయలసీమ నాయకుల ఎత్తుగడలను జీర్ణించుకోలేకపోయారు. అందిందనిపించిన ఫలం చేజారుతున్నదేమోననే ఆందోళన మనుషులను ఎటువంటి నిరాశా నిస్పృహలకు, ఆశాభంగానికి గురిచేస్తుందో అటువంటి నిరాశ తెలంగాణ ప్రజలను చుట్టుముట్టింది. ఆ నిరాశ అవసరం లేదని, కేంద్ర ప్రభుత్వాన్ని నిలదీయవచ్చుననీ, డిసెంబర్ 9 ప్రకటన స్ఫూర్తి సఫలమయ్యే శక్తిమంతమైన పోరాటరూపాలను చేపట్టాలనీ విజ్ఞప్తి చేసి, ప్రజలలో విశ్వాసం కలిగించగల నాయకత్వం కొరవడింది. ఇది రాస్తున్న సమయానికి దాదాపు రెండు వందల మంది తెలంగాణ ఆకాంక్షలతో ప్రాణత్యాగం చేశారు.

ఒక ఆకాంక్షకోసం, ప్రజాజీవన అభ్యున్నతికోసం నిస్వార్థంగా, తమ ప్రాణాలను బలిపెట్టే త్యాగనిరతి తప్పనిసరిగా గొప్ప ఆదర్శమే. అది సమాజ హితమే తన మనుగడకన్న ఎక్కువ అని ఒక వ్యక్తి భావించడానికి నిదర్శనమే. సమాజానికీ వ్యక్తికీ ఉండే సంబంధంలో వ్యక్తి తనను తాను రద్దు చేసుకుని సమాజానికి మేలు చేయగలనని అనుకోవడం సమంజసం కాదు. అందులోనూ తెలంగాణ రాష్ట ఏర్పాటు అనే రాజ్యాంగబద్ధమైన కోరిక కోసం ప్రాణత్యాగం అవసరం లేదు. ఇప్పటివరకూ అనుసరించిన పోరాటరూపాలు ఫలితం సాధించ లేదనుకుంటే ఇంకా బలోపేతమైన పోరాటరూపాలు అన్వేషించవచ్చు, ఆచరించవచ్చు. కాని వ్యక్తిగత స్థాయిలో పోరాటాన్ని విరమించడం సామూహిక పోరాటాన్ని బలోపేతం చేస్తుందని అనుకోవడం అమాయకత్వమే. ఆత్మత్యాగాలు తక్షణమే ఆపాలని, నిరాశను మరింత లక్ష్యశుద్ధిగల నిర్దిష్ట పోరాటరూపాలుగా మార్చుకోవాలని విద్యార్థి యువజనులకు, తెలంగాణ ప్రజలందరికీ ప్రతి ఒక్కరూ విజ్ఞప్తి చేయవలసి ఉన్నది. అదే సమయంలో ఈ బలిదానాల తరానికి విశ్వసనీయమైన నాయకత్వాన్ని, భవిష్యత్తుపట్ల నమ్మకాన్ని అందించలేక పోతున్నందుకు అన్ని రాజకీయపక్షాల నాయకులు, తెలంగాణలోని మేధావులు, బుద్ధిజీవులు తమను తాము ప్రశ్నించుకుని తమ మాటకూ చేతకూ పుటం పెట్టుకోవలసి ఉన్నది. జడివాన కురుస్తున్నా కదలని దున్నపోతులా ఉన్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇన్ని బలిదానాల తర్వాతయినా మేలుకొని రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియను ప్రారంభించాలని ప్రతిఒక్కరూ ఎలుగెత్తవలసి ఉన్నది. ఒత్తిడి చేయవలసి ఉన్నది.

తెలంగాణ ప్రజల ఆకాంక్షల సాఫల్యమైన తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును సంపూర్ణంగా సమర్థిస్తూనే, ఈ ఉద్యమక్రమంలో వెలికివచ్చిన కొన్ని పోరాటరూపాల గురించి, కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలతో తెలంగాణ ప్రజలకు ఏర్పడిన వైమనస్యం గురించి కూడ తీవ్రంగా ఆలోచించవలసి ఉన్నది. తెలంగాణ ప్రజా ఉద్యమం మరే ప్రాంత ప్రజలతో వైరం కాదు, కాగూడదు. అది కేవలం గత ఐదు దశాబ్దాలలో అమలయిన పాలక విధానాల మీద, వాటిని అమలు చేసిన పాలకుల మీద, వాటితో లాభపడిన పిడికెడుమంది ఆధిపత్య వర్గాలమీద పోరాటం మాత్రమే. అందువల్ల ఉద్యమక్రమంలో పోరాటరూపాలను ఎంచుకుంటున్నప్పుడు ఇతర ప్రాంత ప్రజలను నొప్పించే, అవమానించే భాషను, రూపాలను ఎంతమాత్రం వాడగూడదు. అవతలివైపు కూడ స్వార్థప్రయోజనాలు లేనివారందరూ సమర్థించగలిగిన పద్ధతిలో హేతుబద్ధంగా, న్యాయబద్ధంగా వాదనలు పోరాటరూపాలు ఉండాలి. నిజానికి తెలంగాణ రాష్ట్ర డిమాండ్ ఎంత న్యాయమైనదీ, హేతుబద్ధమైనదీ అంటే దాన్ని ఎవరిచేతనయినా ఒప్పించడానికి ఎటువంటి ఒత్తిడీ అవసరం లేదు. దుర్భాషలు, నిందలు, బెదిరింపులు, హింసాత్మక వ్యక్తీకరణలు అవసరమే లేదు. అలాగే అవతలి ప్రాంతంలో ఉన్నవారందరూ ప్రత్యర్థులు కారు. అసంఖ్యాక ప్రజలకు అక్కడ ఆందోళనతో సంబంధమేలేదు. సంబంధం ఉన్నవారికయినా వాస్తవాలు తెలియవు. అమాయకత్వంతో, తప్పుడు అభిప్రాయాలకు, అబద్ధాలకు బలి అయి ఆ ఆందోళనలో పాల్గొంటున్నవారు ఎందరో ఉన్నారు. స్వార్థప్రయోజనాలతో సమైక్యాంధ్ర వాదన చేస్తున్న పిడికెడు మంది ప్రత్యర్థులను ఆ అసంఖ్యాక జనబాహుళ్యం నుంచి వేరుచేయగల నేర్పును తెలంగాణ ఉద్యమకారులు ప్రదర్శించాలి. అలాగే యజ్ఞాలు, హోమాలు, శవయాత్రలు, దిష్టిబొమ్మల దహనాలు, పిండ ప్రదానాలు, శిరోముండనాలు, పాలాభిషేకాలు, స్త్రీలను అవమానపరచే బూతులతో ప్రత్యర్థులను తిట్టడం, గాజులు, పసుపు కుంకుమలు పంపించడం, అస్తిత్వ చిహ్నాలను గౌరవించడం పేరుతో మూఢాచారాలను పెంపొందించే ఆచరణ కూడ సబబేనా పరిశీలించుకోవాలి.

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు అనివార్యం. అది ఆలస్యమవుతుందేమోగాని అసాధ్యం కాదు. ఈ స్థితిలో ఇతర ప్రాంత ప్రజలతో వచ్చిన వైమనస్యాన్ని తగ్గించుకోవడానికి క్రమబద్ధమైన ప్రయత్నం చేయడం, ఆ ప్రాంత ప్రజలు కూడ సుఖశాంతుల, సుభిక్షమైన తెలంగాణను ఆమోదించేలా చూడడం, ఇప్పటికే ఇక్కడే బతుకుతున్న అన్ని జాతుల ప్రజల భద్రతకూ, ముఖ్యంగా కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజల భద్రతకూ ఒకటికి రెండుసార్లు హామీఇవ్వడం, భవిష్యత్తు తెలంగాణ గత ఏడెనిమిది దశాబ్దాల ప్రజాఉద్యమాల చైతన్యాన్ని పుణికిపుచ్చుకుని అన్నివర్గాల, అన్ని సామాజిక బృందాల, అన్నిప్రాంతాల సర్వతోముఖాభివృద్ధికి అవకాశమిస్తుందని సంకల్పం చెప్పుకోవడం, ముఖ్యంగా సమైక్యరాష్ట్రంలో తన వాటా కోసం ఉద్యమించిన తెలంగాణలో ఆదివాసులకు దళితులకు బహుజనులకు, స్త్రీలకు మైనారిటీలకు న్యాయమైన వాటా తప్పనిసరిగా దక్కుతుందని ప్రతిజ్ఞ పూనడం జరగాలి. వీ

*పాలకపార్టీల అవకాశవాద రాజకీయాలను ఎండగడుతూ, ప్రజా ఉద్యమంగా మారిన తెలంగాణ ఆకాంక్ష గురించి వివరిస్తున్నారు* **కె. సుబ్బనాచారి**

# ప్రజా ఉద్యమంగా తెలంగాణ

ఎట్టకేలకు ప్రత్యేక తెలంగాణకు కాంగ్రెస్ అధిష్టానం ఆమోద ముద్ర వేసింది. చాలా సంతోషించదగ్గ విషయమే. కాంగ్రెస్ అధిష్టానం ఆకస్మికంగా దిగి రాక తప్పని పరిస్థితులు ఏమిటి, అనేవి ముఖ్యంగా తెలుసుకోవాలి. గత నలభై సంవత్సరాలకు పైగా సాగుతున్న ఈ ఉద్యమం అనేక ఒడిదుడుకులకు లోనయింది. ఈ ఉద్యమాలకు నాయకత్వం వహిస్తున్నది పాలకులే అయినా ఉద్యమానికి ప్రజాస్వామ్య వాదులు, విప్లవవాదులు సహకరించారనేది వాస్తవం. వీరు సహకరించే స్థాయిలోనే ఉన్నారు గానీ నాయకత్వ స్థాయికి ఎదగలేదు. అయితే ఈనాటి పరిస్థితిని విశ్లేషిస్తే తేలేదేమిటంటే, ఈ విజయానికి ఏ ఒక్కరినో ఇద్దరినో ప్రధానంగా చూపించితే అది పాక్షిక దృష్టి అవుతుంది. పట్టుదలతో పనిచేసింది, పట్టు విడవకుండా ఈ ఉద్యమానికి చేదోడు, వాదోడుగా నిలిచింది మాత్రం విప్లవ పార్టీలే. దీనికి నాయకత్వం వహించిన పాలకవర్గ శక్తులను, వారి నిజస్వరూపాన్ని బహిర్గతపరుస్తూ వారి వలన వచ్చేది నిజమైన తెలంగాణ కాదు, ప్రజా తెలంగాణ రావాలంటే ఎప్పటికయినా పోరాటాల ద్వారానే అనే నిశ్చితాభిప్రాయాన్ని జనానికి కలిగించారు. ఎప్పుడు అవకాశం వచ్చినా ఈ ఉద్యమానికి బేషరతుగా మద్దతిచ్చి, ఏ స్వార్థం లేకుండా నిలబడింది విప్లవ పార్టీలే.

ఈరోజు వారి చేయిదాటిపోయే పరిస్థితులు వచ్చాయి, గనుక కాంగ్రెస్ హైకమాండ్ దిగిరాక తప్పలేదు. ఈ ఉద్యమాన్ని ఇలాగే కొనసాగనిస్తే మావోయిస్టులు బలపడతారేమో గమనించి ఏదో ఒక విధంగా అధికారం తమ చేతుల్లోనే ఉంచుకోవాలంటే విభజన చేయడమే వారికి తరుణోపాయమయింది. అంతదాకా పరిస్థితులు రాకుండా జాగ్రత్త పడడమే ఈ ఎత్తుగడలోని మర్మం. కాంగ్రెస్ అధిష్టానం దయా దాక్షిణ్యాలతో ఇచ్చింది మాత్రం కాదు. భవిష్యత్తు చేయి దాటిపోతుందని బాగా తెలుసుకొన్నారు. సైన్యాన్ని దించి ప్రయోజనం లేదనుకున్నారు. కాంగ్రెస్ అధిష్టానం దయచేసి ఇచ్చినట్లుగా ఉంటుంది కాబట్టి, చేయి దాటిపోకుండా వారే పాలకులు కావాలనేది ఎత్తుగడ. దీనికి కోస్తా ఆంధ్ర, రాయలసీమ కోటీశ్వరులు గూడ ఇష్టపడిన పరిస్థితులు సంభవించాయనేది నిజం. వీరందరికీ ప్రధాన అడ్డంకిగా కనబడేది ప్రజలు చేస్తున్న ఉద్యమాలే అనేది వాస్తవం. గత చరిత్రలోకెళితే నైజాం సంస్థానానికి వ్యతిరేకంగా కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వాన రైతాంగం పోరాడిన సందర్భాన్ని ఒక్కసారి గుర్తు చేసుకుంటే ఈ కాంగ్రెస్ కుటిల నీతి ఏమిటో తెలుస్తుంది. పేరుకి నైజాం నుండి విముక్తి కలిగించడానికి యూనియన్ సైన్యాలు వచ్చినప్పటికీ నవాబుతో రాజీమంతనాలాడి ఒప్పించి సంధి కుదుర్చుకొని అధికారం దోపిడీ పాలకవర్గాల చేతుల్లోనే ఉండేటట్లుగా చేసుకొన్నారు. రైతాంగ పోరాటాన్ని కొనసాగనిస్తే కమ్యూనిస్ట్ పార్టీ కచ్చితంగా అధికారానికి వచ్చి ఉండేది. కమ్యూనిస్ట్ పార్టీ ఆనాడు తెలంగాణ పోరాటంలో నాయకత్వ స్థాయికి ఎదిగి ఉన్నారనేది స్పష్టం. ఈనాడు అదే ఎత్తుగడతో కాంగ్రెస్ అధికారాన్ని తమ చేయి దాటి పోనివ్వకుండా చేసుకొన్న ఒక లాలూచీ ఒడంబడిక ఇది అనేది వాస్తవం. అధికార మార్పిడిలో వాళ్ల వర్గమే కాబట్టి దోపిడీ వర్గాలకు పోయేదేమీ లేదు. ప్రజాస్వామిక తెలంగాణ పోరాటం మాత్రం కొనసాగుతూనే ఉంటుంది. ప్రజల సమస్యలు పరిష్కారమయ్యే వరకూ ప్రజాపోరాటాలు జరుగుతూనే ఉంటాయి. ప్రజాస్వామిక తెలంగాణ నినాదం మాత్రం బతికే ఉంటుంది. ఇది చారిత్రక సత్యం. అయితే ఇక్కడ గమనించ వలసినది ఇంకొకటి ఉన్నది. తెలంగాణ ప్రాంతీయ దోపిడీదారులు మాత్రమే కాకుండా అన్ని సెక్షన్‌లూ కలిసివచ్చిన ఉద్యమం. కనుక త్వరగా విజయం సాధించగలిగింది. ఈ ఉద్యమానికి చాలా వయస్సే ఉంది, కానీ ఆకస్మికంగా ఉద్యమం ఉధృతి రూపం దాల్చే స్థితికి చేరుకొన్నది ఇప్పుడే.

అందుకే వారి చేయి దాటిపోకుండా ఉండాలంటే ఇవ్వకతప్పదు. ఇది ఒక కె.సి.ఆర్. ఘనత అనడానికి లేదు. నలభై సంవత్సరాలకు పైగా పోరాడిన చరిత్ర తెలంగాణ ప్రజలకు ఉంది. ఎప్పటికైనా ప్రజలు పోరాడి సాధించు కోవలసిందే. ఈ ఆకస్మిక పరిణామంలో అన్ని శక్తులూ కలిసొచ్చిన పరిస్థితి ఉంది. దీనికి కె.సి.ఆర్. సడలని దీక్ష మరొక కారణం అనేది యథార్థం.

కార్పొరేట్ ఆస్తుల మధ్య ఘర్షణ రూపం తీవ్రమవుతోంది. వారిలో వారికి ఉన్న ఈ ఘర్షణ రాజకీయ రూపం తీసుకొనే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఇది ప్రాంతాల మధ్య ఘర్షణగా రూపాంతరం చెందుతున్నది. ఈ కార్పొరేట్ ఆస్తులు మొత్తం హైదరాబాద్ నడిబొడ్డున నిక్షిప్తమై ఉన్నాయి. ఈ ఆస్తులను కాపాడుకొనేదెట్లా అనే ఆలోచన ఈ వర్గాలకు ఘర్షణాత్మక వైఖరి తీసుకొనేటట్లుగా పరిస్థితులు రూపుదిద్దు కుంటున్నాయి. ప్రజా ఉద్యమాల కన్న ఈ ప్రాంతీయ కార్పొరేట్ సంపన్నుల ఘర్షణలే ఈరోజు ప్రధానమైన సమస్యలుగా ముందుకు వచ్చాయి. ఈ సమస్యను పరిష్కరించే దిశగా కేంద్రం సతమతమైపోతున్నది. ఇదొక్క ఆంధ్రప్రదేశ్‌కే గాదు యావత్ భారతదేశం అంతా ఘర్షణలతో నేడు అట్టుడికిపోతోంది. ప్రత్యామ్నాయ నాయకత్వం లేకపోబట్టి బూర్జువా వర్గాల వైపుకు జనం పరుగులు పెడుతున్నారు.

*దేశాల నుంచి వ్యక్తుల వరకు అనవసరమైన పోటీ, అణగదొక్కే సంస్కృతులతో కాక సమాజ శ్రేయస్సే ధ్యేయంగా అభివృద్ధి జరగాలంటున్నారు* **విద్యాభూషణ్**

# తిరోగమన దిశలో నేటి ప్రజా జీవనం

గతితార్కికంగా సమాజం అభివృద్ధి వైపే పయనిస్తుందనేది ఓ తాత్విక సూత్రం. కానీ గతకాలపు అనుభవాలను బేరీజు వేసుకుంటే ఈ సూత్రీకరణ సమంజసం కాదేమోననిపిస్తుంది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుంచి జీవన పరిస్థితులను పరిశీలిస్తే, అదనపు వెసులు బాటు మాటేమో గానీ, రాజ్యాంగ బద్ధంగా సాధించుకున్న హక్కులనే కోల్పోయి, తిరిగి వాటి సాధన కోసమే ఉద్యమించాల్సిన పరిస్థితులు కనిపిస్తున్నాయి. ప్రధానంగా ఆర్థిక సంస్కరణల అమలు ఉనికిలోకి వచ్చిన తరువాత రాజ్యాంగ బద్ధతకే భంగం వాటిల్లిందా అన్న ప్రశ్న కలుగుతోంది.

రాజ్యాంగబద్ధంగా ప్రజలచే ఎన్నుకోబడిన ప్రజాస్వామ్య ప్రభుత్వం తాను పాలించే ప్రజలకు కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డను అందివ్వాల్సి ఉంది. కాని అరవై ఏళ్ల స్వతంత్ర ప్రజాస్వామ్యం, సంస్కరణల మూడోదశకు వచ్చేసరికి కనీస అవసరాల భరోసా నుంచి బానిసత్వపు ఛాయల్లోకి మళ్లిపోవడం గమనించవచ్చు. స్వేచ్ఛా మార్కెట్ ముసుగులో వ్యక్తి ప్రయోజనాలే కీలకంగా, ఏకధృవ వ్యవస్థ లక్ష్యాల కనుగుణంగా చేపట్టిన ఈ సంస్కరణలు, అసమానతల హెచ్చింపుకే దోహదపడ్డాయన్నది నిర్వివాదాంశం. అభివృద్ధి, ఉపాధి కల్పన, సంక్షేమం వంటి కీలకాంశాల నిర్వచనాలనే తిరగతోడుతున్న పరిస్థితుల్లోకి వచ్చేసింది నేటి ప్రజాజీవనం. ద్రవ్యోల్బణాన్ని నియంత్రించేందుకు ద్రవ్య చలామణీని కుదించాలన్న సాకుతో, ప్రభుత్వం తన బాధ్యతల నుంచి వైదొలుగుతున్న వైనం నేడు మనముందు ఉంది. సామాజిక శ్రమశక్తిని సక్రమంగా వినియోగిస్తూ ఆర్థికాభివృద్ధిని సాధించడం అన్నది ప్రాథమిక సూత్రం. వ్యవస్థానుగతంగా అభివృద్ధి కార్యక్రమాలకు రూపకల్పన జరగాలి. దీంతో ఉపాధి కల్పనకు అవకాశం కలిగి అభివృద్ధి సాధ్యమవుతుంది.

ఈ ప్రాతిపదికనే 1946లో భారత రాజ్యాంగ లక్ష్యాలను

---

అట్లా అని వారిమీద నమ్మకం ఉండి మాత్రం కాదు. ప్రపంచీకరణ నేపథ్యంలో జనాన్ని స్వార్థం అనే ఊబిలోకి దిగేటట్లు చేసింది అనేది కూడా మనం దృష్టిలో ఉంచుకోవాలి. ఇప్పుడు కావలసినది ఉద్యమకారులలో ఐక్యత. ఉద్యమ లక్ష్యానికి అనుగుణంగా కలసివచ్చే పార్టీలన్నీ సమైక్యత వైపుగా రావలసిన పరిస్థితులు కూడా వేగంగా వస్తున్నాయి. మనం కోరుకొన్నపుడు అవకాశాలు రావు. అవకాశాలు వచ్చినప్పుడు మనం సిద్ధంగా ఉండకుండా పోవడమే విప్లవ వైఫల్యానికి ప్రధాన కారణం. విప్లవ పార్టీలెప్పుడూ కూడా విప్లవ కార్యాచరణపై ప్రజల్ని సన్నద్ధం చేసే పనిలోనే నిమగ్నమైనపుడే అవకాశాలు విప్లవ పార్టీలవైపు వస్తాయి.

జనానికి నూతన మార్గం వైపుకు రావడానికి వీలు కలుగుతుంది. అంటే అత్యధిక జనం విశ్వాసాన్ని చూరగొన్నపుడే విప్లవ పార్టీలు బలపడగలవనేది దీనర్థం. ఇదే సందర్భంలో మరొక ముఖ్యమైన సమస్యను కూడా ప్రస్తావించుకోవడం మంచిది. అదే కులసమస్య. ప్రాంతీయ సమస్య కంటే కూడా ఈ కుల సమస్య ఒక్కొక్క పరి ప్రధాన మైనదిగా వస్తున్నది. ఈ కార్పొరేట్ సంపన్నులంతా ఏకులమైనా ఒక్కటయ్యారనేది స్పష్టం కావడం లేదా? ఇంతవరకూ కులం గురించి మాట్లాడే వారంతా ఒకటి అయ్యారనేది తెలుస్తోంది కదా? ఈ కార్పొరేట్ వర్గాలలో అన్ని కులాలు ఒక్కటై కలిసికట్టుగా వారి ఆస్తులే ప్రధానంగా భావించుకొని అన్ని పార్టీలలో ఉండే సంపన్నులంతా హైదరాబాద్ పోతుందేమోనని గగ్గోలు పెడుతున్నారు. ఆస్తుల కాడికి వచ్చేటప్పటికి కులాలన్నీ ఒకే తాటిమీదికి వచ్చాయనేది నిజం కావడం లేదా? ఈ మధ్యకాలంలో కులాలు ప్రధానంగా పోరాటాలు నడిపించాయి. ఇప్పుడు ప్రాంతాల మధ్య చిచ్చు రేగిన సందర్భంలో సంపన్నులంతా ఒక్కటయ్యారు.

ఇటీవలి కాలంలో అన్ని కులాలలోనూ కుల ఘర్షణలే తీవ్రంగా ఉండి పత్రికల నిండా అవే వార్తలైనాయి. ఈ సమస్య నుండి ఏ పార్టీకీ మినహాయింపు లేదు. ఇప్పుడు అన్ని పార్టీల ఎం.ఎల్.ఎ.లు రాజీనామా దిశగా పరుగెడుతున్నారు. ఒక్కొక్క పార్టీకి ఒక్కొక్క కులమే ప్రధానమై కూర్చొన్నది. ప్రత్యేక తెలంగాణ ప్రక్రియ ప్రారంభమవుతోందని చెప్పారో, లేదో అప్పుడే సంపన్న వర్గంగా ఉండే అన్ని పార్టీలలో అన్ని కులాలు ఒక్కటయ్యాయి. మత ఘర్షణ కానివ్వండి, కుల ఘర్షణ కానివ్వండి, ప్రాంతాల పేరుతో ఘర్షణ కానివ్వండి వీటన్నిటా కనబడేది ఆర్థిక కారణాలే అనేది సుస్పష్టం. ఆర్థిక కారణాలకు ఇవి ముసుగు మాత్రమే. ఈ ముసుగును తొలగించాల్సిన బాధ్యత ప్రధానంగా విప్లవ పార్టీలదే. బూర్జువా, భూస్వామిక పార్టీల నుండి దూరంగా జనం రావాలంటే ఈ పై ముసుగులను తొలగించినప్పుడే సాధ్యమవుతుంది.

ఈ దోపిడీ పాలకవర్గాల నిజస్వరూపాన్ని గురించి విప్లవకారులు ఇంతకాలం నుంచి గూడా జనానికి చెవికెక్కించలేక పోయారు. కానీ ఈనాడు దోపిడీ పాలకవర్గాలు తమ ముసుగును తామే తొలిగించుకునే పరిస్థితులు తలెత్తుతున్నాయి. ప్రజాస్వామిక తిరుగుబాటుకు ఇవి ఎంతో శుభపరిణామాలు. వీ

ప్రస్తావిస్తూ జవహర్‌లాల్ నెహ్రూ 'స్వతంత్ర పాలన పేద ప్రజలను అధోఃగతి నుంచి పైకి తీసుకురాగలగాలనీ, ఇందుకనువుగానే ప్రత్యేక పరిరక్షణ విధానాలు ఉండాల'నీ అన్నారు. ఇందుకనువుగానే మన రాజ్యాంగం ప్రజలందరి సామాజిక హోదాను పెంచే లక్ష్యంగా రూపొందింది. ఈ లక్ష్యంగానే ఉపాధి అవకాశాల్లో సమానత్వం, ఆలోచన, భావవ్యక్తీకరణ, కార్యాచరణలకు స్వేచ్ఛ కల్పించింది. దేశంలోని భిన్న మతాలను, కులాలను దృష్టిలో పెట్టుకునే స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం పునాదిగా గల మానవీయ విలువలకు ప్రాముఖ్యతనివ్వడం జరిగింది. వెనుకబడ్డ బలహీన వర్గాల పరిరక్షణ కోసం రాజ్యాంగం ప్రత్యేక చర్యలను చేపట్టింది. దీనికి ప్రాతిపదిక రాజ్యాంగంలోని 14వ అధికరణం. చట్టం ముందు అందరూ సమానులేనని నొక్కి చెప్పడం. దీనికి అనునయంగా కుల-మత-లింగ ప్రాంతీయ వివక్షలను నిషేధించాలనే 15వ అధికరణం. తదుపరి ప్రభుత్వ ఉపాధి అవకాశాల్లో అందరికీ సమాన అవకాశం కల్పించాలన్న 16వ అధికరణం. దీని పరిధిలోనే అసమాన శక్తుల మధ్య సమానమైన పోటీ ఉండకూడదనే రిజర్వేషన్ల సౌకర్యం కల్పించబడింది.

కానీ అరవై రెండేళ్ల స్వతంత్రపాలన ఏ దశకు వచ్చింది? ఇందుకు తాజా ఉదాహరణ వికలాంగురాలైన, వెనుకబడ్డ వర్గాలకు చెందిన ఓ వ్యవసాయాధికారిణి రాజకీయ ఒత్తిడులకు తట్టుకోలేక ఆత్మహత్యకు గురైంది. చదువుకున్న మహిళ పట్ల వర్ణ(ర్గ) దురహంకారం ఈ మేరకు ఉంటే, మరి చదువులేని నిరక్షరాస్యుల పరిస్థితేంటి? సమాజంలో పాతుకు పోయిన వర్ణ దురహంకారాన్ని రూపుమాపేందుకై రాజ్యాంగం, 17వ అధికరణం పేరిట అంటరానితనం ఏ రూపంలోనూ అమలు అయ్యేందుకు వీల్లేదని స్పష్టం చేస్తున్నా, బాహటంగానే వర్ణ వివక్ష జడలు విప్పుతోంది.

పైన పేర్కొన్న రాజ్యాంగ లక్ష్యాలన్నింటికీ భిన్నమైన ఆచరణనే మనం చూస్తున్నాం. ఉపాధి కల్పన నుంచి ప్రభుత్వం చేతులు దులిపేసుకుని ప్రజాజీవనాన్ని ప్రైవేట్‌పరం చేసేస్తోంది. పారిశ్రామికాభివృద్ధి బహుళజాతి సంస్థల లక్ష్యాలకనుగుణంగా వారి లక్ష్యాల మేరకు కుదువపెట్టబడింది. వందల వేలాది ఎకరాల పంట పొలాలను సెజ్‌ల పేరిట దారాధత్తం చేసేందుకూ సిద్ధమౌతోంది. మన గ్రామీణ భారత దేశంలో నేటికీ 70 శాతం వ్యవసాయానుబంధ వృత్తి జీవనాన్ని వెళ్లదీస్తున్నవారే. పాలకులు నిర్దేశించుకున్న వేలాది సెజ్‌ల నిర్మాణ లక్ష్యం సానుకూలమైతే ఈ 70 శాతం గ్రామీణ రైతాంగం మాటేమిటి? వీరి ప్రజాజీవనం ఏ స్థాయికి?

ఇప్పటికే అధికారం చేపట్టిన మాన్‌శాంటో వ్యవసాయం లక్షలాది మందిని వలసజీవుల్ని చేసిన వైనాలు కోకొల్లలు. పొట్ట చేత్తో పట్టుకుని కూలీలుగా మారిన చిన్న, సన్నకారు రైతులు వలసలకు నెలవవుతుంటే, గ్రామాలు ఖాళీ అయిపోతున్న పరిస్థితి. సంప్రదాయ వృత్తులు కరువై బతుకుకై వెదుకులాట ఈ సంస్కరణల నేపథ్యంలోనే. కూలీ చేసుకోలేని ఆత్మాభిమానం, ఆత్మహత్యలకు నెట్టేస్తున్న కథనాలు ఇంకెన్నో. మరోవైపు అందుబాటులో ఉన్న పారిశ్రామిక సంస్థల్లోని కార్మికుల పరిస్థితి ఇందుకు భిన్నంగా ఏం లేదు. అనేక ఉద్యమాల ఫలితంగా సాధించుకున్న ఉద్యోగ భద్రతకు నేడు ఉనికే లేకుండా పోయింది. ఈ సంస్కరణలకు అనువుగానే న్యాయవ్యవస్థ నర్తిస్తుందేమోననిపిస్తుంది. కార్మిక చట్టాలను సమీక్షించి, సవరించేందుకై ప్రత్యేక కమిటీలను నియమించడం కాకతాళీయం ఏమీకాదు. అదే తరహాల్లో బుద్ధిజీవుల ఉద్యోగ నియామకాలు సైతం చోటు చేసుకుంటున్నాయి. ఉపాధ్యాయులు, డాక్టర్లు, ఇంజనీర్లు అందరి నియామకాలు తాత్కాలిక ప్రాతిపదికనే. వారేమాత్రం అణుకువగా లేకున్నా, వ్యక్తిత్వాన్ని చూపినా వెనువెంటనే తొలిగించేందుకు అనువుగానే ఈ ఉపాధి కొనసాగింపుకు కనీసార్హత అణకువ. మరి ఈ ఆచరణ, మన రాజ్యాంగం 39వ అధికరణం పేరిట ఆపాదిస్తున్న తమకు తగ్గ జీవన భృతిని సంపాదించుకునే హక్కుకు ఏ విధంగా అనుసరణీయమన్నది ఆలోచించాలి. భౌతిక వనరులపై గుత్తాధిపత్యం, ఉత్పత్తి సాధనాలు కొందరి చేతుల్లోనే కేంద్రీకృతం అవడాన్ని మన రాజ్యాంగం ప్రశ్నిస్తున్నా, వాస్తవంగా జరుగుతున్నదేమిటి? ఈ సంస్కరణల పర్వంలో ప్రభుత్వమే సామాజిక వనరులను వ్యక్తులకు ధారాదత్తం చేస్తోంది. అదీ చట్టపరంగా నిర్వహించేందుకు 'పెట్టుబడి వికేంద్రీకరణ'. తత్ఫలితంగా అసంఘటిత రంగం సమష్టి ప్రయోజనాల మాట ఇక మంచుకొండే. ఈ ఆచరణ రాజ్యాంగం ప్రతిపాదిస్తున్న అన్ని వ్యవస్థల్లోనూ సామాజిక, రాజకీయ, ఆర్థిక సమ న్యాయాన్ని (38వ అధికరణం) ఉనికిని ప్రశ్నించడం లేదూ?

ఇంకా ముందుకు పోతే రాజ్యాంగంలోని 41వ అధికరణం ప్రభుత్వం తనకున్న పరిధిలో పని హక్కుని, విద్యా హక్కుని కల్పించేందుకు కృషి చేయాలని చెప్తుంది. అంతటితో ఆగిపోకుండా వృద్ధులకు, అశక్తులకు తోడ్పాటునందించే కృషి చెయ్యాలని అంది. చదువు కోవాలనుకుంటున్న వారికి 14వ ఏడు వచ్చేంత వరకూ నిర్బంధ ప్రాథమిక విద్య అందివ్వాలని సూచించగా, స్వాతంత్ర్యానికి అరవై రెండేళ్లు నిండిన సందర్భంగా అది చట్టంగా మారింది. ఈ చట్టం ఆచరణలోకి వచ్చే మార్గమే కనిపించడం లేదు. ఎందుకంటే? సంస్కరణలు విద్యను ఓ లాభదాయకమైన వాణిజ్య సరుకుగా మార్చేశాయి. పైగా ప్రభుత్వాల దృష్టిలో విద్య 'కాన్సెప్ట్' బహురూపాలుగా ఉంది. ఇక ఈ నిర్బంధ ప్రాథమిక విద్య చట్టం సంగతి ఇంతే సంగతులు. 43వ అధికరణం కార్మికుల జీవనానికి సరిపడా వేతనాన్ని దక్కేలా చూడమని ఆదేశిస్తుంటే భద్రత లేని ఉపాధి, ఇచ్చిన కాడికి పనిచేసే పరిస్థితుల్ని ప్రోది చేస్తోంది. అదే సంస్కరణల ఆవిర్భావానికి ముందైతే రాజ్యాంగ హామీ మేరకు, అవసరానికి తగ్గ వేతనం కై పోరాడాలని కార్మికవర్గం ఆలోచించేది. కానీ, సంస్కరణల ప్రభావంతో మొదలుకే మోసం వచ్చింది. బానిసల్లా బతకాల్సి వస్తోంది.

ఇక 46వ అధికరణం బలహీన వర్గాలకు రక్షణగా నిలవాలంటే, ఆధునిక జీవనం అడుగడుగునా కులవివక్షతను రెచ్చగొట్టి, నాగరిక సమాజం సిగ్గుపడేలా చేస్తోంది. ఇక షెడ్యూల్డ్ తెగల అభ్యున్నతి కోసం సైతం రాజ్యాంగంలో నిర్దిష్ట విధి విధానాలను పేర్కొంది. షెడ్యూల్డ్ తెగలు నివాసముండే ప్రాంతాల మెరుగుదల కోసం ప్రత్యేక గ్రాంట్లను 275వ అధికరణం సూచిస్తుంది. సంస్కరణలు అభివృద్ధి పేరిట షెడ్యూల్డ్ తెగలుండే అటవీ ప్రాంతాలను చదును చేసేసి, రహదార్లను నిర్మించి బహుళజాతి సంస్థలకు ధారాదత్తం చేసేస్తున్నాయి. అభివృద్ధి పేరిట ఇటీవల ఓ ప్రజానేత ప్రమాదానికి గురైన అటవీ ప్రాంతంలో స్మారక చిహ్నం నిర్మించే పేరిట 45 ఎకరాల అటవీ ప్రాంతాన్ని సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దనుందీ ప్రభుత్వం. కారణం ఆ అటవీ ప్రాంతం నలమల్ల ప్రాంతానికి చెందింది. నల్లమల అడవులు అంటే నక్సలైట్ల స్థావరాలు. ఇదీ సంగతి. ఇక రాజ్యాంగంలోని 330, 332 అధికరణాలు

పార్లమెంట్, శాసనసభల్లో షెడ్యూల్డ్ తెగల వారికి సీట్లను రిజర్వు చేశాయి. అలాగే 1992లో చేపట్టిన 73, 74 రాజ్యాంగ సవరణలు స్థానిక సంస్థల్లో ఎస్.సి., ఎస్.టి.లకు రిజర్వేషన్లను కల్పించగా ఆచరణలో 'లాయల్టీ'కే పరిమితమౌతున్న అనుభవాలున్నాయి.

ఈ విధంగా దేశ ప్రజల సర్వతోముఖాభివృద్ధికై రాజ్యాంగ ప్రియాంబల్‌లో పేర్కొన్న 'సర్వసత్తాక, లౌకిక, సామ్యవాద రిపబ్లిక్' దిశగా సాగాల్సిన పయనపు దిశ మార్చే ప్రయత్నం 1985లో జరిగింది (ప్రధాని రాజీవ్‌గాంధీ హయాంలో). నూతన విద్యా విధానం – నూతన పారిశ్రామిక విధానం వంటి నూతన విధానాల ముసుగున ఓ వందేళ్లు వెనక్కి నెట్టేయడం జరిగింది. అంతవరకూ రాజ్యాంగం ప్రజలకు ఇస్తున్న భరోసా నేపథ్యంలో, సమ సమాజ నిర్మాణానికై కృషి సల్పడం జరిగింది. ఇందుకనువుగా అనేకానేక ప్రజా పోరాటాలు పురుడు పోసుకున్నాయి. వీటి ఫలితంగా అనేకానేక కొత్త చట్టాలు రూపొందించుకుని అభివృద్ధిని సాధించుకున్న అనుభవాలున్నాయి. వర్గ సమాజంలోని అంతరాల దొంతరను కుదించే లక్ష్యంగా 'పేదరిక నిర్మూలన' చేపట్టాలని ఉద్యమాలు ఆశించాయి. ఆ లక్ష్యంగా గిరిజనుల అభివృద్ధికై వారి సంప్రదాయ కళలను, సంస్కృతిని ప్రోత్సహించేందుకు వారి భూముల పైనా, అటవీ ప్రాంతాలపైనా ప్రత్యేక హక్కుల్ని ఆపాదించే ప్రయత్నాలు జరిగాయి. ఆచరణలోకి వచ్చాయి. ఎప్పుడైతే వీరి అపార ఖనిజ సంపదలపై అగ్రరాజ్య కన్ను పడిందో, నాటి నుండి హక్కులు తిరగదోడడం మొదలైంది. రాజ్యాంగంలో పేర్కొన్న సమసమాజం (సోషలిస్టు) దిశగా, ధనిక–పేద అంతరాన్ని తొలగించేందుకు పేదల ఉనికికి ఊపిరినిచ్చేందుకై భూసంస్కరణలనూ ఆపాదించడం జరిగింది. వేలాది మంది రక్తతర్పణతో భూసాధన చేపట్టడం మొదలైంది. సుమారు 52.68 లక్షల ఎకరాల భూమి 54.85 లక్షల లబ్ధిదార్లకు పంపిణీ అయింది. వీరిలో 36 శాతం ఎస్.సి.లు కాగా 15 శాతం ఎస్.టి.లు ఉన్నారు. ఇప్పుడు భూసంస్కరణల స్థానంలో భూ ఆక్రమణలు ప్రభుత్వపరంగా మొదలయ్యాయి. ఏ ప్రజల భూములైనా కంటికి నదరుగా కనిపిస్తే చాలు ప్రభుత్వాలు నయానో–భయానో ఖాళీ చేయించి ఏ బహుళజాతి సంస్థకో ధారాదత్తం చేసేస్తోంది.

సంస్కరణలు అమలు అయ్యే ముందు అభివృద్ధి ఓ కొలమానంగా దినదినాభివృద్ధిగా కనిపిస్తుండేది – కాస్త నామమాత్రంగానైనా, గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న వనరుల మేరకే 'మిగులు' ఓ అభివృద్ధి కాగా, సమష్టి భావం – సమభావం దిశగా, అడుగులు పడుతున్న అరుదైన ఆలోచన నామ మాత్రంగానైనా ఉండేది. ఇక పట్టణ ప్రాంతాలకొస్తే పారిశ్రామికీకరణ పేరిట వెలుస్తున్న పారిశ్రామికవాడల్లో అరకొరగా నైనా ఉపాధి లభ్యమౌతున్న పరిస్థితులు. కనీస వేతనాల సాధన ప్రేరణతో అవసరానికి తగ్గ వేతన లక్ష్యాన్ని నిర్దేశించి, కార్మిక శక్తి అంతర్జాతీయ వీక్షణం నెరిపే స్థాయి రేఖా మాత్రంగానైనా ఉండేది. అది మరింత విస్తరిస్తుందనే సమష్టి ఆశ నరనరాన పాకుతూ ఉత్తేజాన్నిచ్చేది. కానీ ఇప్పటిదంతా వ్యక్తి వాదనే, వ్యక్తి వికాసమే. సమష్టి భావనకు నీళ్లొదిలేయడమే అయింది. ఫ్యూడల్ విలువల నుంచి ప్రజాస్వామ్య దిశగా చోటు చేసుకున్న పరిణామంలో స్త్రీ–పురుష సంబంధాల్లో ప్రగతి భావనలకు సంకేతాలు మొదలైనప్పటికీ, సంస్కరణల విదేశీ సంస్కృతి వీరి మధ్య అంతరాలను పెంచడమే కాదు, స్త్రీని ఓ విలాస వస్తుస్థాయికి దిగజార్చిన ప్రయత్నమూ జరిగింది. అంటే మళ్లీ ఫ్యూడల్ విలువలకు పూజ్యం కల్పించబడింది. చారిత్రక పరిణామాలను ఔపోసన పట్టిన విద్యార్థులను, యువతను ఉద్దేశ్యపూర్వకంగానే పక్కతోవ పట్టించే ప్రయత్నం జరిగింది. సంస్కృతీ కుట్ర సఫలమైంది. దీనికి పరాకాష్ఠే – 'నన్ను ప్రేమించనే డిమాండు, లేకుంటే దాడి – హత్య.' నాటి సామాజిక జీవనం నైతికత – విలువలు అడుగడుగునా ప్రభోదించేవి. నిజాయితీగా కష్టపడి ఎవరికాళ్లపై వాళ్లు నిలవాలనే లక్ష్యం ఉండేది. ప్రస్తుతం వ్యక్తి వికాస లక్ష్యాలు ఎన్ని అరాచకాలకు పాల్పడైనా 'తాను కోరుకున్నది సాధించుకోవాలనే' మూర్ఖత్వాన్ని నూరిపోస్తున్నాయి. దీంతో మనుషుల్లో మానవత్వం మంటగలిసిపోతోంది. నైతిక పతనం ఆరంభమవుతోంది.

ప్రజాస్వామిక ప్రగతి పథంలో, అంతిమంగా అసమానతలను తొలగించుకోగలిగితే, వర్గదొంతరలు సద్దుమణిగి 'సమభావం' వెల్లి విరుస్తుందనే ఆశాభావం నలుదిశలా విస్తరిస్తూ ఉండేది. నవనాగరికతకు దూరంగా ఉండే జాతుల్లో ఈ సమభావం కనిపించేది. ఎప్పుడైతే దేశాల మధ్యగానీ, వ్యక్తుల మధ్య గానీ పోటీతత్వం పెరుగుతుందో, వ్యక్తి వాదనకు అగ్ర భావనకూ బీజం పడుతుందో, 'అంతరాలు' పెరిగేందుకు అవకాశం కలుగుతుంది. అంతవరకూ పెంచుకుంటూ వచ్చిన నైతిక విలువలు తిరోగమిస్తాయి. ధనార్జన ఏకైక లక్ష్యమైపోయి, మానవతా విలువలు మంటగలిసి పోతాయి. పరిధిని మించిన లక్ష్యసాధన సైతం అంతిమంగా ప్రతికూల ఫలితాలనే ఇస్తుంది. దీన్నే 'శ్రుతిమించితే అపశ్రుతే' అని సరళంగా, ఓ నానుడిగా చెప్పుకోవచ్చు.

అగ్రరాజ్యపు ఎడతెరిపి లేని ధనదాహం, ఉత్పత్తి లక్ష్యం నేడు ఏ దశకు తీసుకువచ్చిందనేది ఆలోచించాలి.

మరి, అంతరాలను కుదించే లక్ష్యంగా పేదరిక నిర్మూలనకై కృషి చేస్తే పేదరికం నశించి, శ్రామిక శక్తి వికసిస్తుంది. పని చేసుకునే హక్కు, చదువుకునే హక్కు వంటి రాజ్యాంగబద్ధమైన హక్కులను పునరుద్ధరిస్తే చాలు. దేశభక్తియుత ప్రజాస్వామ్య వాతావరణం వెల్లి విరుస్తుంది. ఒకనాడు పోరాడి సాధించుకున్న రాజ్యాంగబద్ధమైన హక్కుల అమలుకోసం నేడు మరోసారి పోరాడాలన్న మాట. మితిమీరిన ఉత్పత్తులను ఏ సముద్రాల పాలో చేసే ఆలోచన కంటే, కూడులేని పేదవారికి అందివ్వాలనే మానవతా లక్ష్యాలను పాలకులు అలవర్చు కోవాలి. ఏకీకృత లక్ష్యంతో సాగిస్తున్న పాలన, ఇంతటి ఆశాజనక ఆలోచనలకు తావిచ్చే అవకాశం తక్కువ. వీరిని ఆ దిశగా ఆలోచింప చేయడమే ప్రజల పక్షాన నిలిచే ఆబాలగోపాలం చేయాల్సిన పని. మరి ఆ దిశగా కృషి సల్పడమే ప్రజాస్వామ్యవాదుల తక్షణ కర్తవ్యం. వీ

*భూమి పుత్రులందరికీ సమానంగా అందవలసిన ఖనిజ సంపద దేశదేశాల సంపన్నుల బొక్కసాలలోకి ఎలా తరలిపోతోందో వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# అసలెవరివీ ఖనిజ నిలువలు?

దేశంలో ఎక్కడయినా, ముఖ్యంగా మధ్యభారతం నుంచి ఎటువైపయినా వెళ్లే రైలు మార్గాన్ని ఒక గంటసేపు చూడండి. ఆ గంటలోనే కనీసం నాలుగైదు రైళ్లు, రైలుకు ఇరవై, ముప్పై పెట్టెల నిండా రకరకాల ఖనిజాల్ని మోసుకుపోతూ కనబడతాయి. అంటే రోజుకు కొన్ని లక్షల టన్నుల ఖనిజం బైటికి వెళ్తూ ఉంటుంది. ఆ ఖనిజపు విలువ రోజుకు కొన్ని వేలకోట్ల రూపాయలు ఉంటుంది. ఆ ఖనిజ నిక్షేపాలు తవ్వే కాంట్రాక్టులు చేపట్టినవాళ్లు, అమ్ముకునేవాళ్లు, వాటిని తమ పరిశ్రమలలో వాడుకునే వాళ్లు వేలకోట్లరూపాయలు గడిస్తున్నారు. జాతిసంపదమీద అధికారాన్ని నిర్వహించే ప్రభుత్వాలు కొన్ని వందలకోట్లు పన్నులు, ఆదాయవాటాలు సంపాదిస్తున్నాయి. కాని ఆ ఖనిజనిక్షేపాలు ఎవరి నేలలో ఉన్నాయో, ఎవరి బతుకులలో భాగమో, ఎవరు వాటిని తవ్వితీస్తున్నారో వారి బతుకులు మాత్రం రోజురోజుకూ ఛిద్రమవుతున్నాయి. ఈ ఖనిజ నిలువలు ఉన్న ప్రాంతాలు ప్రధానంగా ఆదివాసి, అటవీ ప్రాంతాలు, రాజ్యాంగం ఐదవ షెడ్యూల్ వంటి రక్షణ ఉన్న ప్రాంతాలు. అయినా ఖనిజ నిలువల దోపిడీ నిరంతరాయంగా సాగిపోతోంది.

ఒరిస్సాలోని అపారమైన ఇనుము, మాంగనీస్, బాక్సైట్ ఖనిజ నిలువలతో వేదాంత అనే బహుళజాతిసంస్థ కోట్ల రూపాయలు సంపాదిస్తోంది. జార్ఖండ్‌లోని ఖనిజ నిలువలను బహుళజాతి సంస్థలకు, గనుల మాఫియాకు అప్పగించడం ద్వారా మాజీ ముఖ్యమంత్రి మధు కోడా కోట్లకు పడగెత్తాడు. కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సరిహద్దులను కూడ చెరిపేసి ఇనుపఖనిజం తవ్వుకున్న భారతీయ జనతాపార్టీ మంత్రి గాలి జనార్దనరెడ్డి కోట్లకు పడగెత్తడం మాత్రమే కాదు, రెండు రాష్ట్రాల లోనూ ప్రభుత్వ విధానాలను శాసిస్తున్నాడు. రెండు రాష్ట్రాలలోనూ అనేక సంస్థలలో బేనామీ పెట్టుబడులు పెడుతున్నాడు. ఒరిస్సా, జార్ఖండ్, చత్తీస్‌గడ్ వంటి రాష్ట్రాలలో ఖనిజనిలువలను బహుళజాతి సంస్థలు అక్రమంగా తవ్వుకుపోవడం, కడపజిల్లాలో ఇనుప ఖనిజం తవ్వకాలలో గాలి జనార్ధనరెడ్డికి చెందిన ఓబుళాపురం మైన్స్ కంపెనీ సాగించిన అక్రమాలు, ఆపరేషన్ గ్రీన్‌హంట్ అనేది గనుల మాఫియాకు విశాల భూభాగాలను కట్టబెట్టడానికేనని రచయిత్రి అరుంధతీ రాయ్ చేసిన విమర్శలు మొదలయిన పరిణామాలవల్ల ఇటీవల ఖనిజాల గురించి, ఖనిజ నిలువల వినియోగం గురించి చాల చర్చ జరుగుతున్నది. చాల కాలంగా ప్రభుత్వ రహస్యాలుగా, ప్రజల దృష్టికి రాకుండా ఉండిపోయిన అనేక అంశాలు వెలుగులోకి వస్తున్నాయి.

ఇసుక తవ్వుకుపోతూ వాగులు వట్టిపోయేలా చేయడం దగ్గరి నుంచి వేల సంవత్సరాలుగా భూమిలో భద్రంగా ఉన్న ఖనిజ నిలువలను, ఆ ప్రాంతవాసులకు ఉపయోగపడవలసిన సంపదను కొల్లగొట్టడం వరకూ మన సమాజంలో ఈ అక్రమవ్యాపారం సర్వత్రా వ్యాపించి ఉంది. ఈ గనుల తవ్వకాలు మన సంపదను మనకు కాకుండా చేస్తున్నాయి, అక్రమార్జనాపరుల పాలు చేస్తున్నాయి. మన పర్యావరణాన్ని, ఆరోగ్యాలను దెబ్బతీస్తున్నాయి. మన రాజకీయార్థిక విధానాలను శాసిస్తున్నాయి. చివరికి ప్రభుత్వాదాయానికి కూడ గండి కొడుతున్నాయి.

ఇదంతా ఎవరి సొమ్ము? ఎవరు కబ్జా చేసి సొంత బొక్కసాలు నింపుకుంటున్నారు? ప్రకృతి సహజంగా సమాజానికి అందిన ఈ సంపద, వేల సంవత్సరాలుగా భూమిలో నిక్షిప్తమై, ఆ భూమి పుత్రులందరికీ సమానంగా అందవలసిన సంపద, ఆ భూమిపుత్రుల సర్వతోముఖాభివృద్ధికి ఉపయోగపడవలసిన ఈ సంపద ఎందువల్ల పిడికెడు మంది సంపన్నుల చేతుల్లోకి ప్రవహిస్తున్నది? ఏ రాజకీయార్థిక, సామాజిక శక్తులు ఈ జాతి సంపదను కొద్దిమందికి హక్కుభుక్తంగా రాసి ఇస్తున్నాయి?

భారత భూభాగంలో మానవజీవితానికి అవసరమైన ఖనిజ నిలువలు అనేకం ఉన్నాయని, వాటిని వాడుకోవచ్చునని ప్రాచీనకాలం నుంచి కూడ అవగాహన ఉంది. ఇనుము, రాగి, వెండి, బంగారం వంటి లోహాల గురించీ, ఉక్కు, కంచు వంటి మిశ్రమాల గురించి భారతీయులకు వేలసంవత్సరాలుగా తెలుసుననడానికి ఎన్నో ఆధారాలున్నాయి. అయితే ఆధునిక గనుల తవ్వకం, ఖనిజాల వాడకం బ్రిటిష్ పాలనతోనే మొదలయ్యాయి. బ్రిటిష్ వలసవాదుల పాలనా విధానంలోని ప్రధానాంశం భారత ఉపఖండంలోని సహజసంపదలను కొల్లగొట్టి తమ దేశానికి తరలించుకుపోవడం, తమ పరిశ్రమలకు ముడి సరుకులుగా వాడుకోవడం. అందుకే దేశంలో ఉన్న ఖనిజనిక్షేపాల మొట్టమొదటి చిత్రపటాన్ని బ్రిటిష్ అధికారులే 1821లో తయారు చేశారు. రైళ్లకు అవసరమయిన బొగ్గు నిలువలను కనిపెట్టి తవ్వడంకోసం 1851లో బిటిష్ ప్రభుత్వం జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాను ప్రారంభించింది. అలాగే గనులు, భూగర్భ వనరుల శాఖను 1887లో ఏర్పాటు చేసింది. గనులకోసం భూసేకరణ చట్టాన్ని 1885లోనే తీసుకు వచ్చింది. ఆ తర్వాత 1901 భారత గనుల చట్టం, 1923 భారత గనుల పాలనా చట్టం వంటి చట్టాల ద్వారా దేశంలోని ఖనిజనిలువల

మీద ఈస్టిండియా కంపెనీకి, బ్రిటిష్ ప్రభుత్వానికి, ఆ ప్రభుత్వం నియమించిన కంట్రాక్టర్లకు అధికారాన్ని స్థిరపరచుకుంది.

వలసవ్యతిరేక జాతీయోద్యమం దేశంలోని ఖనిజ సంపదమీద దేశ ప్రజలందరికీ హక్కు ఉంటుందని భావించింది. గనులు, ఖనిజ నిలువలు ఏ ఒక్కరి వ్యక్తిగత ఆస్తి కావడానికి వీలులేదని భావించింది. అందుకే 1947 తర్వాత గనులను, ఖనిజ సంపదను జాతికి చెందిన ఉమ్మడి ఆస్తిగా గుర్తించి వాటిని నియంత్రించే, అభివృద్ధిచేసే, పరిరక్షించే బాధ్యతను ప్రభుత్వానికి ఇవ్వడం జరిగింది. భారతరాజ్యాంగం గనులను, ఖనిజాభివృద్ధిని కేంద్ర జాబితాలోనూ, రాష్ట్ర జాబితాలోనూ చేర్చింది. చమురు క్షేత్రాలను, చమురు సంబంధిత ఖనిజనిలువలను, పెట్రోలియం ను, పెట్రోలియం ఉత్పత్తులను నియంత్రణ, అభివృద్ధి (అంశం 53), పార్లమెంటు చట్టం ద్వారా కేంద్రప్రభుత్వానికి అప్పగించిన గనుల, ఖనిజ నిలువల నియంత్రణ, అభివృద్ధి (అంశం 54) కేంద్ర ప్రభుత్వ పరిధిలోకి వస్తాయి. కేంద్ర ప్రభుత్వ పరిధిలో లేని ఇతర గనుల, ఖనిజాభివృద్ధి అంతా రాష్ట్ర ప్రభుత్వ పరిధిలోకి (రాష్ట్ర జాబితా అంశం 23) వస్తుంది.

కేంద్ర ప్రభుత్వంలోని గనుల మంత్రిత్వ శాఖ దేశంలోని ఖనిజాల సర్వేక్షణకు, అన్వేషణకు, ఉత్పత్తికి బాధ్యత వహిస్తుంది. సహజవాయువు, పెట్రోలియం, అణుధార్మిక ఖనిజాలు మినహా మిగిలిన ఖనిజాలన్నిటికీ గనుల మంత్రిత్వశాఖదే బాధ్యత. గనుల, ఖనిజాల (నియంత్రణ – అభివృద్ధి) చట్టం, 1957 ద్వారా భారత ప్రభుత్వం ఈ పని చేస్తుంది.

ఈ విధానాల ప్రకారం అల్యూమియం, రాగి, జింక్, సీసం, బంగారం, నికెల్ వగైరా ఖనిజాలను కేంద్ర ప్రభుత్వ గనుల శాఖ కిందికి తెచ్చారు. ఇండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్, మినరల్ ఎక్స్ ప్లొరేషన్ కార్పొరేషన్ లిమిటెడ్, నేషనల్ మినరల్ డెవెలప్ మెంట్ కార్పొరేషన్, స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా, భారత్ అల్యూమినియం కంపెనీ లిమిటెడ్, హిందుస్తాన్ జింక్ లిమిటెడ్, హిందుస్తాన్ కాపర్ లిమిటెడ్ వంటి కేంద్రప్రభుత్వ సంస్థలను ఏర్పాటు చేశారు. వీటిలో భారత్ అల్యూమియం కంపెనీని, హిందుస్తాన్ జింక్ లిమిటెడ్ ను ఇటీవల ప్రైవేటీకరించారు. ఇవికాక తమ పరిధిలోని ఖనిజాల అభివృద్ధి కోసం దాదాపు అన్నిరాష్ట్ర ప్రభుత్వాలు ఖనిజాభివృద్ధి సంస్థలను ఏర్పరచుకున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా కూడ కొన్ని సంస్థలను ఏర్పాటు చేశాయి.

ఈ చట్టబద్ధమైన, పాలనాపరమైన ఏర్పాట్లద్వారా సాధించ దలచినది దేశంలోని ఖనిజ నిలువల అన్వేషణ, వెలికితీత, వాటిని దేశాభివృద్ధి కోసం వినియోగించడం. దేశంలో దాదాపుగా లేని ఖనిజం లేదని చెప్పవచ్చు. దేశం మొత్తం మీద 89 ఖనిజాలు దొరుకుతున్నాయి. వాటిలో నాలుగు ఇంధనవనరులుగా పనికివచ్చే ఖనిజాలు, 11 లోహాలు, 52 ఇతర ఖనిజాలు, 22 చిన్నతరహా ఖనిజాలు. వీటిలో ఇనుప ఖనిజం, రాగి ఖనిజం, క్రోమైట్, జింక్ సమ్మేళనాలు, బంగారం, మాంగనీస్ ఖనిజం, బాక్సైట్, సీసం మిశ్రమాలు, వెండి, సున్నపురాయి, మాగ్నెసైట్, డోలమైట్, బరైటిస్, కావొలిన్, జిప్సం, అపటైట్, ఫాస్ఫరైట్, స్టియటైట్, ఫ్లోరైట్ అనే ఖనిజాలు ముఖ్యమైనవి. ఈ ఖనిజాల ఉత్పత్తిలో ప్రపంచ దేశాలన్నిటిలోనూ భారతదేశానికి చాల ప్రాముఖ్యత ఉంది. భారతదేశం అభ్రకం ఉత్పత్తిలో మొదటిస్థానంలో, క్రోమైట్, బొగ్గు, లిగ్నైట్, బరైటిస్ల ఉత్పత్తిలో మూడోస్థానంలో, ఇనుపఖనిజం ఉత్పత్తిలో నాలుగో స్థానంలో, బాక్సైట్, మాంగనీస్ల ఉత్పత్తిలో ఆరోస్థానంలో, అల్యూమినియం ఉత్పత్తి లో పదోస్థానంలో, ముడి ఉక్కు ఉత్పత్తిలో పదకొండోస్థానంలో ఉంది.

అంటే, ప్రపంచదేశాలన్నీ, ఆయా లోహాలతో పరిశ్రమలు నడిపే, వ్యాపారాలు చేసే బహుళజాతి సంస్థలన్నీ భారతదేశం మీద ఆధారపడ వలసిందే తప్ప, భారతదేశానికి వాటితో పనిలేదు. ఆయా పరిశ్రమల ఉత్పత్తులు నిరాటంకంగా సాగాలంటే, వాటికి ముడిసరుకులయిన లోహాలు, ఖనిజాలు నిరంతరం అందాలంటే, ఆయా పరిశ్రమలు

## కళ్లు తిరిగిపోయే లాభాలు!

గనుల యజమానుల మాఫియా అక్రమ సంపాదన ఎంత ఉంటుందో స్థూలంగా అంచనా కట్టినా కళ్లు తిరుగుతాయి. ఒక ఉదాహరణ చూదండి.

అంతర్జాతీయ మార్కెట్లో నవంబర్ 2009లో భారత ఇనుప ఖనిజం ధర (ఆ ఖనిజంలో 63.5 శాతం ఇనుము ఉన్నట్టయితే) టన్నుకు 106 దాలర్లు పలికింది. రూపాయల్లో చెప్పాలంటే ఇది రు. 4895.

కేంద్రప్రభుత్వ గనుల శాఖ ఎప్పటికప్పుడు రాయల్టీ రేట్లను ప్రకటిస్తుంది. గనుల శాఖ తాజాగా 2009 ఆగస్టులో కొత్త రాయల్టీ రేట్లను ప్రకటించింది. అంతకు ముందు టన్నుకు రు. 14.50గా ఉండిన రేటును ప్రస్తుతం మార్కెట్ ధరపై పది శాతంగా మార్చింది. దాని ప్రకారం టన్నుకు ప్రభుత్వానికి చెల్లించవలసిన రాయల్టీ రు. 489.50 (అక్షరాలా నాలుగు వందల ఎనభై తొమ్మిది రూపాయల యాభై పైసలు!)

అలాగే కేంద్రప్రభుత్వ గనుల శాఖ రేట్స్ ఆఫ్ డెడ్ రెంట్ అని మరొక కౌలు వసూలు చేస్తుంది. ఇది విస్తీర్ణాన్ని బట్టి, లీజు తీసుకుని ఎంతకాలం గడిచిందనే దాన్ని బట్టి మారుతుంది. కొత్త రేట్ల ప్రకారం గరిష్టంగా చెల్లించవలసింది హెక్టేరుకు (రెండున్నర ఎకరాలకు) సంవత్సరానికి రు. 1000. అంటే ఇది సగటున టన్నుకు లెక్కకడితే చిల్లరపైసల్లోకి మారుతుంది.

యంత్రాలకు, తవ్వకానికి, సిబ్బందికి, రవాణాకు, వివిధ ప్రభుత్వ శాఖలకు లంచాలకు ఎంత ఎక్కువలో ఎక్కువ ఖర్చు లెక్కకట్టినా టన్నుకు రు. 1000 కన్న ఎక్కువ కావడానికి అవకాశం లేదు.

అంటే ఒక గని యజమాని ఒక్కటన్ను ఇనుపఖనిజం మాత్రమే తవ్వి ఎగుమతి చేసినా మూడువేల రూపాయలు లాభం చేసుకోవచ్చు.

ఇటీవల ఓబుళాపురం మైనింగ్ కంపెనీకి సంబంధించిన వివాదం వచ్చినప్పుడు తమకు ఏడాదికి డెబ్బై లక్షల టన్నుల ఇనుప ఖనిజం ఎగుమతి చేసే అనుమతి ఉందని ఆ కంపెనీ న్యాయవాది సుప్రీంకోర్టు ముందర చెప్పారు.

గనియజమానుల సగటు లాభం టన్నుకు మూడువేల రూపాయలు కాదనీ, పదిహేను వందల రూపాయలు మాత్రమేననీ అనుకున్నా ఓబుళాపురం మైనింగ్ కంపెనీకి సంవత్సర లాభం వెయ్యి కోట్ల రూపాయల పైచిలుకే.

నడుపుతున్న బహుళజాతిసంస్థల లాభాలు ఇబ్బడిముబ్బడి కావాలంటే వారందరికీ భారతదేశపు ఖనిజాలు కావలసి ఉంటుంది. అలా బేరసారాలాడడానికి, తనకు అనుకూలమైన విధానాన్ని అనుసరించడానికి భారత ప్రభుత్వానికి ఎక్కువ అవకాశం ఉంది. కాని భారత పాలకులు దేశదేశాల సంపన్నుల, బహుళజాతిసంస్థల దళారులుగా పనిచేయడానికి మాత్రమే సిద్ధంగా ఉన్నారు గనుక భారతదేశపు సానుకూలతలను భంగపరిచారు. భారత ప్రజల ప్రయోజనాలను పణంగా పెట్టారు.

ప్రభుత్వ రంగంలోని గనుల శాఖలను, సంస్థలను సవ్యంగా, ప్రజానుకూలంగా నడిపి ఉంటే, ఖనిజాల వెలికితీతలో శాస్త్రీయమైన, హేతుబద్ధమైన, సామాజిక శ్రేయోదాయకమైన పద్ధతులు అవలంబించి ఉంటే, ఖనిజ రూపంలోని దేశసంపద అంతా దేశప్రజలకే అందేది. దేశప్రజల సౌభాగ్యం కోసమే వినియోగంలోకి వచ్చేది. రాజ్యాంగం ఆదేశిక సూత్రాలలో అధికరణం 39లో చెప్పినట్టుగా, 'సమాజపు భౌతిక వనరుల మీద యాజమాన్యం, నియంత్రణ ఉమ్మడి శ్రేయస్సు కోసం ఉపయోగపడేటట్టుగా పంపిణీ అవుతుంది' అనే సూత్రాన్ని కచ్చితంగా అమలుచేసి ఉంటే ఖనిజసంపద ప్రస్తుతం జరుగుతున్నట్టుగా దుర్వినియోగం అయ్యేది కాదు. కొద్దిమంది సంపన్నుల చేతిలో, వారి దళారీలుగా పనిచేస్తున్న స్వదేశీ పెట్టుబడిదారుల, ప్రభుత్వాధికారుల చేతిలో పోగుపడేది కాదు.

భారత ప్రభుత్వానికి 1947 నుంచి 1993 దాకా ప్రత్యేకంగా ఖనిజ విధానం అంటూ ఏమీలేదు. 1957 చట్టంలోనే గనుల తవ్వకాన్ని ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు అప్పగించడానికి వీలు కల్పించారు. 1960లో వెలువడిన ఖనిజాల రాయితీల నిబంధనలు ఇలా ప్రైవేటు వ్యక్తుల, సంస్థల చేతికి ఖనిజ నిలువలను అందించడానికి అవసరమైన విధివిధానాలను రూపొందించాయి. ఆర్థిక సరళీకరణ క్రమం మొదలయిన తర్వాత 1988లో వెలువడిన ఖనిజాల సంరక్షణ, అభివృద్ధి నిబంధనలు ఈ ప్రైవేటీకరణ క్రమాన్ని మరింత పెంచాయి. 1993లో మొదటిసారిగా తయారయిన జాతీయ ఖనిజ విధానం పూర్తిగా ప్రపంచీకరణ శక్తుల కనుసన్నల్లో, బహుళజాతిసంస్థల ప్రయోజనాలు నెరవేర్చడానికే తయారయింది. ఇంధన ఖనిజాలు, అణుధార్మిక ఖనిజాలు మాత్రం మినహాయించి మిగిలిన ఖనిజాలన్నిటిలోకి నేరుగా విదేశీ పెట్టుబడులు ప్రవేశించడానికి మార్గం సుగమమయింది. స్వదేశీ సంపన్నుల గనుల మాఫియా బహుళజాతి సంస్థలతో కుమ్మక్కయింది. ఆ విధానాన్ని కూడ 1994 మరింత సవరించి ఇనుప ఖనిజం, రాగి, మాంగనీస్, సీసం, క్రోమ్ ఖనిజం, జింక్, గంధకం, మాలిబ్డినం, బంగారం, టంగ్‌స్టన్, వజ్రాలు, నికెల్, ప్లాటినం మొదలయిన ఖనిజాలలోకి ఇబ్బడి ముబ్బడిగా ప్రైవేటు సంస్థలు, బహుళజాతి సంస్థలు ప్రవేశించడానికి వీలు కల్పించారు. దానితో కెనడా, అమెరికా, ఆస్ట్రేలియా, యునైటెడ్ కింగ్‌డమ్, దక్షిణాఫ్రికాలకు చెందిన ఎన్నో బహుళజాతి సంస్థలు దేశంలో నేరుగా గాని, తమ దళారులద్వారా గాని ఈ ఖనిజాల గనులన్నిటిలోకి ప్రవేశించాయి.

ఇంకా ఇది సరిపోదన్నట్టు కేంద్రప్రభుత్వం గనుల, ఖనిజాల చట్టం 2009 ముసాయిదాను తయారుచేసింది. రాష్ట్రాలలో గనుల లీజులను క్రమబద్ధం చేయడంకొరకు కేంద్ర ప్రభుత్వమే పూనుకుని రాష్ట్రాల ఖనిజ విధానం అనే నమూనా ఖనిజవిధానాన్ని తయారుచేసింది. ఈ రెండు విధాన పత్రాలలోనూ గనుల, ఖనిజ నిలువల ప్రైవేటీకరణకు ఇంకా విస్తృత చర్యలున్నాయి.

బహుళజాతి సంస్థలకు గనుల, ఖనిజాల అవసరం ఎక్కువగా ఉండడంతో, ఇందులో విపరీతంగా లాభాలు ఉండడంతో, దేశంలో గనులను లీజుకు తీసుకునే స్థానిక పెత్తందారులు, వ్యాపారస్తులు, అధికారులు, రాజకీయవేత్తలు కలగలిసిన మాఫియా తయారయింది. ఈ గనుల మాఫియా నుంచి ప్రభుత్వం వసూలు చేసేది వాళ్ల లాభాలలో ఒక్క శాతం కన్న కూడ తక్కువ. అలా గనుల మాఫియా చట్టబద్ధంగా, ప్రభుత్వ అనుమతి ప్రకారం గనులు తవ్వితేనే 99 శాతం లాభాలు అప్పనంగా వచ్చి పడుతుండగా, ఇక అక్రమ తవ్వకాలు, లీజు ఇచ్చిన స్థలంకన్న ఎక్కువ భూమిలో తవ్వకాలు, లెక్కలు తక్కువచేసి చూపించడం, ప్రభుత్వానికి ఇవ్వవలసిన రాయల్టీ తగ్గించడానికి, ఎగ్గొట్టడానికి సాంకేతిక మార్గాలు వెతకడం వంటి అనేక అక్రమ పద్ధతులు ఉన్నాయి.

ఇక రాష్ట్రం విషయానికి వస్తే, దేశంలోని ఖనిజనిలువల సంపదలో రాష్ట్రానిది రెండవ స్థానం. రాష్ట్రంలో దాదాపు 50 పారిశ్రామిక ఖనిజాల వెలికితీత, ఉత్పత్తి జరుగుతోంది. బొగ్గు, సహజవాయువు, సున్నపురాయి, అభ్రకం, బరైటిస్, బాక్సైట్, సముద్రతీరపు ఇసుక, స్టియటైట్, క్వార్ట్జ్, ఫెల్డ్‌స్పార్, మాంగనీస్, డోలమైట్, గ్రానైట్ వంటి ఖనిజాలెన్నో రాష్ట్రంలో ఉన్నాయి. ఇంకా వెలికితీయని, అన్వేషించ వలసిన ఖనిజ నిలువలు ఎన్నో ఉన్నాయి. మొత్తంగా రాష్ట్రంలో సింగరేణి బొగ్గుగనులు కాక ఐదు లక్షల ఎకరాలలో వివిధ గనుల తవ్వకాలు ప్రైవేటు వ్యక్తుల, వ్యాపారసంస్థల చేతుల్లో ఉన్నాయి. గనులు తవ్వి పెడతామని లీజుకోసం, అనుమతులకోసం ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నవారి సంఖ్య ఏటేటా వేలాదిగా పెరుగుతోంది. అంటే గనుల వ్యాపారం చాల లాభసాటి వ్యవహారం అయిపోయిందన్నమాట. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గణాంకాల ప్రకారమే 2005-06లో ఈ గనుల ద్వారా రు. 7,803 కోట్ల విలువగల ఖనిజాల వెలికితీత జరిగింది. కాని ప్రభుత్వానికి పన్నులు, లీజు, రాయల్టీ, ఆదాయవాటాల ద్వారా అందినది రు. 1,075 కోట్లు మాత్రమే. అంటే తెలుగు ప్రజల ఉమ్మడి వారసత్వ సంపద నుంచి ఆ ఒక్క సంవత్సరమే దాదాపు ఏడువేల కోట్ల రూపాయలు కొన్ని డజన్ల మంది గనుల వ్యాపారుల బొక్కసాలకు చేరిందన్నమాట. ఈ అంకెను గత ఇరవై సంవత్సరాల వ్యవధితోనో, పది సంవత్సరాల వ్యవధితోనో హెచ్చవేస్తే మన రాజకీయ నాయకులు-అధికారులు-గనుల వ్యాపారులు సాగించిన అక్రమార్జనలో కొంతభాగానికి లెక్క తేలుతుంది.

నిజానికి ఇదంతా రాష్ట్ర ప్రజల సంపద. ఉమ్మడి వారసత్వం. బంగారు గుడ్లు పెట్టే బాతును ఒక్కరోజే కోసి వేసుకున్నట్టుగా దాన్నంతా ఇప్పటికిప్పుడు వ్యాపారస్తులకు అప్పజెప్పనక్కరలేదు. దాన్ని రాష్ట్ర ప్రజల అవసరాల కోసం, రాష్ట్ర ప్రజల అభివృద్ధికోసం క్రమబద్ధంగా, ప్రణాళికా బద్ధంగా వినియోగించే విధానాలు కావాలి. దొరికే ఖనిజసంపదనంతా సమీక్షించి, పద్ధతి ప్రకారం వెలికితీస్తూ, రాష్ట్రంలోనే ఆ ఖనిజాల ఆధారిత పరిశ్రమలు ఏర్పాటు చేసి వేలాది మందికి ఉపాధి కల్పించవచ్చు. ఆ పారిశ్రామిక ఉత్పత్తుల వ్యాపారం ద్వారా రాష్ట్రానికి ఆదాయం సంపాదించవచ్చు. రాష్ట్రంలో దొరికే ఖనిజాలను ఉపయోగించి విద్యుదుత్పత్తి, సిమెంట్, ఎరువులు, సెరామిక్స్, గ్లాస్, ఉక్కు, గృహ

*ప్రభుత్వాధీనంలో, పర్యవేక్షణలో వెలికితీయాల్సిన, జాతి దీర్ఘకాలిక ప్రయోజనాల కోసం ఉపయోగపడాల్సిన ఖనిజ వనరులు దోపిడీకి ఎలా గురవుతున్నాయో వివరిస్తున్నారు* **రాంకి**

# విధ్వంసం ఎవరికి - లాభాలు ఎవరికి?

సమాజ పరిణామ క్రమంలో మనిషి తన మనుగడ, అవసరాల కోసం పరికరాలుగా వాడిన పదార్థాలను బట్టి మానవ నాగరికతను అంచనా కట్టే చరిత్ర విధానం మనకు తెలిసినదే. పాతరాతి యుగం, కొత్త రాతియుగం, కంచుయుగం, లోహయుగం ఇలా చరిత్రను విభజించారు. మనిషి వాడిన పదార్థాన్ని బట్టి ఆ కాలాన్ని అంచనా వేసిన పద్ధతి ఒకటుందని మనకు తెలుసు. రాచరికాలు, భూస్వామ్యాలు గడిచి ప్రజాస్వామ్య దేశాలుగా ఏర్పడి, ఆ పాలనను పెట్టుబడి శాసిస్తున్న దశలో మనమంతా ఉన్నాం. మానవ నాగరికత ఎంత పరిణామం చెందిందంటే రసాయనాల ఆధిపత్యం, ఎలక్ట్రానిక్ పరికరాల ఆధిపత్యం, కంప్యూటర్‌ల ఆధిపత్యం దాటి ప్రస్తుతం మార్కెట్ పోటీని యుద్ధంలో పరిష్కరించు కోవడానికి యురేనియంపై ఆధిపత్యం కోసం సాగుతోంది. యురేనియం వంటి రేడియోధార్మిక మూలకాలను ఎవరైతే తమ ఆధిపత్యంలో ఉంచుకోగలుగుతారో వారే ప్రపంచంపై ఆధిపత్యం కలిగి ఉండే స్థితి నెలకొని ఉంది. విధ్వంసక అణుబాంబులు తయారు చేయడానికి ఉపయోగపడే యురేనియంపై ఆధిపత్యం కోసం అమెరికాతో సహా పలు అగ్రరాజ్యాలు ప్రయత్నిస్తున్నాయి.

యురేనియమే కాకుండా యుద్ధసామాగ్రికి అవసరమయ్యే ఇనుము, అల్యూమినియం వంటి లోహాల కోసం కూడా పోటీ పడుతున్నాయి. ఆ ఖనిజాలు దొరికే నేలలను గుర్తించి, అక్కడ జీవిస్తున్న మనుషులను తరిమికొట్టి తమ లాభాలు, ఆధిపత్యమే ధ్యేయంగా విధ్వంస రచన కొనసాగిస్తున్నాయి. నేలగర్భంలో దాగి ఉన్న ఖనిజ వనరులు అక్కడ మనుషులు నిలిచి ఉండాలో, లేదో నిర్ణయించే దశకు మన నాగరికత పరిణామం చెందింది. ఆ ఖనిజ వనరులపై కన్నువేసిన సామ్రాజ్యవాద శక్తులు సమాజ ఉనికిని నిర్ణయిస్తున్నాయి.

ఈ పరిణామాల క్రమంలో నాగరికత అంటే ఏమిటో పునర్నిర్వచించుకొని సమాధానం మళ్లీ చెప్పుకోవలసిన ఒక సందిగ్ధ దశలో మన సమాజం ఉంది. మనిషి శ్రమ కేంద్రంగా, మనిషి అభివృద్ధి, సంక్షేమాలే ధ్యేయంగా సామాజిక గతిని మనమింకా నిర్దేశించుకోవాల్సే ఉంది. అయితే ప్రస్తుత అభివృద్ధి పాలకుల ఆధిపత్యాల కేంద్రంగా, లాభాల కేంద్రంగా సాగుతోంది. ఖనిజ వనరులు మానవాళి అవసరానికీ, మనుగడకూ ఉపయోగపడుతున్నాయా, విస్థాపన, విధ్వంసాలకా అనేది మనం విశ్లేషించుకోవాలి.

ఇక మన దేశం విషయానికి వస్తే మనం మైనింగ్ చేసే ఖనిజాలలో 84 ఖనిజాలు ప్రముఖంగా ఉన్నాయి. అందులో 4 ఇంధనాలు, 49 అలోహ పారిశ్రామిక ఖనిజాలు, 11 లోహ ఖనిజాలు, 20 మైనర్ ఖనిజాలు ఉన్నాయి. ఇలా మైనింగ్ చేసే వాటిలో ముఖ్యమైన ఖనిజాలు : అల్యూమినియం, బొగ్గు, కోబాల్ట్, క్రోమియం, వజ్రాలు, బంగారం, ఇనుము, సీసం, మాంగనీసు, మాలిబ్డినం, నికెల్, ఆయిల్ సాండ్స్, పెల్లాడియం, ప్లాటినం, వెండి, టంటాలమ్, టిన్, టైటానియం, టంగ్స్టన్, యురేనియం, వెనేడియం, జింక్ మొదలైనవి.

మన దేశంలో ఖనిజ తవ్వకాలకు సంబంధించిన చరిత్ర ఆరువేల సంవత్సరాల పురాతనమైనది. జవార్‌లో సీసం, జింక్ నిల్వలు, ఖేత్రిలో రాగి నిల్వలు, కర్ణాటకలో బంగారం నిల్వలు పురాతనమైనవి. ఢిల్లీలోని కుతుబ్‌మినార్ మన లోహ కళా నైపుణ్యానికి ఒక ప్రాచీనమైన చిహ్నం.

దేశంలో ప్రభుత్వరంగంలో ఉన్న మైనింగ్ కంపెనీలు – నేషనల్ కోల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఎన్‌సిడిసి); నేషనల్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఎన్ఎండిసి); పైరైట్స్, ఫాస్ఫేట్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్ (పిపిసిఎల్); నైవేలీ లిగ్నైట్ కార్పొరేషన్ లిమిటెడ్ (ఎన్ఎల్‌సిఎల్); హిందూస్థాన్ కాపర్ లిమిటెడ్ (ఎచ్‌సిఎల్); భారత్ గోల్డ్‌మైన్స్ లిమిటెడ్ (బిజిఎంఎల్); స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (ఎస్ఏఐఎల్ – గతంలో హిందూస్థాన్ స్టీల్ లిమిటెడ్‌గా ఉంది); ఇటీవలె ప్రభుత్వ రంగంలో ఉండిన భారత్ అల్యూమినియం కంపెనీ (బిఎఎల్‌సిఒ); హిందూస్థాన్ జింక్ లిమిటెడ్ (ఎచ్‌జడ్ఎల్) కంపెనీలను భారత ప్రభుత్వం ప్రైవేట్ కంపెనీల పరం చేసింది.

---

నిర్మాణ పరికరాలు, వినియోగవస్తువులు తయారుచేసే పరిశ్రమలు ఎన్నో స్థాపించవచ్చు. గనుల తవ్వకాన్ని ప్రభుత్వరంగంలోనే నిర్వహిస్తూ ఖనిజాల విలువనంతా రాష్ట్ర ఖజానాకే చేర్చవచ్చు. ఎక్కడైనా సాంకేతిక కారణాల కొద్దీ ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు లీజు ఇవ్వవలసి వచ్చినా ప్రజాధనం ప్రైవేటు వ్యక్తుల, సంస్థల కైంకర్యం కాకుండా రాయల్టీలు, పన్నులు శాస్త్రీయంగా విధించి ప్రభుత్వాదాయం పెంచవచ్చు. అవన్నీ లాభార్జనే ధ్యేయంగా ప్రస్తుతం కొనసాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థలో, ఆధిపత్య శక్తులకే అన్ని అధికారాలూ అనే విలువల చట్రంలో సాధ్యమయ్యే విషయాలు కావు. అవి సాధ్యం కావాలంటే సహజ సంపదలన్నీ ప్రజలవి మాత్రమేననే ప్రత్యామ్నాయ దృక్పథం కావాలి. జల్, జంగల్, జమీన్ మీద సకలాధికారాలూ ప్రజలవే అనే ప్రత్యామ్నాయ రాజకీయాల ఆధారంగా వ్యవస్థ నిర్మాణం జరగాలి. ■




ఉన్నాయి. వీటిలో బెరైటీస్, బొగ్గు, బాక్సైట్, ఇనుప ధాతువు, మాంగనీసు, ఆస్‌బెస్టాస్, సున్నపురాయి, అభ్రకం, రాగి, చైనా క్లే, ఇసుక, మైకా, సిలికాలు కొన్ని రాష్ట్రంలో దొరికే ముఖ్యమైన ఖనిజాలు. మన రాష్ట్రం 96 శాతం బెరైటీస్ ఖనిజ నిల్వలు, 86 శాతం మైకా నిల్వలు, 34 శాతం సున్నపురాయి నిల్వలు, 30 శాతం ఫైన్‌క్లే నిల్వలతో దేశంలోనే అగ్రస్థానంలో ఉంది. రాష్ట్రంలో లభ్యమవుతున్న ఖనిజాలు, దేశంలో లభ్యమవుతున్న మొత్తం ఖనిజ నిల్వలతో పోల్చిన సమాచారం పట్టికలలో చూడవచ్చు. ఈ సమాచార సేకరణ క్రమంలో నాకు ఎదురైన ఒక అనుభవం ఏమిటంటే, ఖనిజ వనరులకు సంబంధించిన సమాచారం సమగ్రంగా ఎక్కడా ఒక దగ్గర పొందుపరచి లేదు. ఇంటర్నెట్‌లో మంత్రిత్వ శాఖ సైట్‌లలో సమాచారం మెంబర్‌షిప్ ఉన్నవారికే లభ్యమవుతోంది?

భారత కేంద్ర ప్రభుత్వ గనుల మంత్రిత్వశాఖ ఆధ్వర్యంలో మైనింగ్ పరిశ్రమల విధాన నిర్ణయాలు, పనులు జరుగుతాయి. ఖనిజ వనరులకు సంబంధించి బొగ్గు-మైన్స్, ఐరన్ అండ్ స్టీల్, రసాయనాలు - ఎరువుల పరిశ్రమలు, అటామిక్ ఎనర్జీ, పెట్రోలియం - సహజవాయువు, పర్యావరణం - అడవులు, ఇలా వివిధ మంత్రిత్వ శాఖలున్నాయి.

ఈ ఖనిజ వనరులను గుర్తించడంలో జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా (జిఎస్ఐ) శాస్త్రీయ సర్వేలు, పరిశోధనలు చేస్తుంది. భారత దేశంలోని ఖనిజ వనరుల పటాలను రూపొందిస్తుంది. అలాగే ఇండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్ (ఐబిఎం) ఈ ఖనిజ వనరుల తవ్వకాలకు సంబంధించిన గణాంకాలను, పటాలను, ఇతర సమాచారాన్ని సేకరిస్తుంది. గనులు, ఖనిజాలు, లోహాలు, ఖనిజ ఆధారిత పరిశ్రమలు, పరిశ్రమల సమాచారం ఇండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్ క్రోడీకరిస్తుంది.

ప్రపంచ ఖనిజ వనరుల ఉత్పత్తిలో మన దేశం - అభ్రకం ఉత్పత్తిలో అగ్రస్థానంలో ఉంది. క్రోమైట్ ఉత్పత్తిలో ప్రపంచంలో మూడవస్థానంలో ఉంది. బొగ్గు, లిగ్నైట్, బరైటస్ ఉత్పత్తిలో మూడవ స్థానంలో ఉంది. ఇనుము ముడి ఖనిజ ఉత్పత్తిలో నాల్గవస్థానంలో ఉంది. బాక్సైట్, మాంగనీసు ముడి ఖనిజ ఉత్పత్తిలో ఆరవస్థానంలో, అల్యూమినియం ఉత్పత్తిలో పదవస్థానంలో, క్రూడ్‌స్టీల్ ఉత్పత్తిలో పదకొండవ స్థానంలోనూ ఉంది.

ఇక ఆంధ్రప్రదేశ్ విషయానికి వస్తే ఖనిజ నిక్షేపాలకు సంబంధించి దేశంలోనే రెండవ స్థానంలో ఉంది. రాష్ట్రంలో 48 రకాల ఖనిజ నిక్షేపాలు

తెలుగు అకాడమీ డిగ్రీ విద్యార్థుల కోసం అచ్చువేసిన భూగోళ శాస్త్ర పుస్తకం తప్పులు, తడకలతో నిండి ఉంది. ఇన్ని ఖనిజాల మర్మం, లాభాల గుట్టు బయటపెట్టాలంటే చాలా పరిశోధనే చేయాలని అర్థమయింది.

అయితే ఇవన్నీ మనదేశ, రాష్ట్ర ఖనిజ వనరుల స్థితిగతులకు సంబంధించిన సమాచారమైతే వాటి మీద ఆధిపత్యం, వినియోగం ఎవరి ఆధీనంలో ఉన్నాయనేది అసలు ప్రశ్న. దేశంలోనూ, రాష్ట్రంలోనూ ప్రజలు ఎక్కడికక్కడ స్థానిక వనరులపై తమ ఆధిపత్యం, స్వయం పాలన, స్వావలంబనలు కోరుకుంటూ బతుకు పోరాటాలకూ, ఆత్మగౌరవ పోరాటాలకూ సిద్ధ పడుతున్నారు. మరోపక్క సామ్రాజ్యవాద శక్తులు ప్రపంచంలోని వనరులపై ఆధిపత్యం కోసం పోటీ పడుతున్నాయి. ఇటు పాతాళానికైనా, అటు రోదసికైనా వెళ్లి మానవాళి మేలు కోసం జరపాల్సిన, జరగాల్సిన ప్రయోగాలు, పరిశోధనలు కొద్దిమంది లాభాల కోసం జరుగుతున్నాయి. తమ మనుగడ కోసం మానవాళి ఏళ్ల తరబడి కృషి చేసి సాధించుకున్న హక్కులను కాలరాస్తూ మనిషి నిలబడిన నేలకింద ఖనిజం కోసం పెద్ద ఎత్తున విస్థాపన, విధ్వంసం జరుగుతోంది. ఖనిజ వనరులు, ప్రకృతి వనరులు ఏవైనా స్థానిక ప్రజల అభ్యున్నతికి దేశ, రాష్ట్ర దీర్ఘకాలిక ప్రయోజనాలకు, లక్ష్యాలకు లోబడి ఉండాలి. ఖనిజ వనరుల తవ్వకంతో కొన్నిసార్లు అడవులు, పర్యావరణం, జీవావరణం మొత్తంగా దెబ్బతినే ప్రమాదం ఉంటుంది. కాబట్టి చాలా శాస్త్రీయమైన పద్ధతులు అనుసరించాలి. ఓపెన్ కాస్ట్ మైనింగ్‌వల్ల

# దొడ్ల రామచంద్రారెడ్డి (డి.ఆర్.)



నెల్లూరు జిల్లా కావలిలోని విశ్వోదయ విద్యాసంస్థల వ్యవస్థాపకుడు, విద్యాదాత డాక్టర్ దొడ్ల రామచంద్రారెడ్డి (81) జనవరి 15న కావలిలోని ఆయన స్వగృహంలో మరణించారు. పేదల విద్యాభివృద్ధికి అహర్నిశలు పాటు పడ్డారు. ఆయన ఒక రైతు కుటుంబంలో దొడ్ల వెంకట రామరెడ్డి, ఆదిలక్ష్మి దంపతులకు 1929 జూలై 4న కావలిలో జన్మించారు. పేదలకు విద్యను అందుబాటులోకి తెచ్చే ధ్యేయంతో 1951లో జూలై 1న 92 మంది విద్యార్థులతో కావలిలో జూనియర్ కళాశాలను ప్రారంభించారు. మరుసటి ఏడాది విశ్వోదయ ఎడ్యుకేషన్ సొసైటీ స్థాపించారు. సమాజంలో అలుముకున్న అజ్ఞానపు చీకట్లను పారదోలి సమాజాన్ని తేజో వంతమైన విజ్ఞాన సమాజంగా మార్చాలని విశ్వోదయ రూపశిల్పి డి.ఆర్. స్వప్నించారు. డి.ఆర్. కేవలం స్వాప్నికుడే కాదు, తన కలలను సాకారం చేసుకున్న గొప్ప ఆచరణీయుడు కూడా. విశ్వోదయ బహుముఖ సేవలకు గుర్తింపుగా ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయనను గౌరవ డాక్టరేట్‌తో సత్కరించింది. ఆయన మాటల్లో, 'మాకు మానవుని ఉజ్వల భవిష్యత్తు మీద అపారమైన విశ్వాసం ఉన్నది. ఇది అర్థం లేని ఆశావాదం కాదు. మానవ చరిత్రను అర్థం చేసుకున్నప్పుడు తెలిసే సత్యం ఇది. అందుచేతనే సమగ్ర సమాజం, సమగ్ర మానవుడు వచ్చి తీరాలి. దానికి తగిన పరిస్థితులు సృష్టించడానికి మానవుడు ప్రయత్నించాలి అన్న విషయం తార్కికంగా ఆలోచించినా, తాత్వికంగా ఆలోచించినా మనం ఒప్పుకోవాలి'. వీ

అడవులు దెబ్బతింటాయి. వాతావరణ కాలుష్యం ఏర్పడుతుంది. వాగులు, వంకలు, నదులు కలుషిత మవుతాయి. ఘన వ్యర్థాలు రాబోయే తరాలను దెబ్బతీస్తాయి.

ప్రభుత్వ ఆధీనంలో, పర్యవేక్షణలో జరగాల్సిన ఖనిజ తవ్వకాలు ప్రైవేటీకరణ క్రమంలోఖనిజ వనరులను వెతికిపెట్టే పని ప్రభుత్వాలుచేస్తే, వాటిపై లాభాలు చేసుకునే పనిలో ప్రైవేట్ కంపెనీలు ఉంటున్నాయి. ఆర్థిక సరళీకరణ గతంతో పోలిస్తే రెండు ప్రధానమైన తేడాలను కలిగి ఉంది. ప్రభుత్వ ఆధీనంలో ఉన్న కంపెనీలను ప్రైవేట్ కంపెనీలకు అమ్మివేయడం (ఉదాహరణకు బాల్కోను వేదాంత రిసోర్సెస్‌కు), మన దేశ ఖనిజ వనరులను విదేశీ కంపెనీలు దోచుకు పోవడానికి తలుపులు తెరవడం. సామ్రాజ్యవాద ప్రయోజనాలకు సంబంధించి అల్యూమినియం విషయంలో అమెరికా ఉదాహరణ చూస్తే అక్కడ తలసరి 53 కిలోల అల్యూమినియం వాడుతున్నట్లు అంచనా. అయితే అమెరికాలో అసలు బాక్సైట్ గనులే లేవు. జపాన్ తన సొంత నేలపై అల్యూమినియం ఉత్పత్తిని ఆపేసి 90 శాతం దిగుమతులపై ఆధారపడుతోంది.

మన దేశంలో ఖనిజ వనరులను తవ్వే గనులు 1996లో 2480 ఉండగా 2001 నాటికి 2518కి పెరిగాయి. అయితే అదే కాలంలో ఉపాధి అవకాశాలు గమనిస్తే 7,16,183 నుంచి 5,99,301కి పడిపోయాయి.

ఇక మైనింగ్ ప్రాజెక్ట్‌ల వలన అత్యధికంగా నష్టపోతున్నది ఆదివాసులే. శతాబ్దాలుగా అటవీ భూములపై ఆధారపడి జీవనాన్ని కొనసాగిస్తున్న ఆదివాసులు అక్కడి నేల పొరల్లోనే ఖనిజాలు సమృద్ధిగా ఉండడం వలన పాలకుల విధానాలతో విస్థాపనకు గురవుతున్నారు. దేశంలోని మొత్తం అడవుల్లో 60 శాతం అడవులు ప్రధానంగా ఆదివాసులు నివసిస్తున్న 187 జిల్లాల్లోనే ఉన్నాయి. అంటే దేశంలోని మూడవ వంతు భాగం అన్నమాట.

అరుంధతి రాయ్ ఖనిజ వనరుల కోసం ఆదివాసులపై జరుగుతున్న అణచివేత గురించి పేర్కొంటూ, ఖనిజ వనరులను తవ్వుకొని, ప్రైవేట్ కంపెనీలు లాభాలు చేసుకోవడాన్ని 21వ శతాబ్దపు గోల్డ్‌రష్‌గా (సంపద కోసం సాగే వేటగా) విశ్లేషించారు. ఈ ఖనిజ వ్యాపారం నుంచి వచ్చిన లాభాలు, పోగుపడిన సంపదలు ప్రజావ్యతిరేక రాజకీయాలకు, ప్రజల అణిచివేతకు ఉపయోగపడుతున్నాయి. ప్రజల భద్రత, అభివృద్ధి అనేవి ప్రశ్నార్థకంగా మారి పెట్టుబడిదారులే రాజకీయాలను శాసిస్తున్నారు.

రాష్ట్రంలో ఇటీవలి ఓబుళాపురం గనుల వ్యవహారం కావచ్చు, సింగరేణి బొగ్గు గనులు కావచ్చు, బాక్సైట్ గనులు కావచ్చు, యురేనియం ప్రాజెక్టులు కావచ్చు వీటి వెనుక స్థానిక ప్రజల ప్రయోజనాలు, అభివృద్ధికి సంబంధంలేని పెట్టుబడి ప్రయోజనాలు రాజ్యమేలుతున్నాయి. పర్యావరణ అనుమతులు లేకుండానే, తగు రక్షణ చర్యలు చేపట్టకుండానే, ప్రజలకు సరైన సమాచారం, నష్టపరిహారం లాంటివి ఇవ్వకుండానే, వారికి భాగస్వామ్యం కల్పించకుండానే పెద్ద ఎత్తున విధ్వంసం జరిగిపోతోంది. ఖనిజ వనరుల తవ్వకాలలో పెద్ద ఎత్తున జరుగుతున్న వేల కోట్ల కుంభకోణాల సంఘటనలు అప్పుడప్పుడు బయటపడితే సామాన్యుల మతులు పోతున్నాయి.

ఈ అభివృద్ధి గురించి ఆర్.ఎస్.రావు విశ్లేషిస్తూ, 'మనదేశంలో అభివృద్ధి భౌతిక స్వరూపం మూడు సమాంతర పరిణామాలలో ముందుకు వచ్చింది. మొదటిది, ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేసింది. రెండవది, లక్షలాది ప్రజలను వాళ్ల భూముల నుండి, పని నుండి, నైపుణ్యం నుండి విడుదల చేసి, వేరొకచోట జీవనోపాధి చూపించలేక నిరుద్యోగులను చేసింది. మూడవది, ఈ రెండు పరిణామాలను భౌతిక ప్రపంచంలో కాక, తప్పుడు చైతన్యంతో ప్రతిఫలించే భావజాలాన్ని బలోపేతం చేసింది. ఇతరత్రా అభివృద్ధి వల్ల ఉత్పత్తి క్రమం నుండి బయటికి విసిరి వేయబడ్డ జనం నిర్దిష్టమైన ప్రాజెక్ట్‌లకి, ఫ్యాక్టరీలకి వ్యతిరేకంగా మాత్రమే కాదు. మొత్తంగా ఈ చారిత్రక క్రమానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు. ప్రశ్నలని మాయచేసే భావజాలాన్ని ప్రశ్నిస్తున్నారు. ప్రశ్నించే హక్కును అణచివేసే అధికారాన్ని ప్రశ్నిస్తున్నారు. పాలకులతో సంఘర్షణ ప్రకృతికి – మనిషికి మధ్య జరిగే నిరంతర సంఘర్షణలో భాగంగా గుర్తిస్తున్నారు. అభివృద్ధి క్రమాన్ని ప్రశ్నించే ఆ ప్రజాపోరాటాలే నిజమైన అభివృద్ధి' అని అన్నారు.

ఈ విశ్లేషణ ఆధారంగా జరుగుతున్న అభివృద్ధిని, తీరుతెన్నులను గమనిస్తే ఉత్పత్తిలో వస్తున్న మార్పులు ఉత్పత్తి సంబంధాలను మార్చే వైపుగా కాకుండా ఉత్పత్తిలో ఆధునికత, ఉత్పత్తి సంబంధాలలో తీవ్రమైన వెనుకబాటును అమలు చేస్తున్న పద్ధతులు కొనసాగుతున్నాయనేది మనకు అర్థమవుతుంది. వీ

## దేశంలో నిల్వలతో పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్ ఖనిజ వనరులు

| క్ర. | ఖనిజం | ఆం.ప్ర.లో మిలియన్ టన్నులు | భారత్‌లో మిలియన్ టన్నులు | దేశంతో పోల్చినప్పుడు ఆం.ప్ర.లో (శాతం) |
|---|---|---|---|---|
| 1 | అపటైట్ | 1.68 | 145.37 | 1.15 |
| 2. | ఆస్బెస్టాస్ | 0.25 | 2.3 ల.ట | 11 |
| 3. | బెరైటిస్ | 67.05 | 70.15 | 95.58 |
| 4. | బాక్సైట్ | 750 | 2525.33 | 30 |
| 5 | బాల్ క్లే | 7.5 | 13.90 | 54 |
| 6. | చైనా క్లే | వి.లే. | 1042.5 | వి.లే. |
| 7. | కాల్‌సెట్ | 3.9 | 10.6 | 41 |
| 8. | ఫైర్‌క్లే | 11.6 | 696.8 | 2 |
| 9. | బొగ్గు | 13021.50 | 229962.28 | 6 |
| 10. | కొర్రండం | 1071 టన్నులు | 15344 టన్నులు | 7 |
| 11. | రాగి | 6.5 | 838 | 0.8 |
| 12. | క్రోమైట్ | 2000 టన్నులు | 88.35 | 0.002 |
| 13. | డొల్మైట్ | 170 (పూర్తిగా కాదు) | 4967.5 | 3.4 |
| 14. | డైమండ్ (కారెట్స్) | 194990 | 1196154 | 16.3 |
| 15. | ఫెల్డ్‌స్పార్ | 1.5 | 16.14 | 9.3 |
| 16. | ఫుల్లర్స్ ఎర్త్ | 25 | 228.3 | 11 |
| 17. | గార్నెట్ | 5 | 39.5 | 12.7 |
| 18. | గ్రాఫైట్ | 60000 టన్నులు | 3.10 | 2 |
| 19. | గోల్డ్ ఓర్ | 6.84 | 17.70 | 39 |
| 20. | జిప్సమ్ | 0.24 | 239.4 | 0.1 |
| 21. | ఇల్లెమైట్ | 21.69 | 90.10 | 24 |
| 22. | ఐరన్ ఓర్ | 263 | 9602 | 3 |
| 23. | క్యానైట్ | 4.65 | 53.42 | 9 |
| 24. | లెడ్, జింక్ | 7.5 | 179.2 | 4.2 |
| 25. | సున్నపురాయి | 30400 | 76446 | 40 |
| 26. | లైమ్ కంకర్ | 3.5 | అ.లే. | వి.లే. |
| 27. | మోన్‌జైట్ సాండ్ | 32 | అ.లే. | వి.లే. |
| 28. | మాంగనీస్ | 7 | 176.5 | 4 |
| 29. | మైకా | 0.045 | వి.లే. | వి.లే. |
| 30. | ఒకర్స్ | అ.లే. | 22.32 | వి.లే. |
| 31. | క్రూడ్ ఆయిల్, | అ.లే. | 764.63 | వి.లే. |
| | నేచురల్ గ్యాస్ | | 706.69 (మి. క్యూబిక్) | వి.లే. |
| 32. | పైరొఫైలైట్ | అ.లే. | 5.2 | వి.లే. |
| 33. | క్వార్ట్జ్, సిలికా సాండ్ | 50 | 983.53 | 5 |
| 34. | క్వార్ట్‌జైట్ | అ.లే. | 365.52 | వి.లే. |
| 35. | రుటైల్ | 1 | 6.45 | 15.5 |
| 36. | స్టైటైట్ | 5 | 83.66 | 6 |
| 37. | టంగ్‌స్టన్ | 12 | 39.65 | 30 |
| 38. | వర్మికులైట్ | అ.లే. | 312454 టన్నులు | వి.లే. |

మి.ట. : మిలియన్ టన్నులు; ల.ట. : లక్ష టన్నులు; అ.లే. : అంచనాలు లేవు; వి.లే. : వివరాలు లేవు

మూలం : ఇంటర్నెట్

**ఆంధ్రప్రదేశ్ ఖనిజ వనరుల రెవెన్యూ 2007-08**

| క్ర. | ఖనిజం | ప్రమాణం | పరిమాణం | విలువ (రు. కోట్లు) |
|---|---|---|---|---|
| 1 | బొగ్గు | వేల టన్నులు | 43758 | 5587.91 |
| 2 | సహజ వాయువు | మిలియన్ క్యూబిక్ మిటర్లు | 1536 | 460.66 |
| 3 | పెట్రోలియం | వేల టన్నులు | 243 | 135.59 |
| 4 | ఇనుము/హెమటైట్ | వేల టన్నులు | - | 284.74 |
| 5 | మాంగనీస్ | వేల టన్నులు | 126 | 11.90 |
| 6 | అపటైట్ | టన్నులు | 3323 | 0.75 |
| 7 | ఆస్బెస్టాస్ | టన్నులు | 6254 | 26.27 |
| 8 | బాల్‌క్లే | టన్నులు | 465767 | 10.00 |
| 9 | బెరైటిస్ | టన్నులు | 913063 | 52.86 |
| 10 | క్లే (ఇతర) | టన్నులు | 375257 | 4.52 |
| 11 | డొలొమైట్ | టన్నులు | 1568844 | 37.55 |
| 12 | ఫెల్డ్‌స్పార్ | టన్నులు | 534606 | 10.48 |
| 13 | ఫైర్ క్లే | టన్నులు | 84638 | 1.53 |
| 14 | గార్నెట్ | టన్నులు | 1701 | 0.08 |
| 15 | లటరైట్ | టన్నులు | 1398357 | 10.97 |
| 16 | లైమ్ కంకర్ | టన్నులు | 1660 | 0.06 |
| 17 | లైమ్‌శెల్ | టన్నులు | 7101 | 0.18 |
| 18 | సున్నపురాయి | వేల టన్నులు | 35579 | 363.94 |
| 19 | మైకా (ముడిపదార్థం) | టన్నులు | 22742 | 72.73 |
| 20 | ఓక్ర | టన్నులు | 78547 | 0.35 |
| 21 | క్వార్ట్జ్ | టన్నులు | 315483 | 3.79 |
| 22 | క్వార్టైజ్ | టన్నులు | 46441 | 0.55 |
| 23 | స్టొయింగ్ సాండ్ | టన్నులు | 2648518 | 11.02 |
| 24 | సిలికా సాండ్ | టన్నులు | 1305202 | 6.72 |
| 25 | డబ్ల్యు శెల్ | టన్నులు | 493810 | 2.40 |
| 26 | స్టెటైట్ | టన్నులు | 119889 | 3.89 |
| 27 | వర్మిక్యులైట్ | టన్నులు | 16931 | 0.76 |
| 28 | పైరొఫైలైట్ | టన్నులు | 809 | 0.01 |
| 29 | ఇతర ఖనిజాలు | టన్నులు | 19119 | 0.10 |
| 30 | బి. గ్రనైట్ | క్యూబిక్ మీటర్లు | 475272 | 1033.33 |
| 31 | సి. గ్రనైట్ | క్యూబిక్ మీటర్లు | 312285 | 427.49 |
| 32 | కూబ్స్, కర్బ్స్ | క్యూబిక్ మీటర్లు | 99412 | 3.20 |
| 33 | గ్రావెల్/ఎర్త్ | క్యూబిక్ మీటర్లు | 76248670 | 1116.35 |
| 34 | ఫుల్లర్స్ ఎర్త్ | టన్నులు | 194089 | 8.52 |
| 35 | లైమ్‌స్టోన్ స్లాబ్స్ | చదరపు మీటర్లు | 22683398 | 498.17 |
| 36 | లైమ్‌స్టోన్ కంకర్ | టన్నులు | 10073 | 0.28 |
| 37 | లైమ్‌స్టోన్ | టన్నులు | 192800 | 2.82 |
| 38 | మొజైయిక్ చిప్స్ | టన్నులు | 251286 | 8.09 |
| 39 | మార్బుల్ | టన్నులు | 20748 | 1.82 |
| 40 | రోడ్ మెటల్ | క్యూబిక్ మీటర్లు | 178828201 | 6545.64 |
| 41 | స్లేట్ స్టోన్ | టన్నులు | 83270 | 2.68 |
| 42 | డ్రెడ్జింగ్ సాండ్ | క్యూబిక్ మీటర్లు | 20286846 | 405.73 |

మూలం : స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్, ఆంధ్రప్రదేశ్ - 2008

**ఆంధ్రప్రదేశ్‌లో ఖనిజ వనరులు ఉన్న ప్రాంతాలు**

| క్ర. | ఖనిజం | జిల్లా | లభ్యమవుతున్న నిల్వలు |
|---|---|---|---|
| 1 | వజ్రాలు | అనంతపురం, కర్నూలు, కడప, మహబూబ్‌నగర్,నల్గొండ, కృష్ణా, ఖమ్మం, | 100 టన్నులు |
| 2 | బంగారం | చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, మహబూబ్‌నగర్ | 8.55 ఓర్స్ |
| 3 | సముద్ర ఇసుక | శ్రీకాకుళం నుంచి నెల్లూరు | 241 మిలియన్ టన్నులు |
| 4 | బాక్సైట్ | విశాఖపట్నం, తూర్పు గోదావరి | 613 మిలియన్ టన్నులు |
| 5 | బరైటిస్ | కడప, కర్నూలు, అనంతపురం, మహబూబ్‌నగర్, ఖమ్మం, ప్రకాశం, నెల్లూరు | 76 మిలియన్ టన్నులు |
| 6 | గ్రనైట్ | శ్రీకాకుళం, వరంగల్, కరీంనగర్, ఖమ్మం, చిత్తూరు, నిజామాబాద్ | 2788 మిలియన్ టన్నులు |
| 7 | పాలరాయి | ఖమ్మం, నిజామాబాద్, గుంటూరు, కడప, కర్నూలు, అనంతపురం | వివరాలు లేవు |
| 8 | సెరామిక్స్ | తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఆదిలాబాద్, కడప, కర్నూలు, రంగారెడ్డి, విశాఖపట్నం, శ్రీకాకుళం | సమృద్ధిగా ఉన్నాయి. |
| 9 | క్వార్ట్జ్-ఫెల్డ్‌స్పార్ | రంగారెడ్డి, మహబూబ్‌నగర్, నెల్లూరు, కడప, కర్నూలు, మెదక్, అనంతపురం, నల్గొండ, విజయనగరం, విశాఖపట్నం, గుంటూరు | 50 మిలియన్ టన్నులు |
| 10 | బొగ్గు | ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం | 16,694 మిలియన్ టన్నులు |
| 11 | సున్నపురాయి | నల్గొండ, కడప, కర్నూలు, అనంతపురం, మహబుబ్‌నగర్, రంగారెడ్డి, ఆదిలాబాద్, కరీంనగర్, కృష్ణా, గుంటూరు | 35,220 మిలియన్ టన్నులు |
| 12 | యురేనియం | నల్గొండ, మహబూబ్‌నగర్, కడప, కర్నూలు, గుంటూరు | వివరాలు లేవు |
| 13 | చమురు - సహజవాయువు | కృష్ణా-గోదావరి బేసిన్ | రోజుకు 30-40 ల.క్యూ.మీ. |
| 14 | టంగ్‌స్టన్ ఓర్ | తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి | 11 మిలియన్ టన్నులు |
| 15 | అభ్రకం | నెల్లూరు, విశాఖపట్నం, శ్రీకాకుళం, పశ్చిమగోదావరి | 1000 చదరపు కిలోమీటర్లలో లభిస్తున్నాయి |
| 16 | రాగి, సీసం | గుంటూరు, నల్గొండ, ఖమ్మం | 2 కోట్ల టన్నులు |
| 17 | డోలమైట్ | ఖమ్మం, కర్నూలు | 10 కోట్ల టన్నులు |
| 18 | ఇనుప ఖనిజం | ఖమ్మం, కృష్ణా, కర్నూలు, అనంతపురం, కడప, నెల్లూరు, గుంటూరు, ఆదిలాబాద్ | 60 కోట్ల టన్నులు |
| 19 | ఆపటైట్ | శ్రీకాకుళం, నెల్లూరు | 6 కోట్ల టన్నులు |
| 20 | గ్రాఫైట్ | ఖమ్మ, విశాఖపట్నం, శ్రీకాకుళం విజయనగరం, తూర్పు గోదావరి | 1.1 లక్ష టన్నులు |
| 21 | మాంగనీసు | శ్రీకాకుళం | 18 లక్ష టన్నులు |

మూలం : 'ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ 1956-2006' సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

**ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాల వారీగా ఖనిజ వనురులు**

| క్ర. | జిల్లా | ఖనిజం | ప్రతిపాదిత పరిశ్రమ |
|---|---|---|---|
| 1 | ఆదిలాబాద్ | బొగ్గు, సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, హైగ్రేడ్ సున్నపురాయి, ఫైర్ క్లే, మాంగనీస్ | ఇటుక, సున్నపురాయి |
| 2 | కరీంనగర్ | ఇనుము, బొగ్గు | |
| 3 | ఖమ్మం | బొగ్గు, ఇనుము, బెరైట్స్, క్రొమైట్, మార్బుల్, గార్నెట్, సున్నపురాయి, మైకా, గ్రాఫైట్, రాగి, కాల్‌సైట్, బంగారం, సీసం, డోలమైట్, టాల్క్, కైనైట్, పైరటీస్ | బెరియం కెమికల్స్ |
| 4 | మహబూబ్‌నగర్ | క్వార్ట్జ్, సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, ఆస్బెస్టాస్, క్లే | గ్లాస్ సాండ్ |
| 5 | మెదక్ | క్వార్ట్జ్ | |
| 6 | నల్గొండ | సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, రాగి సీసం | |
| 7 | నిజమాబాద్ | ఇనుము | |
| 8 | రంగారెడ్డి | క్వార్ట్జ్, సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, పైరటీస్ | గ్లాస్ సాండ్ |
| 9 | వరంగల్ | ఇనుము, బొగ్గు, మైకా, డోలమైట్, గ్రాఫైట్ | |
| 10 | అనంతపురం | ఇనుము, బెరైట్స్, స్టైటైట్, ఆస్బెస్టాస్, టాల్క్, రాగి, వజ్రాలు, కాల్‌సైట్, బంగారం డోలమైట్ | టాల్కం పౌడర్, |
| 11 | చిత్తూరు | ఇనుము, క్లే, గ్రాఫైట్, ఆస్బెస్టాస్, టాల్క్, బంగారం | ఇన్సులేటింగ్ ఇటుకలు |
| 12 | కడప | ఆస్బెస్టాస్, బెరైట్స్, ఇనుము, పైరటీస్, టాల్క్, సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, క్లే, డోలమైట్, ఇనుము, వజ్రాలు, కాల్‌సైట్, బంగారం, రాగి | సెరామిక్-వేర్, రీఫ్యాక్టరీస్ |
| 13 | కర్నూలు | ఇనుము, బెరైట్స్, ఒక్రర్స్, పైరటీస్, టాల్క్ | బెరియం కెమికల్స్, |
| 14 | తూర్పు గోదావరి | బొగ్గు, ఇనుము, గ్రాఫైట్, మైకా, బాక్సైట్, టంగ్‌స్టన్ | గ్రాఫైట్ పౌడర్, పెన్సిల్ లెడ్ |
| 15 | పశ్చిమ గోదావరి | బొగ్గు, మైకా, టంగ్‌స్టన్, గ్రాఫైట్, క్లే, సున్నపురాయి | సెరామిక్-వేర్, రీఫ్యాక్టరీస్, సున్నపురాయి |
| 16 | గుంటూరు | సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, వజ్రాలు, రాగి, సీసం, మార్బుల్, ఇనుము | గ్లాస్ సాండ్ |
| 17 | కృష్ణా | సిమెంట్ గ్రేడ్ సున్నపురాయి, ఇనుము మైకా, బెరైట్స్, క్రొమైట్, వజ్రాలు, గ్రాఫైట్ స్లాబ్స్, ఆస్బెస్టాస్, సున్నపురాయి, సీసం, బంగారం, రాగి, డోలమైట్ | బయోక్రమేట్స్, పెయింట్స్, డిస్పెటంబర్ |
| 18 | నెల్లూరు | మైకా, జిప్సం, కైనైట్, అపటైట్, బెరైటీస్, బంగారం, రాగి, గార్నెట్, టాల్క్ | మైకా ఇటుకలు, ప్లాస్టర్ ఆఫ్ పారిస్ |
| 19 | శ్రీకాకుళం | మాంగనీస్, గ్రాఫైట్, గార్నెట్ సాండ్, అపటైట్ | గ్రాఫైట్ ఉత్పత్తులు, అబ్రసివ్స్ |
| 20 | విశాఖపట్నం | ఇనుము, మైకా, గ్రాఫైట్, బాక్సైట్, అపటైట్, కాల్‌సైట్, గార్నెట్ | గ్రాఫైట్ ఉత్పత్తులు, అబ్రసివ్స్ |
| 21 | ప్రకాశం | బెరైటీస్, మాంగనీస్, బంగారం, కైనైట్, రాగి | |
| 22 | విజయనగరం | మాంగనీస్, గ్రాఫైట్ | |

*స్వదేశీ, విదేశీ కంపెనీలకు గనులను లీజుకివ్వడం, లాభాలే ధ్యేయంగా పర్యావరణ విధ్వంసం జరుగుతోందనితెలియజేస్తోంది* ***ఇనుప ఖనిజ ఎగుమతి వ్యతిరేక కమిటీ***

# ఖనిజ నిలువలు వ్యక్తిగత ఆస్తులు కావు

వలస పాలన కాలంలోనే భూగర్భంలో లేదా జల గర్భంలో దొరికే ఏ నిక్షేపాలయినా వ్యక్తుల సొంత ఆస్తిగా కాక దేశ ప్రజలు మొత్తం అనుభవించాల్సినవిగా గుర్తించారు. అది బొగ్గు, చమురు, సున్నం, గ్రానైట్, ఇనుము, ఇత్తడి, అల్యూమినియం – బంగారంతో సహా ఎక్కడ ఏది లభ్యమయినా అది జాతి మొత్తానికి సంబంధించిన ఉమ్మడి సొత్తుగానే పరిగణిస్తారు. అందువల్ల వీటిని ఉపయోగించుకొని మనకు కావలసిన పరిశ్రమలు నెలకొల్పుకున్నా, ఎగుమతులు చేసినా ఆ వచ్చే ఆదాయ వనరులు జాతీయ సంపదలో భాగం కావాలి. మొదట ప్రజల అవసరాలు తీర్చడం – ఆ తర్వాత రాబట్టగలిగితే విదేశీ వాణిజ్యం ద్వారా లాభాలు రాబట్టడానికి పూనుకోవడం సహజంగా ప్రభుత్వాల బాధ్యత. ఇక్కడే ముడి ఖనిజాలను అమ్ముకోవాలా లేక ఆ ఖనిజాల నుండి వస్తువులను తయారు చేసి అమ్ముకోవాలా అన్నది కూడ ప్రభుత్వాలు ఆలోచించాలి. నాటి వలస పాలకులు మన దేశంలో పండిన పత్తిని కారుచౌకగా కొని దాన్ని తరలించుకెళ్లి లండన్‌లో బట్టల మిల్లుల్లో ఉత్పత్తి అయిన బట్టల్ని ఎక్కువ రేట్లకు మనకే అమ్మి లాభాలు చేసుకున్న అనుభవం మనకుంది.

జాతీయవాద దృక్పథంతో ఆలోచించే పాలకులు అయినా, కనీసం ప్రజలపట్ల బాధ్యత ఉన్న ఏ పాలకులయినా దేశ సంపదను విదేశాలకు – అదీ కారుచౌకగా అసలు తరలించరు. అయితే మన స్వతంత్ర పాలకులు ఏం చేశారో చూద్దాం.

గనులను తవ్వితీయడం మన దేశంలో రెండు రకాలుగా జరుగుతోంది. స్టీల్ పరిశ్రమ పెట్టుకునే వాళ్లకు మైనింగ్ లీజుకిచ్చి, భూములు కేటాయించి వాటి నుండి ప్రభుత్వం సీనరేజి వసూలు చేసుకోవడం. రెండవది, ప్రభుత్వమే గనులు తవ్వడం. ఇందుకోసం నేషనల్ మైనింగ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ – జాతీయ గనుల అభివృద్ధి సంస్థ (ఎన్ఎండిసి) ని ఏర్పాటు చేసి ప్రభుత్వరంగంలోనే ఖనిజాల్ని వెలికితీసి అమ్మడం రెండో పద్ధతి. గని దగ్గరే పరిశ్రమ పెట్టడం అన్ని చోట్లా సాధ్యం కాదు గనుక పరిశ్రమకు అనువైన చోటికి రవాణా సౌకర్యం కల్పించడం కూడా గని కార్యకలాపంతో ముడిపడిన కీలకమైన అంశం అవుతుంది.

**ఇనుప ఖనిజ ఉత్పత్తి కోట్ల టన్నులలో**

| సంవత్సరం | ప్రభుత్వ రంగం | ప్రైవేట్ రంగం | మొత్తం |
|---|---|---|---|
| 2000–01 | 4.35 | 3.73 | 8.08 |
| 2004–05 | 5.69 | 6.37 | 12.06 |

ఇనుప పరిశ్రమ విషయానికొస్తే 1906లో స్టీల్ కర్మాగారాలు నెలకొల్పిన టాటాలాంటి వాళ్లకు గనుల్ని సొంతంగానే (కాప్టివ్ మైన్స్) కేటాయించారు. గనులు స్వతహాగా లేని పరిశ్రమలకు ఎన్ఎండిసి సరఫరా చేసేది. జపాన్‌లో స్టీల్ పరిశ్రమకు ఇనుప ఖనిజం అవసరమై మన పాలకులతో సంప్రదింపులు జరిపింది. మధ్యప్రదేశ్‌లోని బైలదిల్లా గనుల నుండి విశాఖపట్నం ఓడరేవుకి చేర్చి అప్పగించేలా మన పాలకులు ఒప్పందం కుదుర్చుకున్నారు. దీనికోసం కిరండల్ రైలుమార్గం నిర్మాణం, విశాఖ పోర్టు అభివృద్ధి జపాన్ ఇచ్చిన అప్పుతో 1970లలోనే చకచకా జరిగిపోయాయి.

**ఇనుప ఖనిజ ధరలు పెరుగుదల (టన్నుకు రు.)**

| | 1.04.07 నాటికి | 1.04.08 నాటికి |
|---|---|---|
| ఎన్ఎండిసి (64 శాతం ఇనుము) | 1300–2200 | 2000–3500 |
| ప్రైవేట్ గని కంపెనీలు | 2200–3000 | 2500–5500 |
| **ప్రస్తుత ప్రైవేట్ కంపెనీల ధరలు** | | |
| ఇనుప సుద్దలు టన్నుకు | 2500–7500 | |
| 63 శాతం గ్రేడ్ మధ్యరకం టన్నుకు | 2500–4000 | |

ఎకనామిక్ టైమ్స్, 5 ఆగస్ట్ 2008

అయితే ఆనాటి లెక్కల ప్రకారమే గని నుండి ఇనుప ఖనిజాన్ని వెలికితీయడానికి అయిన ఖర్చు టన్నుకు 70 రూపాయలు కాగా టన్ను 47 రూపాయలకే జపాన్ పారిశ్రామికవేత్తలకు అమ్మారు. (జపాన్ ఇచ్చిన అప్పులు వడ్డీతోసహా తీర్చాల్సిందేనన్న విషయం మరచిపోకూడదు). తీరా జపాన్‌లో స్టీలు పరిశ్రమ సంక్షోభానికి గురయి ఎగుమతులు నిలిపి వేయమంటే ఇనుప గనులు మూసివేశారు. 1978 ఏప్రిల్‌లో పని కోల్పోయిన కార్మికులు సమ్మె చేస్తే రాత్రి వేళ నిద్రిస్తున్న కార్మికులపై కాల్పులు జరిపించింది నాటి జనతా ప్రభుత్వం.

నష్టానికి సిద్ధపడి దేశ సహజ సంపదను ఎందుకు ఎగుమతి చేస్తున్నారన్న ప్రశ్నకు నాటి ప్రభుత్వాలు చెప్పిన జవాబు – గనుల నిర్వహణ ద్వారా, రవాణా ద్వారా కార్మికులకు పనులు కల్పిస్తున్నామని. ఇప్పుడు దేశంలో స్టీల్ ధరలు టన్ను 16 వేల రూపాయల నుండి 50

వేల రూపాయలకి పెరిగి ఈ సంక్షోభంలో ఎగుమతులు నిలిపివేయమన్న డిమాండ్‌కు ప్రస్తుత పాలకులు చెబుతున్న జవాబు కూడ ఉద్యోగాల కల్పనే. విదేశీ మారకాన్ని సంపాదించడాన్ని దీనికి జోడిస్తున్నారు.

ముడిసరుకు ఎగుమతి కన్నా దానితో పరిశ్రమ స్థాపించడం ద్వారానే ఎక్కువ ఉద్యోగాలు కల్పించగలుగుతారనేది ఎవరైనా కళ్లు మూసుకుని చెప్పగలిగే విషయం. స్టీల్ పరిశ్రమలు నెలకొల్పడానికి మన దేశంలో అనుకూల పరిస్థితులు లేవా అని ప్రశ్నించుకుంటే కూడా కావలసినన్ని ఉన్నవని జవాబు వస్తుంది. 1970లలో విశాఖ ఉక్కు - ఆంధ్రుల హక్కు పేరుతో యువత సాగించిన ఉద్యమం ఈ సందర్భంగా గుర్తురాక మానదు. అది వచ్చింతర్వాత విశాఖ రూపురేఖలు మారడం మన కళ్లముందున్న విషయమే. దేశంలోని అవసరాల రీత్యానూ, అంతర్జాతీయ ధరవరల రీత్యానూ స్టీల్ పరిశ్రమలను ప్రోత్సహించడం ప్రయోజనకరం. విదేశీ మారక ద్రవ్య సంపాదన అన్న కోణం నుండి చూసినా స్టీల్ అమ్మకం ద్వారానే పెరిగిన అంతర్జాతీయ మార్కెట్లో ఎక్కువ లాభాలు వస్తాయన్నది కూడ నిర్వివాదమయిన విషయం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వసూలు చేసుకుంటున్న ఎక్సైజ్ సుంకాలూ, అమ్మకం పన్నులు కూడ పెరిగేది పారిశ్రామిక సరుకుల నుండే. ముడిసరుకుకు మానవ శ్రమ కలిస్తేనే విలువ ఆధారిత వస్తువులు రూపొందుతాయి.

మన దేశంలో మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, కర్నాటక, జార్ఖండ్, ఒరిస్సా, గోవా, మహారాష్ట్ర, ఆంధ్ర, కేరళ, రాజస్థాన్, తమిళనాడు రాష్ట్రాల్లో ఇనుప ఖనిజ నిల్వలున్నాయి. మొత్తం నిల్వలు 23.59 బిలియన్ టన్నులు (2359 కోట్ల టన్నులు). ఇప్పటి తాజా అంచనాల ప్రకారం సంవత్సరానికి 8.5 కోట్ల టన్నులు దేశంలో వినియోగమవుతుండగా 10 కోట్ల టన్నులు ఎగుమతి అవుతోంది. అంటే సుమారు సంవత్సరానికి 20 కోట్ల టన్నుల ఇనుప ఖనిజాన్ని వాడుతున్నారు. జనాభాలో మనకంటే ముందున్న ఏకైక దేశం చైనా. అక్కడ దేశీయంగానే సుమారు 60 కోట్ల టన్నుల ఖనిజాన్ని వాడుతున్నారు. వాళ్ల దేశంలో అపార నిల్వలు ఉన్నప్పటికీ దాన్ని అట్టిపెట్టుకొని మన దేశం నుండి దిగుమతి చేసుకుంటున్నారన్న అంశాన్ని దృష్టిలో పెట్టుకుంటే ఆ పాలకుల ముందుచూపునూ, మన పాలకుల విచ్చలవిడితనాన్నీ, బాధ్యతా రాహిత్యాన్నీ, భవిష్యత్‌తరాలకు చేస్తున్న ద్రోహాన్నీ అర్థం చేసుకోవచ్చు.

పది శాతం చొప్పున అవసరాలు పెరుగుతాయనుకుంటే ఈ నిల్వలను ఇలాగే ఎగుమతి చేస్తూ పోతే 25, 30 సంవత్సరాల తర్వాత మన నిల్వలు ఖాళీ అయి, చీలలూ, గుండు సూదులు కూడా విదేశాల నుండి దిగుమతి చేసుకోవాల్సి వస్తుంది.

**వివిధ దేశాల ఇనుప ఖనిజ ఉత్పత్తి**

| దేశం | ఉత్పత్తి (కోట్ల టన్నులు) |
|---|---|
| చైనా | 52.0 |
| బ్రెజిల్ | 30.0 |
| ఆస్ట్రేలియా | 27.0 |
| ఇండియా | 15.0 |
| రష్యా | 10.5 |
| ఉక్రెయిన్ | 7.3 |
| అమెరికా | 5.4 |
| దక్షిణాఫ్రికా | 4.0 |
| కెనడా | 3.3 |
| స్వీడన్ | 2.4 |
| వెనిజులా | 2.0 |
| ఇరాన్ | 2.0 |
| మారిటేనియా | 1.1 |
| ఇతర దేశాలన్నీ కలసి | 4.3 |
| మొత్తం ప్రపంచం | 169.0 |

2006కి అమెరికా జియలాజికల్ సర్వే లెక్కలు

ఒకప్పుడు ఎన్ఎండిసి వంటి ప్రభుత్వ సంస్థలే ఖనిజాల్ని వెలికి తీసేవి. ఎగుమతి కార్యకలాపాలు నిర్వహించేవి. అయితే సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ క్రమంలో చట్టాలన్నిటితోపాటు మైనింగ్ చట్టాలు కూడా సవరణ చేశారు పాలకులు. పరిశ్రమ ఉన్న వారికే మైనింగ్ లైసెన్సులిచ్చే స్థానంలో ప్రైవేట్ అమ్మకం కోసం కూడ మైనింగ్ లీజు లిచ్చారు. లక్షకోట్ల రూపాయల విదేశీ పెట్టుబడిని ఆకర్షించే పేరిట గనుల విధానాన్ని సవరించి ప్రభుత్వం బొగ్గు, ఇనుము, బాక్సైట్, బంగారం తదితర ఖనిజాల గనుల రంగంలోకి విదేశీ, స్వదేశీ ప్రైవేట్ పెట్టుబడులకు అనుమతించింది.

ఇనుము రంగంలోనే 2 లక్షల 78 వేల 773 చదరపు మైళ్ల ప్రాంతంలో, ముడి ఇనుప ఖనిజాన్ని తవ్వుకొనేందుకు, ఆ ఖనిజాన్ని ఎగుమతుల ద్వారా అమ్ముకునేందుకు ప్రైవేట్ కంపెనీలకు కేంద్రం అనుమతులిచ్చింది. ఇదికాక పలు గనులను రాష్ట్ర ప్రభుత్వాలు కూడ ప్రైవేట్ సంస్థలకు ధారాదత్తం చేశాయి. మన రాష్ట్రంలో ఓబుళాపురం గనుల తవ్వకానికి గాలి జనార్ధనరెడ్డికి 26 హెక్టార్లు (65 ఎకరాలు) అనుమతించారు. బ్రాహ్మణి స్టీలు పెడతామని మళ్లీ మరో 104 హెక్టార్లు (260 ఎకరాలు) కేటాయించడం ఈ క్రమంలో జరిగిందే. దీంతో ప్రభుత్వరంగ మైనింగ్ కంటే ప్రైవేట్ రంగ మైనింగ్ పెరిగింది.

ప్రైవేట్ రంగపు ఈ ఉత్సాహానికి కారణం అంతర్జాతీయంగా పెరిగిన ఇనుప ఖనిజ ధరలే. టన్ను 2000 రూపాయల నుండి 5000 రూపాయల వరకు ప్రస్తుతం 7500 రూపాయలకు పెరిగింది.

*(మూలం : **'ఇనుప ఖనిజ ఎగుమతులెందుకు?'** ఇనుప ఖనిజ ఎగుమతి వ్యతిరేక కమిటీ, నెల్లూరు ప్రచురణ ఆగస్ట్ 2008 నుంచి)* వీ

***కడప జిల్లాలో ఖనిజ దోపిడీ, ఆ పెట్టుబడి అండతో సాగిన ముఠా రాజకీయాలపై 1996లో ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ప్రచురించిన నివేదిక లోంచి...***

# గనులు - రాజకీయ పరిణామాలు

*రాష్ట్రంలో ఖనిజ సంపదను తమ సొంతం చేసుకొని కోట్లకు పడగెత్తినవారు, అటు నుంచి రాజకీయాలలోకి ప్రవేశించిన వారు ఎందరో ఉన్నారు. ఇవాళ రాష్ట్రమంతా వ్యాపించిన నెల్లూరు జిల్లా సంపన్న రాజకీయ కుటుంబాలు వంద సంవత్సరాల వెనుక నుంచి ఇటీవలి వరకు  అక్కడ అభ్రకం గనుల ద్వారానే సంపన్నులై, అటు మద్రాస్ సినిమా రంగానికి, ఇటు విశాఖపట్నం నుంచి హైదరాబాద్ దాకా కాంట్రాక్ట్‌లలోకి, చివరికి రాజకీయాలలోకి ప్రవేశించారు. గ్రామాలలో పెత్తందార్లుగా మారుతున్న రాజకీయ నాయకులెందరో తమ గ్రామాల పక్కన పారే వాగుల ఇసుకను అమ్ముకొని, కొండలు పగులగొట్టి పైకి ఎదిగినవారే. విశాఖపట్నం జిల్లా అడవులలో బాక్సైట్‌ను తవ్వుకు పోవడానికి ప్రయత్నిస్తున్న రస్-అల్-ఖైమా, జిందాల్‌లు రాష్ట్రంలోని రెండు ప్రధాన పార్టీలకు పోషకులుగా ఉన్నారు. సింగరేణి బొగ్గు గనులు పేరుకు ప్రభుత్వరంగంలో ఉన్నా, రవాణా కాంట్రాక్ట్‌ల ద్వారా ప్రైవేటీకరణ ద్వారా, వ్యాపార-రాజకీయ మాఫియా అక్కడ కూడ బలపడింది. రాష్ట్రంలోని అన్ని ఖనిజాలకు, అన్ని జిల్లాలకు వర్తించే ఈ కథ కడప జిల్లాలో ఎలా జరిగిందో ఒక ఉదాహరణ.*

**క**డప జిల్లా కోడూరు మండలంలోని మంగంపేట గనులలో ముగ్గురాళ్ల తవ్వకం 1925 నుండి ఉంది. కానీ మొదట్లో ముగ్గురాళ్లకు మార్కెట్ ఎక్కువ లేదు. పెట్రోలియం శుద్ధిలో మంగంపేట ముగ్గురాళ్లు ఉపయోగపడతాయని కనుకున్న తర్వాతే (1970లలో) వాటి ధర పెరిగింది. వై.ఎస్. రాజారెడ్డి 1964లో వెంకటనర్సయ్య అనే ముగ్గురాళ్ల వ్యాపారికి పార్ట్‌నర్‌గా మంగంపేట బెరైటీస్ గనులలోకి ప్రవేశించారు. (మొదట సూపర్‌వైజర్‌గా ప్రవేశించి తరువాత పార్ట్‌నర్ అయ్యాడంటారు.) ముగ్గురాళ్ల ధర పెరిగిన తర్వాత ఆ పార్ట్‌నర్‌ను తొలగించుకొనే ప్రయత్నంలో రాజశేఖరరెడ్డి వెంకటనర్సయ్యను 1975లో చంపించారు. 1978లో రాజశేఖరరెడ్డి ఎన్నికలలో ప్రవేశించి ముగ్గురాళ్ల డబ్బులు పెద్ద ఎత్తున కుమ్మరించి పులివెందుల నుండి గెలిచారు.

వై.ఎస్. కుటుంబంతోపాటు మంగంపేట బెరైటీస్ గనుల వల్ల కోటీశ్వరులయిన వాళ్లు కందుల ఓబుల్ రెడ్డి, సి.ఎం. బలరాంరెడ్డి. వీళ్ల చేతిలోకి అంతకు ముందెన్నడూ లేనంత డబ్బు వచ్చింది. దానిని ఖర్చుపెట్టి 1978 తరువాత వాళ్లు జిల్లా రాజకీయాలలో ఆధిపత్యం కోసం ప్రయత్నం చేసారు. ఓట్లు కొన్నారు. ఫ్యాక్షనిస్టుల మద్దతు కొన్నారు. ఓబుల్‌రెడ్డి ఎం.పి. అయ్యారు. అతని కొడుకు శివానందరెడ్డి కడప ఎం.ఎల్.ఎ. అయ్యారు. బలరాంరెడ్డి జిల్లా పరిషత్ ఛైర్మన్ అయ్యారు. అతని తమ్ముడు రాంనాథరెడ్డి జమ్మలమడుగు ఎం.ఎల్.ఎ. అయ్యారు. రాజశేఖరరెడ్డి 1978 నుండి అసెంబ్లీకి పార్లమెంట్‌కు గెలుస్తూనే ఉన్నారు. ముగ్గురాళ్ల లాభాలు వేసిన ఈ వరవడిలోకి 1980 తరువాత సారాయి వ్యాపార లాభాలు ప్రవేశించాయి. ముగ్గురాళ్ల వ్యాపారం కొద్ది మందికే పరిమితం కాగా సారాయి వ్యాపారం దౌర్జన్యం చేసే సత్తా ఉన్న ప్రతీ ఒక్కడి సొత్తు అయింది. ఈ డబ్బు జిల్లా రాజకీయాలను దిగజార్చింది. పైన వివరించినట్టు, సరిగ్గా ఇదే సమయంలో ఆధిపత్యం కోసం హింసా దౌర్జన్యాలు ప్రయోగించే రాజకీయ సంస్కృతి జిల్లాలో ప్రబలింది. రాజకీయ నాయకులు స్వయంగా ముఠాలు కట్టి ఆధిపత్యం కోసం దౌర్జన్యానికి పాల్పడడమే కాక, గ్రామాలలో ఫ్యాక్షన్లు పెట్టించి, ఉన్న వాటిని పెంచిపోషించి, తమ పురోగమనానికి పునాది వేసుకున్నారు. రాజకీయాలలోకి పెద్ద ఎత్తున ప్రవేశించిన డబ్బుకూ, పెద్ద ఎత్తున పెరిగిన ముఠా దౌర్జన్యాలకూ సన్నిహిత సంబంధం ఉంది. ఆ సంబంధాన్ని వై.ఎస్. రాజశేఖరరెడ్డి రాజకీయ చరిత్రలో చూడవచ్చు.

వై.ఎస్. కుటుంబం మొదట్లో పెద్దగా ధనవంతులు కారు. రాజారెడ్డి తండ్రి కాలంలో 1970లలో బలపనూరు నుండి పులివెందులకు వచ్చి వ్యవసాయం, కాంట్రాక్టులు చేసుకొని బతికేవారు. పులివెందుల తాలూకాలో ఆధిపత్యం చలాయిస్తున్న డి.ఎన్. రెడ్డితో రాజకీయంగా తలపడ్డారు. మిల్లు ఓనర్లు, భూస్వాములు, ఫ్యూడల్ అహంభావులు అయిన డి.ఎన్. రెడ్డి కుటుంబం ఆధిపత్యాన్ని ఎదుర్కోవడానికి కొంత రౌడీగా పేరు పొందిన రాజారెడ్డిని మిగిలినవాళ్లు (కమ్యూనిస్టు పార్టీతో సహా) సపోర్టు చేశారు. డి.ఎన్. రెడ్డి కుటుంబం హింసా దౌర్జన్యాలు అసలే ఎరుగని వారేం కారు. తమ పద్ధతిలో వాళ్లు చేసేవారు. పులివెందులకు చెందిన కొందరు ఎరుకల వాళ్లు డెకాయిటీలు చేసి బంగారం తీసుకొస్తే డి.ఎన్. రెడ్డి కుటుంబం ఆ బంగారాన్ని మారకం చేసేవారని అంటారు. అయినప్పటికీ రాజారెడ్డి ప్రయోగించిన హింసా దౌర్జన్యాలకు తట్టుకోలేక వాళ్లు వెనక్కి తగ్గారు. 'వాళ్ల గేటు బయటే వాళ్ల మనుషులను రాజారెడ్డి చంపిపోయినా మాట్లాడలేని స్థితికి దిగజారారు' అని ఒక పులివెందుల నివాసి అంటాడు.

రాజారెడ్డి పేరు చెప్తేనే జనం భయపడే స్థితి 1960లలోనే

మొదలయింది. 1970లలో డబ్బులు, దాని వెంబడి కొడుకు రాజశేఖరరెడ్డి రాజకీయాలలో హోదా రావడంతో ఈ టెర్రర్‌కు తిరుగు లేకుండా పోయింది. 1963 (లేక 64) లో రాజారెడ్డి చేయించిన ఒక పట్టపగటి హత్యను ఈ సందర్భంలో స్థానికులు ఉదహరిస్తారు. పులివెందుల ఎరుకల వాళ్లంటే జనంలో కొంత భయం ఉంది. వాళ్లలో కొందరు బందిపోట్లు, దొంగసారాయి అమ్మేవాళ్లు, దౌర్జన్యాలకూ దొమ్మీలకూ రాజకీయ నాయకులకు ఉపయోగపడేవాళ్లు, ఆనాడూ, ఈనాడూ ఉన్నారు. వాళ్లను అటు డి.ఎన్. రెడ్డి కుటుంబం, ఇటు వై.ఎస్. కుటుంబం వాడుకున్నారు. కానీ రాజారెడ్డి తన భుజబలం ప్రదర్శించుకోవడానికి వాళ్లను టార్గెట్‌గానూ ఉపయోగించుకున్నారు. 1963 (లేక 64) లో జరిగిన ఆ సంఘటనలో ఊసన్న అనే ఎరుకల అతన్ని రాజారెడ్డి పట్టపగలు కిరోసిన్ పోసి సజీవదహనం చేసి చంపించారు. ఒక రెడ్డి కులానికి చెందిన స్త్రీ మెడలోని గొలుసు దొంగలించడానికి ఊసన్న ప్రయత్నించాడనీ, ఆమె పెనుగులాడడం చూసిన జనం దృష్టి అటువైపు మళ్లించగా ఆమె తన భార్య అనీ తనతో రానంటుందనీ చెప్పి తప్పించుకొన్నాడనీ కథ. రాజారెడ్డి అదేరోజు అతనిని పట్టుకొని బహిరంగంగా సజీవదహనం చేయించాడు. అప్పటినుండి రాజారెడ్డిని ఎదిరించాలంటే జనం భయపడే పరిస్థితి నెలకొనిందంటారు.

1960లలోనే కోడూరు సమీపంలోని మంగంపేట ముగ్గురాళ్ల వ్యాపారంలోకి వై.ఎస్. రాజారెడ్డి ప్రవేశించారు. పెద్దగా విలువలేని ఈ వ్యాపారాన్ని మొదట ప్రారంభించి చాలా ఏళ్లు నిర్వహించిన వారిలో ముఖ్యులు ముగ్గురాళ్ల కిష్టయ్య, సలారుద్దీన్. దాని విలువ పెరిగేనాటికి అది రెడ్ల చేతిలోకి పోయింది. రాజారెడ్డి వెంకటనర్సయ్య అనే పద్మశాలీ కులస్తుడయిన వ్యాపారి పార్ట్‌నర్‌గా చేరారు. కోడూరు, పులివెందులలు జిల్లాకు తూర్పు పడమరలయినప్పటికీ రాజారెడ్డిని వెంకటనర్సయ్య తీసుకోవడానికి కారణం లేకపోలేదు. అతను కూలీవాళ్లను అదుపులో ఉంచడానికి పనికివస్తాడనీ వ్యాపార సంబంధమైన ఘర్షణలలో తన సంస్థ నిలదొక్కుకోవడానికి పనికొస్తాడనీ అతన్ని తీసుకున్నాడు. ఈ ఆలోచన తనకే ఎసరుపెడతాడని బహుశా వెంకటనర్సయ్య ఊహించి ఉండడు. వై.ఎస్. వాళ్లు అతనిని వదిలించుకోవడానికి 11 లక్షలు ఇచ్చి బయటికి పంపించే ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నానికి గజ్జెల మల్లారెడ్డి (ఒకప్పటి కమ్యూనిస్టు నాయకుడు, ఆ తరువాత పత్రికా సంపాదకుడు) మధ్యవర్తిత్వం నెరపినట్టున్నాడు. అయితే వెంకటనర్సయ్య ఈ బేరంతో సంతృప్తి చెందలేదు. వై.ఎస్. వాళ్లు అతనిని చంపించి సమస్యను పరిష్కరించుకున్నారు. ఈ హత్య రాజశేఖరరెడ్డి చేయించాడంటారు. దానికి ప్రతీకారంగా ఆ తర్వాత వెంకటనర్సయ్య బంధువులు హైదరాబాద్‌లోని రాష్ట్ర సెక్రెటేరియట్‌లోనే రాజశేఖరరెడ్డిపైన కాల్పులు జరిపారు. అతను తప్పించుకొన్నాడు.

బైరైటీస్‌కు మార్కెట్ పెరిగిన తర్వాత ఆ ఖనిజం గనుల శాఖ అజమాయిషీలోకి వచ్చింది. పట్టా భూములున్న వారయినా సరే ప్రభుత్వం దగ్గర లీజు తీసుకొని తవ్వకం చేయాలి. ప్రభుత్వ భూములలో కూడ లీజు ఇచ్చారు. వై.ఎస్. రాజారెడ్డి కంపెనీ (విజయలక్ష్మీ బైరైటీస్) పది ఎకరాల లీజు తీసుకుంది. అయితే 1982లో రాష్ట్ర ప్రభుత్వం మంగంపేటలోని పట్టాభూములను స్వాధీనం చేసుకుని ముగ్గురాళ్ల తవ్వకాన్ని జాతీయం చేసి రాష్ట్ర ఖనిజ అభివృద్ధి సంస్థకు (ఎపిఎండిసి) లీజుకు ఇచ్చింది. ఈ సంస్థ తానే తవ్వకం చేపట్టకుండా ముందునుండి వ్యాపారం చేస్తున్న వాళ్లకు సబ్‌లీజు ఇవ్వనారంభించింది. వై.ఎస్. రాజారెడ్డి ఎనిమిది ఎకరాలు సబ్‌లీజుకు తీసుకున్నాడు. ఈ సబ్‌లీజు నిజానికి నామమాత్రమే. కొన్ని ఎకరాలు సబ్‌లీజుకు తీసుకుంటే ఆ పేరుమీద ఎన్ని ఎకరాలలో ఖనిజం తవ్వుకుపోయినా అడిగే వాడుండడు. వై.ఎస్. వాళ్లు మంగంపేటలో నేషనల్ మాన్యుమెంట్‌గా పురావస్తు శాఖ ప్రకటించిన రక్షిత భూభాగాన్ని సహితం తవ్వుకుని పోయిన సంగతి తెలిసిందే. 1989 అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ గెలిచిందని ప్రకటించిన రాత్రే ఈ రక్షిత ప్రాంతంలో దౌర్జన్యపూరితంగా తవ్వకాలు మొదలు పెట్టారని అంటారు. ప్రభుత్వం మేలుకుని ఆపేటప్పటికి చాలా ఖనిజం తవ్వుకుని పోయారు. ఒక లక్షా యాభైవేల టన్నులు తవ్వుకుని పోయారని అధికారుల అంచనా. (కె.వి. నటరాజన్ కమిషన్). ఒక టన్ను వెల ఆరువందల రూపాయలు. రాష్ట్ర అసెంబ్లీ ఈ విషయాన్ని పరిశీలించడానికి ఒక అసెంబ్లీ సబ్ కమిటీని నియమించింది. వాళ్ల అంచనా ప్రకారం వై.ఎస్. వాళ్లు తవ్వుకుని పోయింది యాభై వేల టన్నులు. అందుకు జుర్మానాగా యాభై లక్షల రూపాయలు వసూలు చేయమని ఆ సబ్ కమిటీ సూచించింది.

వై.ఎస్. కుటుంబం బైరైటీస్ చరిత్రలో వెంకటనర్సయ్య హత్య ఒకటేకాక మరొక వికారమైన సంఘటన కూడా ఉంది. మంగంపేట గ్రామానికి చెందిన రాజగోపాల్ అనే రిటైర్డ్ ప్రభుత్వ అధికారి మేనల్లుడు వివేకానందంకు 1.8 ఎకరాల పట్టాభూమి ఉంది. అందులో ముగ్గురాళ్ల తవ్వకం చేపట్టడానికి అతను రహంతుల్లా అనే వ్యాపారితో కలిసి 15 లక్షల పెట్టుబడి పెట్టాడు. ఇంతలో ప్రభుత్వం ముగ్గురాళ్ల గనులున్న పట్టా భూములన్నింటిని స్వాధీనం చేసుకుని ఖనిజ అభివృద్ధి సంస్థకు అప్పగించింది. అందులో భాగంగా వివేకానందం భూమికూడా ప్రభుత్వం చేతిలోకి పోయింది. అయితే అతను దీనిమీద కోర్టుకుపోయి తన 1.8 ఎకరాల మేరకు స్టే ఆర్డరు తెచ్చుకున్నాడు. కాని అప్పటికే ఈ 1.8 ఎకరాలతో సహా మొత్తం 8 ఎకరాలు వై.ఎస్. వాళ్ల కంపెనీకి ఎపిఎండిసి సబ్‌లీజుకు ఇచ్చింది. కోర్టు స్టే ఇచ్చినా వాళ్లు ఆ 1.8 ఎకరాల నుండి వైదొలగలేదు. వివేకానందం మేనమామ రాజగోపాల్ అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డిని కలిసి తమ భూమిని వై.ఎస్. వాళ్లకు సబ్‌లీజుకు ఎందుకు ఇచ్చారని ప్రశ్నించాడట. దానికి జవాబుగా 'మీరు కువైట్‌కు వెళ్లిపోయారని రాజశేఖరరెడ్డి చెప్పాడు' అని ఆయన అన్నాడట. ఆ 1.8 ఎకరాలను స్వాధీనం చేయాలని వివేకానందం హైకోర్టులో మళ్లీ పిటీషన్ వేశాడు. దీనికి ప్రతికారంగా 1992లో ఒకనాడు రాజాశేఖరరెడ్డి మనుషులు రాజగోపాల్‌పైన హైదరాబాద్‌లో ఘోరంగా దాడిచేశారు. ఆబిడ్స్ రోడ్డులోని ఒక హోటల్ దగ్గర కాపుకాసి అతనిమీద దాడిచేసి కాళ్లు చేతులు విరగ్గొట్టారు. ఆ తర్వాత వివేకానందం తన భూమిని తిరిగి స్వాధీనం చేసుకోగలిగాడు కాని అప్పటికే ఐదు కోట్ల రూపాయల విలువచేసే ఖనిజాన్ని వై.ఎస్. వాళ్లు తవ్వుకుపోయారు.

*(మూలం : **'కడప జిల్లాలో పాలెగాళ్ల రాజ్యం'**, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, కడప జిల్లా ప్రచురణ, జనవరి 1996 నుంచి)*

*పవర్‌లూం పరిశ్రమ వెనుకబాటుకు కారణమైన పాలకుల వివక్ష, నిర్లక్ష్యాల్ని, అభివృద్ధికి నోచుకోని వస్త్ర పరిశ్రమ స్థితిని వివరిస్తున్నారు* **మచ్చ ఆనంద్**

# పవర్ లూం పరిశ్రమ దశ - దిశ

దేశవ్యాప్తంగా చేమగ్గం – మరమగ్గం మధ్య స్పష్టమైన విభజన రేఖ ఉంది. చేనేతరంగంలో సుమారు 1.25 కోట్ల మంది పని చేస్తుండగా, పవర్‌లూం (మరమగ్గం) పరిశ్రమలో సుమారు 48 లక్షల మందికి పైగా పనిచేస్తున్నారు. ఈ రెండింటికీ కలిపి కేంద్ర చేనేత, జౌళిశాఖ ప్రతి ఏటా బడ్జెట్‌లో చేస్తున్న కేటాయింపులపై రెండు రంగాల నుంచి పెద్ద ఎత్తున అభ్యంతరాలు, విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. చేనేత, జౌళి శాఖలను రెండు ప్రత్యేక మంత్రిత్వశాఖలుగా విభజించాలన్న డిమాండ్ దశాబ్దాల తరబడి నానుతూనే ఉంది.

అతి పూరాతనమైన, ప్రపంచంలోనే వస్త్ర పుట్టుకకు జన్మ స్థానంగా పేరొందిన భారతదేశంలో వ్యవసాయరంగం తర్వాత రెండవ అతిపెద్ద ఉపాధిరంగంగా చేనేతకు పేరుంది. ఆ చేనేత పునాదులపై పురుడు పోసుకున్న మరమగ్గాల పరిశ్రమ, దేశంలోని ఆంగ్లేయ పాలిత ప్రాంతాలలో అదీ కోస్తా తీర ప్రాంతాలలోనే కేంద్రీకృతమైంది. ఆ తర్వాత మరికొన్ని ప్రాంతాలకు విస్తరించింది.

దక్షిణాదిన తమిళనాడు, కోస్తా తీర ప్రాంతాలలో కుటీర పరిశ్రమగా మరమగ్గాల పరిశ్రమ ఆంగ్లేయుల పాలనలోనే మొగ్గతొడిగి, నేడు అక్కడి వేలాది నేత కుటుంబాలు ఆర్థిక స్వావలంబన కలిగి ఉన్నాయి. దానికి ఆనుకునే ఉన్న సర్కారు ప్రాంతంలోని కొన్ని కేంద్రాలలో కేంద్రీకృతమైన మరమగ్గాల పరిశ్రమ ఆత్మహత్యలు, ఆకలి చావులు లేని కేంద్రాలుగా అభివృద్ధి చెందిన పరిశ్రమగా పేరొందాయి.

నైజాం ఏలుబడిలోని తెలంగాణ ప్రాంతం మరమగ్గాల పరిశ్రమ ఏర్పాటుకు అంతగా ఆసక్తి చూపని పరిస్థితుల్లో, ఈ ప్రాంతంలోని చేనేతరంగం నుంచి నైపుణ్యం ఉన్న వేలాది మంది నేతన్నలు మహారాష్ట్రకు వలసలు వెళ్లారు. అలా వెళ్లి ఇక్కడికి తిరిగొచ్చిన కొద్దిమందితో తెలంగాణలోనే మొట్టమొదటగా 1969లో సిరిసిల్లలో మరమగ్గాలు ఏర్పాటయ్యాయి. అప్పటికి సిరిసిల్లలో చేనేత మగ్గాలు వేల సంఖ్యలో ఉండగా, వాటి స్థానంలో ఏర్పాటైన మరమగ్గాలు 1990 నాటికి చేనేత మగ్గాలను వందల సంఖ్యకు కుదించాయి. దీనికి ప్రధాన కారణం భీవండి, షోలాపూర్, సూరత్‌లలో పనిచేసిన మరమగ్గాల కార్మికులు తామే స్వయంగా మరమగ్గాలను వేసుకుని, కుటుంబ సభ్యులందరూ దీనిలో పనిచేయడం, ఫలితంగా చేమగ్గంపై పనిచేసే వారెవరూ మిగలకపోవడంతో అవి క్రమంగా కనుమరుగైపోతూ వచ్చాయి.

అయితే రాష్ట్రంలోని దక్షిణ కోస్తా, రాయలసీమలోని పలు జిల్లాల్లో చేనేత రంగం ఇంకా బలంగా ఉంది. తెలంగాణలోని కొన్ని జిల్లాల్లో చేనేతపై పట్టు వస్త్రాలు, ఇతర రకాలు తయారవుతున్నాయి. మొత్తమ్మీద కొన్ని ప్రాంతాలలో మరమగ్గాలపై చేనేతకు రిజర్వ్ చేసిన రకాలు తయారవుతున్నాయని, ఫలితంగా చేనేతరంగానికి దెబ్బతగులుతోందన్న విమర్శలు బలంగా ఉన్నాయి.

ఈ కోణం నుంచి చూసినా మరమగ్గాలకు కేంద్ర స్థానంగా గుర్తింపు పొందిన సిరిసిల్లలో రిజర్వ్ రకాల వస్త్ర ఉత్పత్తులు గత నలభై ఏళ్ల చరిత్రలో ఎప్పుడూ లేవు. సంప్రదాయ ముతక రకం తెల్లవస్త్ర ఉత్పత్తికే ఈనాటి వరకూ ప్రాధాన్యమిస్తూ రావడం గమనార్హం. దీనితో పోలిస్తే తమిళనాడు రాష్ట్ర సరిహద్దుల్లోని మన రాష్ట్ర జిల్లాల్లో కేంద్రీకృతమైన మరమగ్గాల పరిశ్రమ కేంద్రాలు ఎంతో ముందుకెళ్లిన తీరు, ఆ ప్రాంతాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుంచి ఆర్థిక, మౌలిక సదుపాయాల పరంగా అందిన సహాయం వెరసి అభివృద్ధి చెందిన కేంద్రాలుగా గుర్తింపు పొందాయి.

ఆమాటకొస్తే రాష్ట్ర చేనేత, జౌళిశాఖ గణాంకాల ప్రకారమే రాష్ట్రంలో 22 వేల మరమగ్గాలు (ప్రస్తుతం 32 వేలు) కలిగి సిరిసిల్ల ప్రథమ స్థానంలో ఉంది. అయితే ప్రభుత్వ సారథులు మాత్రం సిరిసిల్లను ఇంకా చేనేత కేంద్రంగా, ఇక్కడి బలవన్మరణ నేతన్నలను చేనేత మృతులుగా పేర్కొంటుండడం తెలిసిందే. సరిగ్గా 2008లో సిరిసిల్లను పవర్‌లూం పారిశ్రామిక కేంద్రమని, ఇక్కడి కార్మికులు, పరిశ్రమను ప్రత్యేక పరిస్థితుల కోణంలోంచి చూడాలని సాక్షాత్తూ నాటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి పేర్కొనేంత వరకూ సిరిసిల్ల గురించి చర్విత చరణంలా చేనేతల గురించే చెపుతూ వచ్చారు.

మరమగ్గాల పరిశ్రమ వెళ్లూనుకుని, స్వంత పెట్టుబడితో స్వయంగా వ్యాపారం చేసుకుంటూ లాభమొస్తే నడపడం, నష్టమొస్తే మూసేసుకోవడం వంటి అనుభవాలతో పూర్తిస్థాయిలో ఇది కుటీర పరిశ్రమగా కొనసాగుతూ వస్తోంది. 1997 నుంచి 2001 వరకు కొనసాగిన వరుస ఆత్మహత్యలు, ఆకలి చావులతో పాలక ప్రభుత్వానికి సిరిసిల్ల వస్త్ర పరిశ్రమ సెగ తగిలినా దానికి శాశ్వత పరిష్కారం కల్పించాలన్న దిశగా తీసుకున్న చర్యలు తాత్కాలికమయ్యాయే తప్ప 'సీరియస్'గా పట్టించుకున్న దాఖలాలు లేవు.

ఏ పరిశ్రమ అయినా అభివృద్ధి సాధించాలంటే ఆ పరిశ్రమకు ప్రభుత్వం నుంచి అందే మౌలిక సదుపాయాలు, ఆర్థిక ఉద్దీపనలు, రాయితీలు, కార్మికులకు సంక్షేమ చర్యలు అత్యవసరం. చేనేతకు నిలయంగా శతాబ్దం క్రితం నుంచే సిరిసిల్లకు పేరున్నా, చేనేత రంగానికి

కేటాయించే నిధులు, నేత కార్మికులకు అందాల్సిన సంక్షేమ ఫలాలు వారి దరికి చేరకపోవడమే అసలైన లోపంగా పేర్కొనవచ్చు.

చేనేత సహకార సొసైటీలు సంఖ్య పరంగా అధికంగా కనిపించినా అందులోని లోపాలు, అవినీతి, మకిలి అర్హులైన చేనేతకారులకు లబ్ధి కల్గించలేకపోయాయన్న అపప్రథ ఉంది. ఇది ఒక్క సిరిసిల్ల పరిస్థితే కాదు. తెలంగాణ జిల్లాల్లోని ప్రతి గ్రామంలో దాదాపు చేనేత వర్గానికి చెందిన వారున్నారు. చేనేత వృత్తి కూడు పెట్టని స్థితిలో ఇతర పనులకు మళ్లీ వారున్నారు. చాలామంది చేతిలోని వృత్తి నైపుణ్యాన్ని దాచుకోలేక పవర్‌లూం పరిశ్రమ ఉన్న ఇతర రాష్ట్రాలకు వలసవెళ్లారు. సిరిసిల్లకు సైతం అనేక జిల్లాల వారు వెళ్లి స్థిరపడ్డారు.

సంఖ్యరీత్యా కరీంనగర్, వరంగల్, మెదక్, నల్గొండ, మహబూబ్‌నగర్, నిజామాబాద్ తదితర జిల్లాల్లో చేనేత వర్గానికి చెందిన వారు అక్కడి జనాభాలో వరుసగా, రెండు, మూడవ స్థానాలలో ఉన్నా, వీరి ఆర్థిక పరిస్థితి మెరుగుదలలో మాత్రం ఏ తేడా లేదు. ఇతర వృత్తుల వారితో పోలిస్తే చేనేత కార్మికులు అంత త్వరగా ఇతర ప్రత్యామ్నాయ వృత్తిలోకి మారాలంటే, అంత సులభంగా వదిలిపెట్టి వెళ్లలేరు. మరోవైపు కాగితాల పైనే చేనేతకు చేయూత కనిపించగా, చేనేత నుంచి మరమగ్గాల రంగం వైపు మళ్లిన వేలాది నేతన్నల సంక్షేమం కోసం ఎలాంటి దీర్ఘకాలిక ప్రయోజనం కలిగించే పనులు చేపట్టామనే దానిపై ప్రభుత్వం వద్ద లెక్కలు లేవు.

2009 వరకు సిరిసిల్లలో ఉన్నవి పవర్‌లూంలు అనే విషయమే బహిరంగంగా ప్రకటించని దైన్య స్థితిలో ప్రభుత్వ ఏలికలు ఉండగా, 2008 సెప్టెంబర్ – అక్టోబర్ లలో సిరిసిల్ల మరనేత కార్మికుల ఆకలి చావులు, ఆత్మహత్యల నేపథ్యంలో మరోసారి నేతన్నల అంశం దేశవ్యాప్తంగా చర్చనీయాంశమైంది. ఈ బలవన్మరణాల అంశానికి సినీ గ్లామర్ అద్దడం, ఆ తర్వాత రాజకీయాల తాకిడి అధికం కావడం, తద్వారా ప్రభుత్వ యంత్రాంగం పూర్తిస్థాయిలో కదిలి చేపట్టిన చర్యల ఫలితంగా సిరిసిల్ల ప్రస్తుతానికి తాత్కాలికంగా సంక్షోభం నుంచి కాస్త దూరమైంది.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన మహారాష్ట్ర, గుజరాత్, పంజాబ్, తమిళనాడు రాష్ట్రాలు టెక్స్‌టైల్ పరిశ్రమకు అధిక ప్రాధాన్యత ఇస్తూ వస్తున్నాయి. తమిళనాడు రాష్ట్రం ఏకంగా తమ రాష్ట్ర బడ్జెట్‌లో చేనేత, జౌళి శాఖకు సింహభాగం కేటాయింపులు చేస్తూ వస్తోంది. దాదాపు 32 వేలకు పైగా మరమగ్గాలు, 150కి పైగా అద్దకం యూనిట్లు, వందకు పైగా సైజింగ్ యూనిట్లు, 250కి పైగా వార్పిన్ యూనిట్లు, ఇతర అనేక అనుబంధ పరిశ్రమలు కలిగి ప్రతినిత్యం లక్షలాది మీటర్ల వస్త్రోత్పత్తి చేసే సిరిసిల్ల పరిశ్రమ గురించి స్పష్టమైన అవగాహన రాష్ట్ర ప్రభుత్వానికి లేదంటే అతిశయోక్తి కాదు. రాష్ట్రంలోనే తొలి టెక్స్‌టైల్ పార్కు సిరిసిల్లలో ఏర్పాటు చేశామని ప్రభుత్వం వాదించవచ్చు. కానీ సిరిసిల్ల రాజీవ్‌నగర్‌కు చెందిన కొండ కిష్టయ్య నేత కుటుంబం 2001లో సామూహికంగా ఆత్మహత్య చేసుకున్న బలిదానానికి గుర్తుగా దానిని ప్రకటించారే తప్ప అక్కడి పరిశ్రమను గుర్తించి అభివృద్ధి చేయాలన్న తలంపుతో కాదన్న విమర్శ ఉంది. రాష్ట్రంలో ఎక్కడా లేని విధంగా సిరిసిల్లలో యాభై ఏళ్లు నిండిన నేతన్నలకు వృద్ధాప్య పింఛన్‌లు, నేత కార్మికులకు ఉచితంగా ఇందిరమ్మ గృహాల నిర్మాణం తదితర చర్యలన్నీ సిరిసిల్ల నేతన్నల ఆత్మార్పణం నుంచి ఉద్భవించినవే కానీ – ప్రభుత్వం తనంత తానుగా ఇచ్చినవి కావన్నది స్పష్టం.

ఉత్తర తెలంగాణలోని కరువు పరిస్థితులు, కూడు పెట్టని కులవృత్తుల మధ్య నేతవర్గాల వారికి ఏకైక ఆశా కిరణంలా నిలిచిన సిరిసిల్ల వస్త్ర పరిశ్రమ కేంద్రానికి, అలాగే మొత్తం తెలంగాణ జిల్లాల్లో కరీంనగర్, వరంగల్, నల్గొండ, హైదరాబాద్ తదితర ప్రాంతాల్లో గల మరమగ్గాల పరిశ్రమను ఏ మేరకు పట్టించుకున్నారు? ఎంత మేరకు అభివృద్ధి చేసారని గట్టిగా నిలదీస్తే ప్రభుత్వం వద్ద జవాబు చెప్పేందుకు ఎలాంటి అవకాశం లేని పరిస్థితి ఉందన్న విమర్శ సైతం ఉంది.

ఈ ప్రశ్నలను ప్రభుత్వానికి సూటిగా వేస్తే వచ్చే జవాబును ఇట్టే పసిగట్టవచ్చు. అసంఘటితరంగంలో ఉన్న పవర్‌లూం పరిశ్రమకు ప్రభుత్వం నుంచి నేరుగా అందే విద్యుత్ సబ్సిడీని సిరిసిల్ల పరిశ్రమకు అందిస్తున్నాం కదా? అని చెప్పి చేతులు దులిపేసుకుంటున్నారు. పరిశ్రమను మరింతగా విస్తృత పరచడానికి, ఆధునికీకరణ యూనిట్ల ఏర్పాటుకు వీలు కల్పించిన టెక్స్‌టైల్ పార్క్ మరింత అభివృద్ధి కావడానికి ప్రభుత్వం పటిష్టవంతమైన కార్యాచరణతో పక్కా ప్రణాళికతో, ఆ మేరకు అవసరమైన ప్రత్యేక యంత్రాంగం ఏర్పాటుతో, దీర్ఘకాలికంగా పనులు చేపడితే టెక్స్‌టైల్ కేంద్రాల సరసన తెలంగాణ జిల్లాలన్నింటిలో ఏక కేంద్రమైన రాష్ట్రంలోనే అతి పెద్దదైన సిరిసిల్ల వస్త్ర పరిశ్రమ 'టెక్స్‌టైల్ హబ్'గా నిలుచుండేది.

అనధికారిక లెక్కల ప్రకారం, హైదరాబాద్ మార్కెట్‌ను నిన్నటి వరకు సూరత్, మాలేగాంవ్, ఇచ్చల్‌కారంజి తదితర టెక్స్‌టైల్ వస్త్రోత్పత్తులు శాసించగా ఆ మార్కెట్‌ను సగానికి పైగా సిరిసిల్ల వస్త్రోత్పత్తులు ఆక్రమించడం ఇటీవలి పరిణామం. అంటే అక్కడి చిన్న తరహా వస్త్రోత్తిదారులు తమ స్వంత వనరులతో, తమకు అందుబాటులోని నైపుణ్యంతో ప్రస్తుత మార్కెట్‌ను తట్టుకుని కాస్త నిలబడుతున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో కోట్లాది రూపాయల పెట్టుబడులతో, అంతర్జాతీయ ఆధునిక వస్త్రోత్పత్తులకు ధీటుగా నిల్చునే విధంగా సిరిసిల్ల వస్త్రోత్పత్తి దారులకు ప్రత్యేక బడ్జెట్‌తో ఆర్థిక ఉద్దీపన, రాయితీల సౌకర్యం మరింతగా కలిగిస్తే దక్షిణాదిన టెక్స్‌టైల్ పరిశ్రమ కేంద్రాలైన ఈరోడ్, కొయంబత్తూర్ తదితర కేంద్రాలతో సమానంగా సిరిసిల్ల సైతం ఉండేది. మన రాష్ట్రంలోనే ఏ చీకూ, చింతా లేని విధంగా నడుస్తున్న నగరి తదితర పవర్‌లూం కేంద్రాల వలె ఉండేది.

తెలంగాణలో పారిశ్రామికంగా ఎదగడానికి పలు పట్టణాలు స్థానిక వనరుల రీత్యా సిద్ధంగా ఉన్నా, ఆ దిశగా పాలకవర్గాలు పట్టించుకోలేదు. ముఖ్యంగా ఆయా జిల్లాల్లోని మారుమూల ప్రాంతాలపై దృష్టిని సారించలేదు. స్వార్థ రాజకీయ ప్రయోజనాలు, వ్యక్తిగత ప్రాబల్యం అధికంగా ఉన్నవారు తమ ప్రయోజనాల కోసమే వెంపర్లాడిన ఫలితంగా వ్యవసాయరంగం తర్వాత అతి ముఖ్యమైన చేనేత రంగం శ్రేయస్సు పట్ల ప్రాముఖ్యత చూపించలేదు. ఫలితమే, చాలా గ్రామాలలో నేత వర్గానికి చెందిన వారు చిందరవందరయ్యారు. వారందరికీ ఆశ్రయం కల్పించడానికి, ఉన్న ఊర్లో ఉపాధిని అందించడానికి సిద్ధంగా ఉన్న మరమగ్గాల పరిశ్రమ కేంద్రమైన సిరిసిల్లను పట్టించుకోకపోవడం వలన, ఇలాంటివే మరికొన్ని కేంద్రాలను నిర్లక్ష్యం చేయడం వలన, నాలుగు దశాబ్దాలకు పైగా చరిత్ర కలిగిన మరమగ్గాల పరిశ్రమ ఇప్పటికీ మరుగుజ్జు అవతారంలోనే ఉంది తప్ప, వటవృక్షంగా ఎదగలేదు.

దీనికంతటికీ ప్రాంతాల పట్ల వైషమ్యం చూపిస్తూ, ఏలికలు ఏలిన పాలకుల దోషం తప్ప మరొకటి కాదు. ఇన్నేళ్లుగా జరిగిన, జరుగుతున్న ఈ నేరానికి బాధ్యత ఎవరు వహిస్తారో? ☐

*సాపేక్షికంగా కొంత అభివృద్ధి చెందిన దళిత క్రిస్టియన్‌లకు ఎస్.సి. హోదా కల్పించడం, ఎస్.సి. రిజర్వేషన్‌ల వర్గీకరణ చేయడం వల్ల దళితులు నష్టపోయే ప్రమాదం ఉందంటున్నారు* **ఆస శ్రీరాములు**

# రిజర్వేషన్‌లపై చిత్తశుద్ధి లేని ప్రభుత్వాలు

అధికారంలో ఉన్న అగ్రవర్ణ పార్టీలు దేశంలో ఉన్న బడుగు, బలహీన వర్గాల ప్రజల అభివృద్ధి కోసం సంక్షేమ అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి వారికి దగ్గర కావాలని ప్రయత్నించాయి. దీనికోసం గతంలో అంబేద్కర్ ఆలోచనా విధానంలోని కొన్ని కార్యక్రమాలను ఇందిరాగాంధీ అమలు చేసి బడుగు బలహీన వర్గాల వారి ఆదరణ పొందింది. నాడు ఆమె పొందిన అభిమానమే నేటికీ కాంగ్రెస్ పార్టీకి బలంగా నిలిచింది.

కాని నేటి రాజకీయాలు అందుకు విరుద్ధంగా ఉన్నాయి. సమాజంలో ఆదరణ కరువైన దళితులు, ఆదివాసులు, బడుగు, బలహీన వర్గాల వారికి ప్రభుత్వాలు చేతనైన సహాయం చెయ్యడం పోయి, వారి కోసం రాజ్యాంగంలో కల్పించిన హక్కులను అమలు చేయడంలో నిర్లక్ష్యం వహిస్తున్నాయి. దీంతో అర్హులైన వారికి రిజర్వేషన్ ఫలితాలు అందడం లేదు. రిజర్వేషన్‌లు ప్రస్తుతం రైల్లో జనరల్ కంపార్ట్‌మెంట్ లాగా తయారయ్యాయి. గత పది సంవత్సరాలుగా రాష్ట్రంలో ఎస్.సి.లను ఎ.బి.సి.డి.లుగా వర్గీకరించాలని ఒక వర్గం, ప్రస్తుతం ఉన్నది ఉన్నట్లు గానే ఉండాలని మరో వర్గం కొట్లాడుతున్నాయి. ఒక్క బహుజన సమాజ్ పార్టీ మినహా అన్ని అగ్రవర్ణ పార్టీలు వర్గీకరణ జరగాలని కోరుతున్నాయి.

మరోవైపు ఎ.బి.సి.డి.ల రావణకాష్టం చల్లారక ముందే దళిత క్రిష్టియన్‌లకు ఎస్.సి.ల హోదా కల్పించాలని మరో ప్రతిపాదన కొనసాగు తోంది. సమాజంలో అణగారినవారికోసం రాజ్యాంగం కల్పించిన సౌకర్యాలు, హక్కులు అంటే విద్యా, ఉద్యోగ, ఉపాధి రంగాల్లో ఏ మేరకు అమలు జరుగుతున్నాయని సమీక్షించేవారు నేటికీలేరు. కానీ సమాజంలో ఓట్లు వేసే బలమైన వర్గంగా రాజకీయ పార్టీలు గుర్తించాయి కనుక వారి ఓట్ల కోసం దళితుల మధ్య చిచ్చుపెట్టి, ఒక వర్గంపై మరో వర్గం దాడులు చేసుకునే పరిస్థితులు తీసుకు వస్తున్నాయి.

అధికారంలో ఉన్న అగ్రవర్ణ నాయకులు ఏ పార్టీ వారు అయినా సరే సమాజంలో బలమైన ఓటర్లుగా వారిని తమ వైపు ఆకర్షించాలంటే వారిలో వైషమ్యాలు లేవదీసి, దళితుల్లో ఐక్యతను చీల్చి తమవైపు కొందరిని పెట్టుకోవాలనే రాజకీయ స్వార్థబుద్ధితో దళితుల్లో అఖాతానికి తెరలేపింది. పది సంవత్సరాల క్రితం ముఖ్యమంత్రిగా ఉన్న చంద్రబాబు నాయుడు ఎ.బి.సి.డి.లుగా వర్గీకరించాలని దళితుల్లో చిచ్చుకు ఆజ్యం పోశారు. అది నేటికీ ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి పల్లె నుండి ఢిల్లీ వరకు లొల్లి తగ్గలేదు.

తర్వాత అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ పార్టీ దివంగత ముఖ్యమంత్రి డా. వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఎ బి సి డి ల బిల్లుకు చట్టబద్ధత కల్పించాలని రకరకాల ప్రయత్నాలు చేశారు. చివరకు ఆయన మరో భయంకరమైన ప్రతిపాదన తీసుకువచ్చారు. గత అసెంబ్లీ సమావేశాల్లో ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి దళిత క్రిస్టియన్‌లకు ఎస్.సి.లతో సమాన హోదా కల్పించాలని అసెంబ్లీలో ప్రతిపాదన తీసుకువచ్చారు.

ఇప్పటికే రాష్ట్రంలో దళితులు ఎ బి సి డి ల వల్ల రెండు వర్గాలుగా విడిపోయారు. రాజకీయ పార్టీలు దళితుల ఓట్ల కోసం రకరకాల కొత్త చీలికల ఆలోచనలతో రాజ్యాంగ స్ఫూర్తికి విఘాతం కలిగించడంతో పాటు, జాతీయ భావాలకు దెబ్బ తగిలే విధంగా వ్యవహరిస్తున్నాయి.

దేశంలో అగ్రవర్ణాల వారు దళితులను, ఆదివాసులను సమాజంలో సరిగ్గా చూడడం లేదనీ రాజ్యాంగ నిర్మాత బాబా సాహేబ్ అంబేద్కర్ స్వాతంత్ర్యం రాకముందే బ్రిటిష్ వారి పరిపాలనలో దేశంలోని దళితులు, ఆదివాసులు అనుభవిస్తున్న కులవివక్షత, అస్పృశ్యత గురించి నాటి సైమన్ కమిషన్‌కు వివరించారు. రౌండ్ టేబుల్ సమావేశంలో 1932లో చర్చించి, ఆమోదించి సాధించినదే నాటి 'కమ్యూనల్ అవార్డ్' రాయితీలు. కాలక్రమాన స్వాతంత్ర్యం అనంతరం రాజ్యాంగంలో అవే దళితులకు, ఆదివాసులకు హక్కులుగా వచ్చాయి.

నాటి నుండి నేటి వరకు రాజ్యాంగం కల్పించిన హక్కులను దళితులు అందుకోలేకపోతున్నారు. అందుకున్నవారు తోటివారికి సహకరించడం లేదు అనేది స్పష్టం. ఒక రాజకీయరంగం మినహాయిస్తే విద్య, ఉద్యోగ, ఉపాధి రంగాలలో అన్నీ బ్యాక్‌లాగ్‌ల కిందన ఉంటున్నాయి. ఏ ఒక్కటీ కోటా పూర్తి కావడం లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో రెండు అంశాలపై ప్రస్తుత ప్రధాన చర్చ. ఒకటి, దళితుల్లో ఎ.బి.సి.డి. వర్గీకరణ చెయ్యాలనే ప్రతిపాదన – అసలు దళితులను వర్గీకరణ చెయ్యాలని ప్రతిపాదించే రాజకీయ పార్టీలు వారికోసం ఏం చేశాయి? రాజ్యాంగంలో పేర్కొన్న అస్పృశ్యత నివారణకు చర్యలు ఏమైనా తీసుకున్నాయా? మూడు సంవత్సరాల క్రితం రంగారెడ్డి జిల్లాలో సిపిఎం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రాఘవులు పాదయాత్ర చేశారు. ఆయన వికారాబాద్, తాండూరులలో దళితులకు ప్రతి హోటల్‌లో రెండు గ్లాసుల పద్ధతి ఉందని, దళితులను గుళ్లల్లోకి రానివ్వడం లేదని తెలిసి కొంతమంది దళితులను గుడిలోకి తీసుకెళ్లారు.

అంటే నగర శివారులోనే ఇలాంటి పరిస్థితి ఉంటే, మిగిలినచోట్ల ఎలా ఉంటుందో విద్యావంతులు, మేధావులు ఆలోచించాలి. ఇవేకాక విద్యకు వస్తే, దళితులు, ఆదివాసులు, ఎస్.సి.లలో అసలు చదువు కుంటున్న వారి శాతం ఎంత, అందులో ఇంట్లో స్వయంగా చదువుతున్న వారి శాతం ఎంత, హాస్టల్‌లో చదువుతున్న వారి శాతం ఎంత, ఎవరైనా అధ్యయనం చేశారా? అందులో పదవ తరగతి చదివిన వారి శాతం ఎంత, తర్వాత, ఇంటర్, డిగ్రీ, పి.జి.లు చదివినవారు జిల్లాల వారీగా ఎంత మంది ఉన్నారు. వారి ఉపాధి అవకాశాలు ఏమిటి ఎవరైనా చూశారా? అన్ని అంశాలను పరిగణనలోకి తీసుకోకుండా దళితులను ఉప కులాల వారిగా చీల్చడం కోసం వర్గీకరణ తీసుకువచ్చి అగ్రవర్ణ రాజకీయ పార్టీలు వారి మధ్య చిచ్చుపెట్టాయి. దళితుల రాజ్యాధికారం కోసం బాబా సాహేబ్ అంబేద్కర్ ఆలోచనా విధానంతో ఏర్పాటు అయిన బహుజన సమాజ్ పార్టీ 'ఓటు హమారా, సీటు తుమారా నహీ చలేగా, నహీ చలేగా' అంటూ నినాదాలతో వచ్చి ఉత్తరప్రదేశ్‌లో అందరినీ రాజ్యాధికారం కలుపుకొని సాధించింది. బిఎస్‌పి అధినేత కాన్షిరాం ఎ.బి.సి.డి.లకు మద్దతునివ్వలేదు. తర్వాత మాయావతి కూడా మద్దతునివ్వలేదు. ఎ.బి.సి.డి.ల అంశం ఇంకా ఎటూ తేలలేదు.

ప్రస్తుత చర్చనీయాంశం దళిత క్రిస్టియన్‌లకు ఎస్.సి. లతో సమాన హోదా కల్పించడం ఎలా అనేది ప్రభుత్వం యోచిస్తోంది. ఎ.బి.సి.డి.లకు ఆజ్యం చంద్రబాబు పోస్తే, క్రిస్టియన్‌లకు సమానహోదా అనేది వై.ఎస్. రాజశేఖరరెడ్డి ప్రారంభించారు. ముఖ్యమంత్రి కె. రోశయ్య తాజాగా కేంద్ర ప్రభుత్వాన్ని క్రిస్టియన్‌లకు ఎస్.సి.లతో సమాన హోదా కల్పించాలని, ఎ.బి.సి.డి.లకు చట్టబద్ధత కల్పించాలనే కోరారు. ప్రస్తుతం ఇది మరింత లోతుగా అధ్యయనం చెయ్యవలసిన అవసరం ఉంది. వీటిపై రాష్ట్రవ్యాప్తంగా, దేశవ్యాప్తంగా చర్చ జరగాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే, దేశంలో ఉన్న కుల వ్యవస్థ, అంటరానితనం వల్ల చాలా మంది దళితులు, ఆదివాసులు, క్రిస్టియన్‌లు, చదువుకున్నవారు అంబేద్కర్ వారసులు, బౌద్ధమతం స్వీకరించారు. మరి కొందరు వారికి అనుకూలంగా ఉండే మతాలను స్వీకరించారు. హైదరాబాద్ నైజాం స్టేట్ పరిధిలో నాడు దళితులు చాలా మంది ముస్లిం మతం స్వీకరించారు. దళితుల్లో చాలా రకాలుగా చీలికలు తర్వాత కుల వృత్తులు చేసేవారు మిగిలిపోయారు.

అందులో చాలామంది క్రిస్టియన్‌లుగా, అధికారికంగా, అనధికారికంగా కొనసాగుతున్నారు. రాష్ట్రంలో క్రిస్టియన్‌లను బి.సి. (సి) గ్రూప్ కింద గుర్తించారు. అవే సర్టిఫికెట్ల ద్వారా కొనసాగుతున్నా ప్రస్తుతం నిజమైన దళితులు వెనుకంజలో ఉన్నారు. క్రిస్టియన్‌లే ముందుస్థానంలో ఉన్నారు అనేది జగమెరిగిన సత్యం. నేడు ఆంధ్రప్రదేశ్‌లో ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. ఇతర ఉన్నతస్థాయి ఉద్యోగాల్లో విధులు నిర్వహిస్తున్న, నిర్వహించిన వారిలో క్రిస్టియన్ బ్యాక్‌గ్రౌండ్ ఉన్నవారే అధికం.

నిజమైన దళితులకు ఇంకా అవకాశాలు బలంగా రాలేదని స్పష్టంగా చెప్పవచ్చు. విద్య, ఉద్యోగం, ఉపాధి మాట ఎలా ఉన్నా అసలు వారి జీవన విధానం దుర్భరంగా ఉంది. నగర ప్రాంతంలో జీవించే కొద్దిమందికి విద్యా అవకాశాలు మెరుగ్గా ఉన్నాయి. తెలంగాణ జిల్లాలతో పాటు విశాఖపట్నంలోని పాడేరు, చింతపల్లి, విజయనగరం, శ్రీకాకుళం; రాయలసీమలోని చిత్తూరు, అనంతపురం, కడప జిల్లాల్లో చదువులు అంతంత మాత్రమే. దళితులు అంటే క్రిస్టియన్ బ్యాక్‌గ్రౌండ్‌తో బాగుపడ్డది ఉభయ గోదావరి జిల్లాలతో పాటు కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలకు చెందినవారని చెప్పవచ్చు.

రాజకీయ పార్టీలకు రాజ్యాంగ లక్ష్యాలు ఏమి అవసరం లేదు. ఓట్ల కోసం ఏమైనా చేస్తాయి. ఒక రాజకీయ పార్టీ ఒకటి చేస్తే మరొకటి మరొకటి చేస్తాది. దళితుల, ఆదివాసుల అభివృద్ధి కన్నా వారి ఓట్లే పార్టీలకు కావాలి. ఎ.బి.సి.డి.లై, దళిత క్రిస్టియన్‌లకు ఎస్.సి.ల సమాన హోదా ఐనా సరే, దళితుల ఓట్లు రావాలి. కాని నాటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ 1983-84 ప్రాంతంలో చేపట్టిన ఎస్.సి., ఎస్.టి., ఆదివాసులకు ప్రత్యేక ఉద్యోగ నియామకాలు చెయ్యాలని ఎవ్వరు ఆలోచించడం లేదు. వారికి వెట్టి నుండి విముక్తి కలిగించాలనీ, అస్పృశ్యత నిర్మూలించాలనీ, నిరుపేదలైన వారికి భూములు పంచాలనీ, వారి సంక్షేమం, అభివృద్ధికి పాటు పడాలనీ ఏ రాజకీయ పార్టీకి నేటికీ ఆలోచన రావడం లేదు.

ఓట్ల కోసం, తాత్కాలిక ప్రయోజనాల కోసమే రాజకీయ పార్టీలు చూస్తున్నాయి. ఎలాంటి జీవన ఆధారం లేనివారు అన్ని రాజకీయ పార్టీల్లో చేరి అగ్రవర్ణ రాజకీయ పార్టీల జెండాలను మోస్తున్నారు. కాని దళితులు రాజ్యాంగ స్ఫూర్తిని మర్చిపోతున్నారు.

క్రిస్టియన్‌లకు ఎస్.సి.లతో సమాన హోదా కల్పిస్తే అసలు దేశంలో రిజర్వేషన్‌లు లేనట్లేనని చెప్పుకోవచ్చు. ప్రస్తుతం ఉన్న రిజర్వేషన్‌లు అందుకోవడంలోనే దళితులు వెనుకంజలో ఉన్నారు.

ఎ.బి.సి.డి.వర్గీకరణ చేపట్టాలన్నా, ఎస్.సి. హోదా కల్పించాలన్నా దళితులతో ప్రధానంగా చర్చ జరపాలి. రిజర్వేషన్ ఫలాలు సామాన్యులకు అందాలంటే ఎమి చేయ్యాలనే ప్రణాళిక రూపొందించాలి. లక్ష్యం కోసం దళితులు ఐక్యంగా ఏకతాటిపైన నిలవాల్సిన అవసరం ఉంది.

చేయాల్సిన పని నిజమైన ఎస్.సి., ఎస్.టి., ఆదివాసులను గుర్తించాలి; విద్యావంతులైన యువతకు వారి అర్హతను బట్టి ప్రభుత్వం ప్రత్యేక నియామకాల ద్వారా ఉద్యోగాలు కల్పించాలి; ఎస్.సి.ల్లో క్రిస్టియన్‌లుగా ఉంటూ అటు ఎస్.సి.లుగా, ఇటు క్రిస్టియన్‌లుగా లబ్ధిపొందరాదు; ఇప్పటికే నిజమైన ఎస్.సి., ఎస్.టి.లకు అన్యాయం జరుగుతోంది కనుక, హాస్టళ్లలో చదువుతున్న వారికి ప్రత్యేక శ్రద్ధతో బోధన ఏర్పాటు చెయ్యాలి; ప్రభుత్వం ఎస్.సి., ఎస్.టి., ఆదివాసులకు సంబంధించిన జనాభా లెక్కలు, విద్యావంతులు, ఉద్యోగస్తులు, ఉపాధి పొందినవారి లెక్కలు ఉండే విధంగా తక్షణం చర్యలు చేపట్టాలి. వీ

వీక్షణం పత్రికను ప్రతి నెల 29-30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి. చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.

***గ్రామీణ ప్రజానీకానికి మెరుగైన వైద్య సదుపాయాలు అందుబాటులో తేవడానికి ప్రత్యేక ఆరోగ్య శిక్షణను ప్రవేశపెట్టవలసిన అవసరాన్ని చెబుతున్నారు* వి. వరదరాజు**

# గ్రామీణ ఆరోగ్య కోర్సు అవసరం

ఆరోగ్యమే మహాభాగ్యం అన్నారు పెద్దలు. ఈ భాగ్య సూచి గమనిస్తే ఏకకాలంలో ఆనంద, విచారాలు కలుగక మానవు. 1951లో సగటు జీవితకాలం 32 సంవత్సరాలు. నేడు అది రెట్టింపు అయింది. ఇతర ఆరోగ్య వివరాల్లోకి వెళితే ఈ ఆనందం క్షణకాలం కూడా నిలువదు. ప్రజారోగ్య విషయంలో రాష్ట్రానికి, రాష్ట్రానికి మధ్య తేడాలున్నాయి. కేరళ అన్నిటికంటే ముందుంది. దేశ ఆర్థికాభివృద్ధి గణనీయంగా పెరిగింది. అయినా అధిక శాతం పిల్లలు పోషకాహార లోపంతో బాధపడుతున్నారు. ప్రపంచవ్యాప్తంగా 2008లో ఐదేళ్ల లోపు పిల్లలు 88 లక్షల మంది మరణించారు. విచారకరమైన విషయం ఏమంటే భారతదేశంలో రోజుకు ఐదు వేల మంది చిన్నారులు మరణిస్తున్నారు. ఆరు నెలల నుండి 35 నెలల లోపు పిల్లల్లో దాదాపు ఎనభై శాతం రక్తలేమితో బాధపడుతున్నారు. సంపూర్ణంగా ఇమ్యూనైజేషన్ నేటికీ జరుగలేదు. ఈ కార్యక్రమం 44 శాతం మించలేదు. రక్తలేమితో బాధపడుతున్న గర్భిణుల శాతం కూడా ఎక్కువే. ప్రసవ సంబంధమైన చిక్కులతో రోజుకు నాలుగు వందల మంది మహిళలు మరణిస్తున్నారు. మలేరియా, ఎచ్.ఐ.వి., ఎయిడ్స్‌లు అధిగమించాల్సి ఉంది. హృద్రోగాలు, రక్తపోటు, ప్రమాదాల మరణాలు, క్యాన్సర్, మానసిక రోగాలు కలవరపరుస్తున్నాయి.

నగరీకరణ, గ్లోబలైజేషన్ మరికొన్ని ఆరోగ్య సమస్యలను సృష్టిస్తున్నాయి. ఇవి కొత్త ఆరోగ్య సవాళ్లను విసరడమే కాకుండా అవి గ్రామాలకు కూడా తాకుతున్నాయి. ఒక సర్వే ప్రకారం ఉభయ గోదావరి జిల్లాల్లో సంభవిస్తున్న మరణాల్లో 32 శాతం గుండె జబ్బులని తెలిసింది. దేశంలో 120 మిలియన్ మంది రక్తపోటు పీడితులున్నారని అంచనా. దీనికి తోడుగా నలభై మిలియన్ల మంది మధుమేహులున్నారట. 2025 నాటికి రక్తపోటు పీడితులు 215 మిలియన్లకు, మధుమేహులు 70 మిలియన్లకు చేరుతారని ఆరోగ్య గణాంకాలు తెలియజేస్తున్నాయి. అలాగే వివిధ రకాల పొగాకు ఉత్పత్తులు సేవించిన వారి మరణాలు తక్కువ కాదు. ఏడాదికి మిలియన్ మందిని పొగాకు రక్కసి మింగేస్తోంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా ప్రకారం వచ్చే రెండు దశాబ్దాల్లో ఈ రకంగా మరణించే వారి సంఖ్య రెట్టింపు అవుతుంది. ప్రపంచంలో 101 కోట్ల మందికి పరిశుభ్రమైన తాగునీరు అందుబాటులో లేదు. 260 కోట్ల మందికి పారిశుధ్య వసతి లేదు. ఈ రెండు వసతులు లేని భారతీయులు ఈ సంఖ్యలో నాలుగో వంతు. ఇలా చెప్పుకుంటూ పోతే మన అనారోగ్య చిట్టాకు అంతే లేదు.

దేశం మహత్తర శక్తిగా ఎదగాలంటే విద్య, ఆరోగ్యం, గ్రామీణాభివృద్ధి, పర్యావరణాలపై ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ప్రజారోగ్యం మెరుగుపడడానికి అనేక ఆలోచనలు వినిపిస్తున్నాయి. ఎక్కువ మెడికల్ కాలేజీలు తెరచి ఎక్కువ మంది ఆధునిక వైద్యులను తయారు చేయాలని అంటున్నారు కొందరు నిపుణులు. ఈ సూచనతో ప్రభుత్వానికి ఏకీభావం ఉన్నట్టు కూడా అనిపిస్తుంది. టెలీ మెడిసిన్ ద్వారా ప్రజారోగ్యం కుదుటపరచవచ్చు అంటున్నారు ఇంకొందరు. గ్రామీణ ప్రాంతాల్లో నడుస్తున్న ప్రభుత్వ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల నిర్వహణ బాధ్యతను కార్పొరేట్లు తమ బాధ్యతగా చేపట్టాలని ఇటీవల తమిళనాడు రాష్ట్ర మంత్రి ఒకరు సెలవిచ్చారు.

ఆరోగ్య భారతావనిగా మార్చాలంటే ముందుగా వాస్తవిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకోవాలి. నేటికీ ఇమ్యూనైజేషన్, గ్రామీణ ఆరోగ్య సేవలు అందించడంలో ప్రభుత్వానిదే పై చేయి. ప్రైవేట్ వైద్యం నగరాలకు, పట్టణాలకు మాత్రమే పరిమితం. స్వచ్ఛంద సేవా సంస్థల వారికి ఎంతో కొంత నిబద్ధత ఉన్నప్పటికీ వారికి అన్ని రకాల లేములు ఉన్నాయి. ప్రస్తుతం గ్రామీణులకు వైద్యం అందకపోవడానికి ప్రధాన కారణం ఆధునిక వైద్యులు గ్రామాల్లో పనిచేయడానికి సుముఖంగా లేకపోవడమే అన్నది నిర్వివాదాంశం.

ఆధునిక డాక్టర్లు గ్రామాల్లో పనిచేయకపోవడం అనేది ఎప్పటి నుంచో ఉంది. ఈ సమస్య ఆధునిక వైద్య విద్య ప్రారంభ కాలం నుండి ఉంది. సమీప వైద్య విధాన చరిత్రలోకి వెళితే మరింత స్పష్టంగా అర్థం కాగలదు. అందుకు బోర్ కమిటీని ఆశ్రయించవలసిందే. బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం 1943లో దేశంలోని ఆరోగ్య స్థితిగతులను తెలుసుకోవడానికి సర్ జోసఫ్ బోర్ అధ్యక్షతన కమిటీ నియమించింది. దీనిలో ఎనిమిది మంది ఆంగ్లేయులు 16 మంది భారతీయులు సభ్యులు. ఈ కమిటీ తన నివేదికను 1946లో ప్రభుత్వానికి అందజేసింది. భారతదేశ ప్రజారోగ్య పరిస్థితులను అంచనా వేయడానికి ప్రయత్నించిన తొలి కమిషన్ ఇదే. కమిటీ రోగాలపై సర్వే చేసింది. వ్యాధుల వారీగా డేటా సమకూర్చింది. దేశ జనాభాకు తగినంత మంది సుశిక్షితులైన ఆధునిక వైద్యులు లేరని చెప్పింది. రోగాలు ప్రబలడానికి నాలుగు ముఖ్య సామాజిక ఆర్థిక కారణాలు గుర్తించింది. పేదరికం, అవిద్య, పోషకాహార లోపం, పారిశుధ్య లోపాలుగా పేర్కొంది. ఇవి నేటికీ మనల్ని వెంటాడుతున్నాయనేది కఠోర వాస్తవం. వీటిని పరిష్కరిస్తే తొంభై శాతం ఆరోగ్య సమస్యలు వాటంతట అవే సమసిపోతాయి.

ఆనాటికీ కొన్ని పాశ్చాత్య దేశాల్లోను, ఆధునిక వైద్యం విస్తరించిన చోట రెండు రకాల వైద్యులుండేవారు. ఐదున్నర సంవత్సరాలు మెడికల్ కాలేజీలో శిక్షణ పొందిన ఆధునిక డాక్టర్లు, మూడు లేదా నాలుగు ఏళ్లు మెడికల్ స్కూల్స్‌లో చదివిన ఎల్.ఎం.పి.లు వీరిని లైసెన్సేట్స్‌గా వ్యవహరించేవారు. ఈ కమిటీ నివేదిక ప్రకారం గ్రామాల్లో వైద్య సేవలు అందించేవారు లైసెన్సేట్స్. ఆధునిక డాక్టర్లు పట్టణాలకే పరిమితం. బోర్ కమిటీ ప్రతి జిల్లాలో ఆరోగ్య సేవల కోసం మూడంచెల విధానాన్ని సూచించింది. గ్రామీణ ప్రాంతాల్లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, సబ్ డివిజన్ స్థాయిలో ప్రత్యేక వైద్య సదుపాయాల కల్పన, జిల్లా కేంద్రం నుండి వీటి పర్యవేక్షణ.

నేడు కూడా ఇంచుమించు ఇదే విధమైన వైద్య సేవల బట్వాడాను కొద్దిపాటి మార్పులతో ప్రభుత్వం అందిస్తున్నది. కాకుంటే జిల్లా కేంద్ర ఆసుపత్రుల్లో మరికొన్ని ప్రత్యేక సేవలు అందుబాటులో ఉన్నాయి. ఎల్.ఎం.పి. కోర్స్‌ని రద్దు చేయమని ఈ కమిటీ ప్రభుత్వానికి సిఫారసు చేసింది. ఒకేరకమైన వైద్య విద్య ఉండాలని చెప్పింది. దీన్ని కమిటీలో ఆరుగురు సభ్యులు వ్యతిరేకించారు. అయినా ఫలితం లేకపోయింది. ఈ సిఫారసే మన పాలిట శాపంగా పరిణమించింది. గ్రామీణ ప్రాంతాల్లో వైద్యులు కరువయ్యారు. దేశీయ వైద్య విధానాలు గ్రామాలపై దృష్టి సారించలేదు. ఇన్నేళ్లు గడచినా ప్రజారోగ్యం పట్ల ఏలికల్లో కదలికలు లేకపోవడం విచారకరం.

భారత వైద్య డిగ్రీలు (ఎం.బి.బి.ఎస్., ఎం.డి., ఎం.ఎస్.లు) ఇంగ్లాండ్‌కి పనికి వచ్చేవే కాని లక్షలాది గ్రామాలు కల అభివృద్ధి చెందుతున్న భారతదేశానికి అక్కరకురావని వైద్య చరిత్రకారులు పేర్కొంటారు. ప్రాథమిక వైద్య సేవలు సమర్థవంతంగా నర్సులు, కాంపౌండర్లు అందించగలరు. అంతర్జాతీయ అనుభవాలు ఇదే విషయాన్ని ధృవపరుస్తున్నాయి. ఆఫ్రికాలోని మెడికల్ అసిస్టెంట్లు, కెనడాలోని నర్సులు, చైనాలోని గ్రామీణ డాక్టర్లు అందించే వైద్య సేవలు డాక్టర్లు అందించే సేవలకు ధీటుగానే ఉన్నాయి. ఒక్క చైనాలోనే లక్షమందికి పైగా గ్రామీణ డాక్టర్లు వైద్య సేవలు అందిస్తున్నారు. పలు అధ్యయనాలు వీరి సేవలు నాణ్యమైనవని నిర్ధారించాయి. తక్షణ అవసరాల కోసం ప్రైవేట్, ప్రభుత్వ ఆసుపత్రుల్లో పనిచేస్తున్న చురుకైన నర్సులను, కాంపౌండర్లను ఎంపిక చేసి, తక్కువకాలం శిక్షణ ఇచ్చి, పదోన్నతులిచ్చి, జీతభత్యాలు పెంచి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల బాధ్యులుగా నియమించాలి.

కొత్త గ్రామీణ ఆరోగ్య కోర్సు ప్రవేశపెట్టి గ్రామీణ డాక్టర్లను తయారు చేయాలి. గ్రామీణ ఆరోగ్య కోర్సుని సమగ్రంగా రూపొందించాలి. ఈ కోర్సు రూపకల్పనలో ఇతర వైద్య విధానాల్లోని నిపుణులతో చర్చించాలి. వాటిలో ప్రాథమిక ఆరోగ్య సేవలకు పనికొచ్చే విషయాలను తీసుకోవాలి. కోర్సులో భాగం చేయాలి. ఆసుపత్రి యాజమాన్యంపై శిక్షణ ఇవ్వాలి. అప్పుడే కోర్సుకు సమగ్రత చేకూరుతుంది. వివిధ వైద్య విధానాల మధ్య సమన్వయత పెరుగుతుంది. క్రమంగా వైద్య విద్య కొత్త పుంతలు తొక్కుతుంది. కొత్తగా రాష్ట్ర ప్రతిపత్తి పొందిన ఛత్తీస్‌గఢ్ ఈ దిశగా చర్యలు ప్రారంభించింది.

ఇక ఆలస్యం చేయకుండా మిగిలిన రాష్ట్రాలు వీలైనంత త్వరగా గ్రామీణ ఆరోగ్య కోర్సు ప్రారంభించాలి. ఈ దేశ పౌరులుగా డాక్టర్లు తమ వంతు బాధ్యతను స్వచ్ఛందంగా స్వీకరించి ఈ కోర్సు ఆచరణలోకి వచ్చే విధంగా సహకరించాలి. అప్పుడు మాత్రమే గ్రామీణులకు వైద్యం అందుబాటులోకి వస్తుంది. దేశ దిశ మారుతుంది. వీ

వివిధ దేశాలలో విధి నిర్వహణలో భాగంగా విలేకరులు ఎదుర్కొంటున్న అణచివేత, పత్రికా స్వేచ్ఛ స్థితిగతులపై
**రిపోర్టర్స్ విత్‌ఔట్ బార్డర్స్** 2009లో వెలువరించిన వార్షిక నివేదిక

# యుద్ధాలు - ఎన్నికలు - పత్రికా స్వేచ్ఛ

గత ఏడాది విలేకరులపై అమలయిన హింస తీవ్రతకు ప్రతీకలుగా రెండు భయానక సంఘటనలు చోటు చేసుకొన్నాయి. మొదటిది దక్షిణ ఫిలిప్పైన్స్ ప్రాంతంలో ఒక గవర్నర్‌కు చెందిన ప్రైవేట్ మూకలు ఒకే రోజు ముప్పై మంది జర్నలిస్టులను చంపేయడం, రెండవది, ఇరాన్ అధ్యక్షుడిగా మొహమ్మద్ అహ్మదీ నెజాద్ వివాదాస్పద పునర్ ఎంపిక తర్వాత జర్నలిస్టులు, బ్లాగర్‌ల పై జరిగిన దాడులు, అరెస్టులు ప్రముఖంగా పేర్కొనదగినవి. మృత్యువును, జైలు శిక్షలను, భయంకర నిర్బంధాన్ని తప్పించుకోవడానికి 160 మందికి పైగా జర్నలిస్టులు ప్రవాసంలోకి వెళ్లిపోయారు.

ఈ క్రమంలో ఇరాన్ ప్రెస్ ఫొటోగ్రాఫర్లు టర్కీ సరిహద్దులు దాటారు. సొమాలి రేడియో జర్నలిస్టులు పొరుగు దేశాలకు పారిపోయారు. వీరంతా అవసరమైన వార్తలను, సమాచారాన్ని ఇచ్చినందుకే ఈ స్థితిని ఎదుర్కొన్నారు. ఈ అణచివేతను కొనసాగించ డానికి ఏ దూరాలకయినా వెళ్లడానికి, వెంబడించడానికి కొంతమంది సిద్ధంగా ఉన్నారు.

గత ఏడాదిలో జరిగిన యుద్ధాలు, ఎన్నికలు జర్నలిస్టులకు ప్రమాదకరంగా పరిణమించాయి. యుద్ధ సమాచారం అందించే క్రమంలో జర్నలిస్టులు తామే స్వయంగా హత్యలకు గురికావడమో, కిడ్నాప్‌లకు గురికావడమో జరుగుతోంది. ఎన్నికల వార్తలను అందించడం అంటేనే ఆ విలేకరి చివరకు జైలుకో, ఆస్పత్రికో తరలే స్థితి ఉంటోంది. బలహీన ప్రజాస్వామ్యం ఉన్న దేశాలలో ఎన్నికలకు ముందు, తర్వాత హింస అనేది సాధారణమైపోయింది.

బ్లాగ్‌లు రాసేవాళ్లు, వెబ్ సైట్‌లు నడిపే వాళ్ల సంఖ్య పెరిగే కొద్దీ సమాచారాన్ని నియంత్రించడం, అణచివేయడం కూడా పెరిగిపోతోంది. దీనికి ఏ దేశం మినహాయింపు కాదు. ఇంటర్నెట్ లేక ఏదయినా కొత్త సమాచార వ్యవస్థ మొదలై సమాచార, వార్తా వితరణలో కీలకమైన భూమికను వహిస్తుంటే వాటిమీద ఆంక్షలు వెనువెంటనే మొదలయిపోతున్నాయి. సాంప్రదాయ సమాచార మాధ్యమంలో జర్నలిస్టులను పర్యవేక్షించినట్లే, ఇప్పుడు బ్లాగ్‌లు రాసేవారినీ చూస్తున్నారు.

తీవ్ర అణచివేతను అమలుచేస్తున్న ఇరాన్, శ్రీలంక దేశాల నుంచి జర్నలిస్టులు విదేశాలకు పారిపోవలసి రావడం 2009లో సంభవించిన పరిణామాలలో గుర్తించాల్సినది. అక్కడి ఆధిపత్య శక్తులు నిర్బంధాన్ని ప్రయోగించి, తమపై వస్తున్న తీవ్ర విమర్శలను, ఆలోచనలలో బహుళత్వాన్ని తగ్గించడమో, లేక పూర్తిగా లేకుండా చేయడమో ప్రధాన ఉద్దేశంగా పెట్టుకున్నాయి. 2009లో మీడియా ఎదుర్కొన్న పరిణామాలలో విశ్లేషిస్తూ, 'ఇది చాలా ప్రమాదకరమైన పరిణామం, దీన్ని అందరూ గట్టిగా ఖండించాల'ని 'రిపోర్టర్స్ విత్‌ఔట్ బార్డర్స్' ప్రధాన కార్యదర్శి జీన్ ఫ్రాంకో ఇన్ జుల్లియార్డ్ కోరారు.

గత ఏడాది చనిపోయిన జర్నలిస్టులలో ఎక్కువమంది తమ సొంత నేలపై చనిపోయారు. దీనికి ఎల్‌సాల్వడార్‌లో చనిపోయిన ఫ్రాంకో-స్పానిష్ డాక్యుమెంటరీ చిత్ర నిర్మాత క్రిస్టియన్ పొవెడా మినహాయింపు. అంతర్జాతీయ మీడియాతో పోలిస్తే వివిధ దేశాలలోని మీడియాకు ఈ విషయాలు తక్కువగా తెలుస్తాయి. స్థానిక విలేకరులు తమ ప్రాణాలను మూల్యంగా చెల్లించి జరిపిన కృషి వల్లే యుద్ధాలు, అవినీతి, పర్యావరణ విధ్వంసాలకు సంబంధించిన సమాచారం పొందే మన హక్కులు కాపాడబడుతున్నాయని జుల్లియార్డ్ పేర్కొన్నారు.

ఇజ్రాయిల్ మిలిటరీ గాజా ప్రాంతంపై చేసిన దాడులతో 2009 సంవత్సరం ప్రారంభమైంది. అంతర్జాతీయ మానవ హక్కుల చట్టాలను ఉల్లంఘిస్తూ పత్రికా కార్యాలయాలపై దాడులు చేయడమే కాకుండా, విదేశీ మీడియాను ఆ ప్రాంతానికి అనుమతించకుండా ఇజ్రాయిల్

| అంశం | 2008 | 2009 |
|---|---|---|
| హత్యకు గురైన విలేకరులు | 60 | 76 |
| అరెస్ట్ అయిన విలేకరులు | 673 | 573 |
| భౌతిక దాడులు, బెదిరింపులకు గురైన విలేకరులు | 929 | 1456 |
| వార్తా సంస్థల సెన్సార్ ఘటనలు | 353 | 570 |
| అపహరణకు గురైన విలేకరులు | 29 | 33 |
| హత్యకు గురైన బ్లాగర్‌లు | 1 | 1 |
| అరెస్ట్‌కు గురైన బ్లాగర్‌లు, ఇంటర్నెట్ ఉపయోగించేవారు | 59 | 151 |
| భౌతిక దాడులకు గురైన బ్లాగర్‌లు | 45 | 61 |
| ఆన్‌లైన్ సెన్సార్‌కు గురైన దేశాలు | 37 | 60 |

*వ్యక్తిగత భద్రత దృష్ట్యా చెప్పడానికి అనాశక్తత వ్యక్తం చేసిన సంఘటనలను మినహాయించి, విలేకరుల ప్రత్యక్ష సంబంధం ఉన్న ఘటనల ఆధారంగా ఈ సమాచారాన్ని రిపోర్టర్స్ విత్‌ఔట్ బార్డర్స్ పొందుపరిచింది.*

ప్రభుత్వం తీవ్రమైన ఉల్లంఘనలకు పాల్పడింది. ఆ దాడుల్లో ఇద్దరు విలేకరులు చనిపోయారు.

తీవ్రవాద ఇస్లామిక్ గ్రూపులు ప్రపంచవ్యాప్తంగా పదిహేను మంది విలేకరుల మరణాలకు కారణమయ్యాయి. సోమాలియాలో ఆల్-షబాబ్ మిలీషియా వారి లక్ష్యాలను ఉద్దేశించి జరిపిన ఆత్మాహుతి దాడిలో తొమ్మిది మంది విలేకరులు చనిపోయారు. వీరిలో నలుగురు షాబెల్లి రేడియోలో పనిచేసేవారు. గందరగోళం ఆవరించి ఉన్న స్థితిలో అపోహలను తొలగించి, వాస్తవాలను అందించడంలో ఈ రేడియో చాలా కృషి చేసింది. పాకిస్తాన్ వాయువ్య ప్రాంతంలో తాలిబాన్లు విలేకరులను తమ లక్ష్యంగా చేసుకున్నారు.

విలేకరుల కిడ్నాప్‌లు కూడా పెరిగిపోయాయి. ఇవి ఎక్కువగా అఫ్ఘనిస్తాన్, మెక్సికో, సోమాలియాలలో చోటు చేసుకున్నాయి. న్యూయార్క్ టైమ్స్ విలేకరి డేవిడ్ రోడ్, అతనితో పాటు ఉన్న సహాయకుడు తాలిబాన్‌ల నుంచి తప్పించుకోగలిగారు కాని, వారిని రక్షించడానికి మిలిటరీ చేపట్టిన ఆపరేషన్‌లో సుల్తాన్ మునాది అనే అఫ్ఘన్ విలేకరి చనిపోయారు.

యుద్ధ ప్రాంతాలలో విలేకరుల పరిరక్షణకు ఉద్దేశించిన 1738 తీర్మానాన్ని ఐక్యరాజ్య సమితి భద్రతా మండలి ఆమోదించి మూడేళ్లు గడచిపోయినప్పటికీ, విలేకరులను రక్షించడంలో ప్రభుత్వాలు విఫలమవుతున్నాయని 'రిపోర్టర్స్ విదౌట్ బార్డర్స్' అభిప్రాయపడింది.

బెదిరింపులు, భౌతిక దాడులు 2008తో పోలిస్తే 2009లో మూడవ వంతు (2008లో 929 కాగా, 2009లో 1456) పెరిగి పోయాయి. విలేకరులపై భౌతిక దాడుల విషయంలో ఉత్తర, దక్షిణ అమెరికాలు 501 సంఘటనలతో మొదటిస్థానంలో ఉన్నాయి. మాదక ద్రవ్యాల అక్రమ రవాణా, స్థానిక పాలకుల అవినీతికి సంబంధించి వాస్తవాలు బయటపెట్టినప్పుడు అక్కడ విలేకరులు భౌతిక దాడులకు గురవుతున్నారు. విలేకరులపై ఇటువంటి 364 సంఘటనలతో ఆసియా రెండవ స్థానంలో ఉంది. ముఖ్యంగా పాకిస్తాన్, శ్రీలంక, నేపాల్‌లలో ఇటువంటి సంఘటనలు ఎక్కువగా చోటుచేసుకొంటున్నాయి. మీడియాపై ఆంక్షలకు సంబంధించి 570 కేసులు నమోదయ్యాయి. రేడియోలను, టివి స్టేషన్‌లను వార్తలు చెప్పకుండా నిరోధించారు. లేక, మూసివేయించారు. మలేషియాలో, వ్యంగ్య, హాస్యస్ఫోరక కథనాలను ప్రచురించే పత్రికను, ఇరాన్‌లో సంస్కరణవాద పత్రికలను, కాంగోలో రేడియో ఫ్రాన్స్ ఇంటర్నేషనల్‌ను, రువాండాలో బిబిసి వరల్డ్ సర్వీస్‌ను నిషేధించారు.

ఫిలిప్పైన్స్‌లో ముప్పై మంది విలేకరులు ఎన్నికల సంబంధిత హింసలో చనిపోయారు. గాబోన్ అధ్యక్ష పునర్ ఎన్నికలలో చాలామంది జర్నలిస్టులు భౌతిక దాడులకు, బెదిరింపులకు గురయ్యారు. కొత్త ప్రభుత్వాన్ని, ఎంపికయిన ప్రతినిధులను విమర్శించిన కారణంగా ఎన్నికల తర్వాత చోటుచేసుకున్న హింసను చూపిన కారణంగా ఆరు వార్తా సంస్థలు మూతపడ్డాయి.

ఇరాన్ అధ్యక్షుడిగా అహ్మదీ నెజాద్ వివాదాస్పద పునర్ ఎంపిక, తదనంతర పరిణామాలలో వార్తా సంస్థలపై భయంకరమైన నిర్బంధాన్ని ప్రయోగించారు. ప్రజాస్వామ్యానికి గీటురాళ్లుగా బహుళపార్టీ విధానం, విలేకరులకు భావప్రకటనా స్వేచ్ఛ ఉండాలి. ప్రభుత్వ వార్తా సంస్థ కూడా ఎన్నికలలో పాల్గొన్న వారందరి పట్ల సమదృష్టితో వ్యవహరించి వార్తలు చూపడంపైన కూడా అక్కడి ప్రభుత్వం ఆంక్షలు విధించింది. అఫ్ఘన్, గినియా ఎన్నికలలో కూడా ఇలాంటి పరిణామాలే చోటు చేసుకొన్నాయి. నిజాలు చెప్పే విలేకరులు దాడులకు గురవుతూనే ఉన్నారు. శ్రీలంకలో తమిళ ప్రాంతాల్లో ఎన్నికల వార్తలను సేకరించడానికి విలేకరులను అనుమతించలేదు.

ఇరాన్ అధ్యక్ష ఫలితాలు వెలువడ్డాక నెజాద్ మద్దతుదారులు ప్రతిపక్షాలను, విలేకరులను, బ్లాగ్‌లు రాసేవారిని విదేశాలకు ఏజంట్‌లని పేర్కొంటూ వారిపై దాడులు చేశారు. విదేశాల నుంచి డబ్బులు తీసుకొని దేశంలో అస్థిరత సృష్టిస్తున్నారని ప్రచారం చేశారు.

గత ఏడాది విలేకరులు చూపిన సాహసాలకు వారు దాడులను, అవమానాలను, జైల్ శిక్షలను, కొన్నిసార్లు మృత్యువును ఎదుర్కోవాల్సి వచ్చింది. ఎన్నికల ఫలితాలలో చోటుచేసుకుంటున్న రిగ్గింగ్, అవినీతితో సహా అన్నీ ఉన్నవి ఉన్నట్లుగా చెప్పడానికి వీలుగా వార్తా సంస్థలకు తగిన రక్షణ కలిగించే విధానాలని, పద్ధతులని రూపొందించాలి.

ఎప్పటిలానే ఎన్నికల ప్రచార సమయంలో మీడియా తరఫున పర్యవేక్షణ రిపోర్టర్స్ విదౌట్ బార్డర్స్ 2010 లోను నిర్వహించనున్నదని, అయితే విలేకరులపై హింస భవిష్యత్తులో కూడా సంభవించవచ్చుననే కీడు గత ఏడాది అనుభవాలు సూచిస్తున్నాయని రిపోర్టర్స్ విదౌట్ బార్డర్స్ ప్రతినిధి పేర్కొన్నారు. చాలా కీలకంగా భావించే శ్రీలంక, బర్మా, ఇరాక్ ఎన్నికలు 2010లోనే జరుగనున్నాయి.

చరిత్రలో మొదటిసారి పది దేశాలలో వంద మందికిపైగా బ్లాగ్‌లు రాసేవారిని జైళ్లలో నిర్బంధించారు. ఆన్‌లైన్‌లో తమ అభిప్రాయాలు ప్రకటించడాన్ని ఆ దేశాలు నేరపూరిత చర్యగా పేర్కొన్నాయి.

ఇరాన్, చైనాలలో ప్రజాస్వామ్య అనుకూల కాంపేయిన్ చేయడంలో ఇంటర్నెట్ కీలక భూమిక వహిస్తోంది. అందుకే ఇంటర్నెట్

**2009లో ఖండాల వారీగా విలేకరులపై అమలైన హింస**

| ప్రాంతం | హత్యలు | అరెస్ట్‌లు | బెదిరింపులు/దాడులు | వార్తల సెన్సార్ | అపహరణలు |
|---|---|---|---|---|---|
| ఆఫ్రికా | 12 | 115 | 170 | 80 | 7 |
| ఆసియా-పసిఫిక్ | 44 | 110 | 364 | 104 | 16 |
| అమెరికా | 6 | 80 | 501 | 27 | 7 |
| యూరప్ / పూర్వ రష్యా | 7 | 101 | 223 | 162 | 1 |
| మధ్య ప్రాచ్యం | 7 | 167 | 198 | 197 | 2 |
| **మొత్తం** | **76** | **573** | **1456** | **570** | **33** |

ఉపయోగించే వారిపై అక్కడి ప్రభుత్వాలు తీవ్రంగా విరుచుకు పడుతున్నాయి. రాజకీయాలలో ఉన్నతపదవులలో ఉన్నవారిపై వ్యంగ్య చిత్రాన్ని నిర్మించినందుకు అజర్ బైజాన్ దేశపు ఇద్దరు బ్లాగ్‌లు రాసేవారిపై అక్కడి ప్రభుత్వం రెండేళ్ల జైలుశిక్ష విధించింది.

ఇంటర్నెట్‌పై ఆంక్షలు విధించడంలో చైనా అగ్రస్థానంలో ఉండగా, ఇరాన్, ట్యూనీషియా, థాయ్‌లాండ్, సౌదీ అరేబియా, వియత్నాం, ఉజ్బెకిస్తాన్‌లు అదే దారిన నడుస్తున్నాయి. ఆన్‌లైన్‌లో వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలపై నిఘా, నిషేధాలు అమలు చేస్తూ భావప్రకటనా స్వేచ్ఛను అడ్డుకుంటున్నాయి. 2009లో బ్లాగ్‌లు రాసే సామాన్య పౌరులు, సంభాషణాత్మక వెబ్‌సైట్‌లు నడిపేవారు తమ అభిప్రాయాలు వ్యక్తం చేసినందుకు భౌతిక దాడులకు, బెదిరింపులకు, జైలుశిక్షలకు గురయ్యారు. ఈజిప్ట్ దేశపు బ్లాగ్ రచయిత కరీం అమీర్ ఇంకా జైలులోనే ఉన్నారు. బర్మాకు చెందిన ప్రముఖ హాస్య నటుడు జార్గనార్ 34 ఏళ్ల జైలుశిక్షను ఇంకా అనుభవించాల్సే ఉంది. ఈ రకంగా ఇంటర్నెట్ పోలీసింగ్ బాధితులు 120 మంది దాకా ఉన్నారు.

దక్షిణ కొరియా ఆర్థిక సంక్షోభం గురించి వ్యాఖ్యానిస్తూ బ్లాగ్‌లో రాసిన రచన సెన్సార్‌కు గురయ్యింది. థాయ్‌లాండ్‌లో రాజు ఆరోగ్యానికి, బ్యాంకాక్ స్టాక్ ఎక్స్ఛేంజ్ పతనానికి ఉన్న సంబంధాన్ని వ్యాఖ్యానిస్తూ రాసినందుకు నెట్ ఉపయోగించే ఆరుగురిని అరెస్ట్ చేసి మానసికంగా హింసించింది అక్కడి ప్రభుత్వం. దుబాయ్ ఆర్థిక స్థితి గురించి, అప్పుల చెల్లింపులలో ఉన్న సమస్యల గురించి రాసినందుకు అక్కడి బ్లాగుల్లో రాసేవారు సెన్సార్ బారిన పడ్డారు.

పిల్లల అశ్లీల చిత్రాల నియంత్రణ పేరిట, ఇంకా మరిన్ని కొత్త పద్ధతుల్లో యూరప్‌లోని అనేక 'ప్రజాస్వామ్య' దేశాలు ఇంటర్నెట్‌ను నియంత్రించాలని చూస్తున్నాయి. భావప్రకటనా స్వేచ్ఛకు ప్రమాదం పరిణమిస్తోందనే నెపంతో ఆస్ట్రేలియా కూడ సమాచారాన్ని వడబోసే యంత్రాంగం అవసరమని భావిస్తోంది. టర్కీ రిపబ్లిక్ వ్యవస్థాపకుడు ముస్తఫా కెమాల్ అటాటుర్క్‌ను విమర్శించినందుకు అక్కడి ప్రభుత్వం వెబ్‌సైట్‌లను, యూట్యూబ్‌ను నిరోధించింది.

ఇంటర్నెట్ సెన్సార్‌షిప్‌కు గురవుతున్న దేశాల సంఖ్య 2008తో పోలిస్తే 2009లో రెట్టింపయిందనీ, నెటిజన్ల సంఖ్య లక్షల్లోకి పెరుగుతున్న కొద్దీ ఆంక్షలు కూడా పెరిగిపోతున్నాయనీ ఇంటర్నెట్ అండ్ ఫ్రీడమ్స్ డెస్క్ అధిపతి లూసీ మొరిల్లాన్ పేర్కొన్నారు. ఈ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని రిపోర్టర్స్ విత్‌ఔట్ బార్డర్స్ 12 మార్చ్, 2010న ఇంటర్నెట్ శత్రువులకు వ్యతిరేకంగా కాంపేయిన్ చేపట్టనున్నట్టు ఆయన తెలిపారు.

ప్రపంచవ్యాప్తంగా 2009 ఆఖరకు 167 మంది విలేకరులు జైళ్లలో మగ్గుతున్నట్టు తెలుస్తోంది. చాలా ప్రభుత్వాలు స్వయంగా చట్టాల ఉల్లంఘనలకు పాల్పడుతూ, మీడియా అతిక్రమణలకు జైలు నిర్బంధం ప్రయోగించడం చాలా వివక్షతో కూడుకున్నదని ఐక్యరాజ్య సమితి ప్రత్యేక ప్రతినిధి పేర్కొన్నారు. హింసాయుత నేరాలు, తీవ్రవాదులు చేసే నేరాలకు విధించే కఠినమైన శిక్షలను క్యూబా, చైనా, శ్రీలంక, ఇరాన్‌లలో విలేకరులపై అమలుచేస్తున్నారని ఆయన అన్నారు.

అధికారులు విలేకరుల పట్ల క్రూరమైన పద్ధతులతోనే వ్యవహరిస్తున్నారు. మధ్య ప్రాచ్యంలో రోజుకు కనీసం ఒక విలేకరి దాడికి గురికావడమో, అరెస్ట్ కావడమో జరుగుతోంది. 2009లో ఇరాక్‌లో 60 మందికి పైగా విలేకరులు అరెస్ట్‌లకూ, దాడులకూ గురయ్యారు. పాలస్తీనాలోని గాజా ప్రాంతంలో 50 మందికి పైగా విలేకరులను అక్కడి మిలిటరీ నిర్బంధించగా, వెస్ట్‌బ్యాంక్‌లో వారిపై ఫత్వా జారీచేశారు.

ఆఫ్రికా, ఆసియాలలో పరిస్థితి ఏమీ భిన్నంగా లేదు. సాపేక్షికంగా ఆసియాలో అరెస్ట్‌లు తక్కువగానే ఉన్నప్పటికీ, చైనా, పాకిస్తాన్‌లలో విదేశీ, స్వదేశీ విలేకరులు 'హద్దులు' మీరినప్పుడు అరెస్ట్‌లు తప్పడం లేదు. క్యూబాలో 2009లో 25 మంది విలేకరులు అరెస్ట్ అయ్యారు. అభివృద్ధి చెందిన దేశాలు విలేకరులను అరెస్ట్ చెయ్యకున్నా, వారిని పదే పదే కోర్టులకు ఈడ్చి హింసిస్తున్నాయి.

మొట్టమొదటిసారి రిపోర్టర్స్ విత్‌ఔట్ బార్డర్స్ తన 2009 వార్షిక సమీక్షలో దేశం విడిచిపోవాల్సి వచ్చిన విలేకరులను లెక్కించింది. తమ ప్రాణాల కోసం, స్వేచ్ఛ కోసం తప్పని పరిస్థితులలో మొత్తం 157 మంది విలేకరులు తమ దేశాలు విడిచి ప్రవాసంలోకి వెళ్లిపోయారు. ఇరాన్ నుంచి 50, శ్రీలంక నుంచి 29, ఆఫ్రికా నుంచి 50 మంది విలేకరులు వలస వెళ్లిపోయారు. ఇంకా గినియా, అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, మెక్సికో, కొలంబియా, ఇథియోపియాల నుంచి కూడా వలసపోయారు.

ఇదంతా వార్తా సంస్థలపై కొన్ని దేశాలలో అమలువుతున్న భయోత్పాత తీవ్రతకు నిదర్శనం. ప్రవాసంలోనూ విలేకరులు అనిశ్చిత భవిష్యత్తును, ప్రమాదకర పరిస్థితులను ఎదుర్కొంటున్నారు. సరైన రక్షణ, పునరావాసం పొందడానికి కొన్ని సార్లు వారు నెలలు, సంవత్సరాలు కూడ ఎదురుచూడాల్సి వస్తోంది.

(స్వేచ్ఛానువాదం : **డి.వి. రామకృష్ణారావు**) ❖

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - మార్చ్ 2010 : చిన్న రాష్ట్రాలు - అభివృద్ధి**
- **ఫోకస్ - ఏప్రిల్ 2010 : కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు**
- **పర్యావరణానికి ముప్పు - మంగళూరు సెజ్ - నక్కా హేమా వెంకట్రావ్**
- **ఆపరేషన్ కరప్షన్ హంట్ - వెంగల వీరస్వామి**
- **ఆర్థిక వ్యవస్థలో సంక్షోభం - గుమ్మడి నరేష్**

*అమెరికా ఆధిపత్యంతో నిత్యం సంఘర్షిస్తున్న హైతీ ప్రజలు ఇటీవల భూకంపంతో పెనువిషాదంలో కూరుకుపోయారనీ, ఈ విషాదం వెనుక అమెరికా ప్రమేయంపై అనుమానాలు వ్యక్తమవుతున్నాయనీ అంటున్నారు* **ఇ.ఎస్. బ్రహ్మచారి**

# హైతీ భూకంపం - అమెరికా సామ్రాజ్యవాదం

హైతీలో జనవరి 12 న భారీ భూకంపం సంభవించింది. ఈ భూకంప కేంద్రం రాజధాని పోర్ట్- అవ్-ప్రిన్స్ కి కేవలం 16 కిలోమీటర్ల దూరంలో ఉంది. రెక్టర్ స్కేల్ మీద 7.3 తీవ్రతతో నగరాన్ని కుదిపేసింది. 4 లక్షల టన్నుల టిఎన్‌టి పేలితే ఎంతశక్తి విడుదలవుతుందో, అంత శక్తిగలదీ భూకంపం. ఇంత స్థాయిలో 230 ఏళ్లలో ఎన్నడూ రాలేదు. తీవ్ర ప్రకంపనలున్న ప్రాంతంలో 18 లక్షలమంది నివాసమున్నారు. వాళ్లలో ఎక్కువ మందికి కాంక్రీట్ ఇళ్లు ఉండవు. సరిగా కట్టని ఇళ్లలో ఉంటారు. చర్చిలు, స్కూళ్లు, ఆసుపత్రి భవనాలు ఇళ్లు లెక్కకి మించి కుప్పకూలాయి. అధ్యక్ష భవనం రెండో అంతస్తు మొదటి అంతస్తు మీద పడింది. అయితే అధ్యక్షుడు క్షేమంగానే ఉన్నాడు. ప్రపంచ బ్యాంక్ ఆఫీస్ భవనాలు కూలాయి. ఐక్యరాజ్య సమితి శాంతి సేన ఉన్న అయిదంతస్తుల హోటల్ క్రిస్టాఫ్ కుప్ప కూలిపోయింది. పార్లమెంట్ భవనం పడింది. నగరంలో నాలుగింట మూడొంతుల కట్టడాలు నేలమట్టమయ్యాయని ఒక అంచనా. రోడ్లు శిధిలాలతో నిండి ఉన్నాయి. స్కూల్ భవనాల కింద ఎందరో పిల్లల శవాలున్నాయి. విద్యుత్ లేదు. ఫోన్ సిగ్నల్స్ లేవు. అంతా అయోమయం, అంధకారం, గందరగోళం. గాయాలతోనూ, నుజ్జయిన అవయవాలతోనూ వైద్యం కోసం పది రోజులకి పైగా పడిగాపులు కాస్తున్నవాళ్లెందరో ఉన్నారు. డాక్టర్లు డేరాల్లోనూ బయటా వైద్యం చేస్తున్నారు. బాధితులు వాళ్లని చుట్టు ముడుతున్నందువల్ల ఉక్కిరిబిక్కిరైపోతున్నారు. ముందుముందు పారిశుధ్య లోపం వల్ల అంటువ్యాధులు ప్రబలినాక మరీ ఇబ్బందవుతుంది. అంతా అయ్యేసరికి 2 లక్షల మంది కాలో చెయ్యో లేకుండా మిగులుతారని డాక్టర్ల అంచనా. ఒక్క క్రిమియా యుద్ధంలో తప్ప ఇన్ని ఆంపుటేషన్లు ఎప్పుడూ జరగలేదని ఒక సహాయసంస్థ చెప్పింది. 20 లక్షలమంది నిరాశ్రయులయ్యారు. జనవరి 24కి లక్షా యాభైవేల మందిని పూడ్చినట్లు ప్రభుత్వం ప్రకటించింది. సుమారు మూడు లక్షల మంది చనిపోయి ఉండవచ్చు. 10 వేలమంది మృతులు పట్టే పెద్ద గోతులు తీస్తున్నారు.

ఫ్లోరిడాకి 700 మైళ్ల దూరంలో హైతీ ఉంటుంది. విస్తీర్ణం 27,750 చదరపు కిలోమీటర్లు. జనాభా 2009 జూలై ఐక్యరాజ్య సమితి అంచనా ప్రకారం కోటికి కొంచెం ఎక్కువ (1,00,33,000). రాజధాని పోర్ట్- అవ్-ప్రిన్స్ జనాభా 30 లక్షలు.

పశ్చిమార్ధగోళంలో అన్ని దేశాల్లోకి హైతీ యే అతి పేదది. 2008 లో స్థూల జాతీయోత్పత్తి 700 కోట్ల డాలర్లు. తలసరి ఆదాయం సంవత్సరానికి 790 డాలర్లు. అంటే రోజుకి మనిషికి 2 డాలర్లు. నూటికి 80 మంది పేదరికంలో మగ్గుతున్నారు. సగం మందికి పైగా రోజుకి ఒక్క డాలర్ కన్నా తక్కువతో రోజు గడపాలి. 54 శాతం మంది కటిక దరిద్రంలో కాలం వెళ్లబుచ్చుతున్నారు. నిరుద్యోగం రేటు 70 శాతం పైమాటే. మామిడి పళ్లు, కాఫీ ముఖ్య ఎగుమతులు. ఆ దేశ బడ్జెట్‌లో 30-40 శాతం విదేశీ సహాయమే. నూటికి 66 మంది పొలం పనులు చేసి పొట్ట పోసుకుంటారు. సగం మందికి తాగేందుకు శుభ్రమైన నీళ్లు దొరకవు. సగం మంది ఇతర దేశాల నుంచి కుటుంబ సభ్యులు పంపించే డబ్బుతో బతుకుతున్నారు. 2008 చివరలో 4 ఉప్పెనలు వచ్చాయి. పట్టణాలకి పట్టణాల్నే ముంచెత్తాయి. బ్రిడ్జీలని పడదోశాయి. అసలే దీనులైన జనాన్ని నిరాశా నిస్పృహలకి గురిచేశాయి. పంటలతోపాటు పంటకాలువల్ని ధ్వంసం చేశాయి. జనం ఆకలితో అలమటించేలా చేశాయి. ఆ విపత్తు నుంచే ఇంకా తేరుకోలేదు. ఇంతలో ఇంతటి ఉపద్రవం వచ్చిపడింది. దీన్ని తట్టుకునే శక్తి ఆ నిరుపేద దేశానికి లేదని వేరే చెప్పక్కరలేదు. పునరావాస కల్పనకి విదేశీ సహాయమే దిక్కు.

ఒబామా సహాయం చెయ్యడంలో వెనకా ముందూ చూడ నన్నాడు. అమెరికా మీతో ఉంటుంది. ప్రపంచమంతా మీపక్క నుంటుంది- అని భరోసా ఇచ్చాడు. అమెరికా సాయం 10 కోట్ల డాలర్లన్నాడు. వరల్డ్ ఫుడ్ ప్రొగ్రాం 100 టన్నుల ఆహారమూ, బిస్కెట్లూ ఇస్తున్నది. ఐక్యరాజ్య సమితి 1 కోటి డాలర్లు విడుదల చేస్తోంది. యురపియన్ యూనియన్ 44 లక్షల డాలర్లిచ్చేందుకు సిద్ధమయింది. జర్మనీ 10 లక్షల యూరోలు తక్షణ సహాయంగా పంపించింది. ఎన్నో దేశాలు ఆహారాన్నీ సహాయక బృందాల్ని పంపిస్తున్నాయి. డేరాలనీ, నీటిని శుభ్రపరిచే యూనిట్లనీ, డాక్టర్లనీ పంపుతున్నాయి.

ప్రపంచంలోనే స్వాతంత్ర్యం సాధించుకున్న మొట్టమొదటి నల్లజాతి దేశం హైతీ. అప్పుడు ఫ్రెంచ్ సైన్యం ప్రపంచంలోకెల్ల అత్యంత శక్తివంతమైంది. దాన్ని ఓడించి ఎల్లలు దాటించిన దేశం అది. వెనిజులా, కొలంబియా, ఈక్వెడార్ దేశాలు స్వాతంత్ర్యం పొందేందుకు ఎంతో సహకరించింది హైతీ. హైతీ విప్లవ కాలంలో అది ఫ్రెంచ్ వలసల్లో అత్యంత సంపన్నమైంది. ఒకప్పుడు ఫ్రెంచ్ సామ్రాజ్యానికి భూషణం అనిపించుకున్న హైతీ ఇప్పుడు పేదరికంలో జింబాబ్వేకి చేరువలో ఉంది.. ఎందుకిలా అయింది?

ఫ్రెంచ్ విప్లవంతో చైతన్యం పొంది హైతీలో బానిసలు 1791 నుంచీ హక్కులకోసం పోరాడసాగారు. బానిసత్వం రద్దయింది. నెపోలియన్ ఫ్రెంచ్ ప్రభువయ్యాక బానిస వ్యవస్థని తిరిగి ప్రవేశ పెట్టేందుకు సైన్యాన్ని పంపాడు. 50 వేలమంది సైనికుల్నీ, 16 మంది జనరల్స్ నీ పోగొట్టుకున్నాడు నెపోలియన్. చివరకి 1804 జనవరి 1

న తిరుగుబాటు ద్వారా ఆదేశం స్వాతంత్ర్యం సాధించింది. ఆ ఉదంతం ఇతరదేశాల బానిసలని మేల్కొల్పుతుందనే భయంతో అమెరికా, ఫ్రాన్స్‌లు హైతీని ఒంటరిచేసే ప్రయత్నం చేశాయి. అంతేకాదు పేదరికం పెంచేందుకు శతవిధాలా కృషిచేశాయి. ఫ్రాన్స్ 1825లో హైతీ నౌకాశ్రయంలో యుద్ధ నౌకలు పెట్టింది. ఆఫ్రికా బానిసలని విముక్తి చేసినందువల్ల యజమానులకు నష్టం వాటిల్లిందనీ, పరిహారంగా 2100 కోట్ల డాలర్లు ఇవ్వాలని హుకుం జారీచేసింది. దీనిమీద వడ్డీ 100 ఏళ్లకి పైగా చెల్లించింది.

అమెరికా 60 ఏళ్లపాటు హైతీని ఆర్థిక దిగ్బంధంలో ఉంచింది. ఎన్నో ఆంక్షలు విధించింది. దాంతో ఆ దేశ పేదరికం తీవ్రమయింది. అమెరికా కీలుబొమ్మ బేబీ డాక్ అమెరికా ఇచ్చిన అప్పులో 50 కోట్ల డాలర్లు సొంత ఖాతాలో జమచేసుకున్నాడు. అతను దేశం వదలి వెళ్లాడు. ఆ అప్పుని ఇప్పటికీ ప్రజలు అమెరికాకు కడుతూనే ఉన్నారు. విదేశీ అప్పులు తీర్చేందుకు అడవులు నరకాల్సి వచ్చింది. ఇప్పుడు దేశంలో 2 శాతం మాత్రమే అడవులున్నాయి. అడవులు కొట్టేయడం వల్ల వరదలొస్తున్నాయి. చెట్లు పోయి నేల కోతబడుతోంది. ఉప్పెనల తీవ్రత పెరిగింది. వ్యవసాయం దెబ్బతింది. హైతీ ఇంత పేదదేశంగా మిగలడానికి కారకులు ఫ్రాన్స్, అమెరికాలే.

అమెరికా ఈ విపత్తుని హైతీ మీద తమ పట్టు బిగించేందుకు ఉపయోగిస్తోంది. పోర్ట్-ఔ-ప్రిన్స్‌లో భద్రత సమస్యగా ఉందని చెబుతోంది. అమెరికా సైనికులు 11,500 మంది ఇప్పటికీ ఉన్నారు. మరో 4000 మందిని గల్ఫ్, ఆఫ్రికాల నుంచి హైతీకి పంపుతున్నది. మొత్తం 16,000 మంది అవుతారని పెంటగాన్ చెప్పింది. హైతీయన్లు అమెరికాలోకి రాకుండా అసాధారణ చర్యలు తీసుకుంది. కనీసం గాయపడి వైద్యం కోసం కూడా వచ్చేందుకు వీలులేదు.

హిల్లరీ క్లింటన్ జనవరి 15న హైతీ అధ్యక్షుడు ఆహ్వానిస్తే వెళ్లింది. ఎమర్జెన్సీ పెట్టమని డిమాండ్ చేసింది. అమెరికా సైన్యం కర్ఫ్యూలు విధించేట్టూ, సైనికపాలన లాంటి పరిస్థితులు కల్పించగలిగేట్టూ చెయ్యాలని వాదించింది. జనవరి 18న హైతీ ప్రభుత్వం ఫిబ్రవరి 1 వరకూ ఎమర్జన్సీ విధించింది. ఇది సైనికపాలనా పరిస్థితుల్ని ఏర్పరుస్తుంది. దీన్ని అమలుపరిచేది అమెరికా సైన్యమే. ఎమర్జన్సీ ప్రభుత్వానికి విపరీతమైన అధికారాన్నిస్తుందనీ, ఆచరణలో అది అమెరికా సైన్యం చేతిలోకొస్తుందనీ హిల్లరీ వివరించింది. ఇప్పుడు పరిస్థితుల్ని చక్కబరచడానికి చాలాకాలం పడుతుందని సీనియర్ కమాండర్లు చెబుతున్నారు. ఎమర్జన్సీ అమెరికా మిలిటరీకి ప్రజలని అణచివేసేందుకు అవకాశం ఇస్తుంది. జనరల్ కెన్ కీన్ భద్రత,రక్షణ ఉన్న పరిస్థితులుంటేనే గాని అనుకున్నది సాధించలేం అన్నాడు. శాంతి భద్రతలకి దెబ్బతగిలే చర్యలు పెరుగుతూ ఉన్నాయనీ ముందుకు పోయేకొద్దీ తగిన చర్యలు తీసుకోవాలనీ హెచ్చరించాడు. బాధల్లో ఉన్న ప్రజలమీద జులుంచేసి అణచివేస్తారనే భయం జనంలో ఉంది.

నియో-కాన్ హెరిటేజ్ ఫౌండేషన్ క్లింటన్‌నీ, బుష్‌నీ హైతీ కార్యక్రమాలకు నియోగించాలని అన్నది. అన్నదొలేదో ఆ మర్నాడే ఒబామా అంతేనన్నాడు. వేలాది మంది సైనికుల్ని పంపాడు. పునరావాస చర్యలకంటే మిలిటరీ చర్యలకి ప్రాధాన్యత ఉంటుంది. ఈ విపత్తుని అమెరికా ప్రయోజనాల కోసం, సామ్రాజ్యవాదాన్ని ముందుకు తీసుకెళ్లడం కోసం ఉపయోగించుకుంటున్నాడు. ఇదే నియోకాన్ల ఉపదేశం. ఆ దృశ్యాలు హృదయ విదారకంగా ఉన్నాయని ఒబామా వాపోయాడు. ఇలాంటి వాటిని అమెరికా మిసైల్స్ కొట్టినప్పుడు పాకిస్తాన్ పల్లెల్లో ఇళ్లల్లో చూడవచ్చు. ఇంతకన్న దారుణమైన దృశ్యాలు అమెరికా బాంబుల వర్షం కురిపించినప్పుడు ఆఫ్ఘనిస్తాన్‌లోనూ, యెమెన్‌లోనూ, ఇరాక్‌లోనూ చూడవచ్చు. అక్కడ ఆయనకు ఇలాంటి దృశ్యాలే హృదయోల్లాసం కలిగించాయి.

క్లింటన్, బుష్ చెరి ఎనిమిది సంవత్సరాలు అధ్యక్షులుగా ఉన్నారు. వాళ్లిద్దరినీ ఒబామా రంగంలోకి దించాడు. వాళ్లిద్దరూ అధ్యక్షులుగా ఉన్నప్పుడు హైతీ ప్రజలకి ఏంచేశారో చూద్దాం.

1915 నుంచీ 1934 వరకూ అమెరికా ఆ స్వతంత్ర దేశాన్ని ఆక్రమించి రాజ్యాంగాన్ని తుంగలో తొక్కింది. పశ్చిమార్ధగోళంలో స్వాతంత్ర్యం పొందిన మొదటి దేశం అమెరికా అయితే, రెండోదేశం హైతీ. అమెరికా 1776లో ఇంగ్లండ్ నుంచి విముక్తయింది. 1804లో హైతీ ఫ్రాన్స్ నుంచి స్వతంత్రమయింది. తన పోరాటాన్ని మరచిపోయి హైతీలో అమెరికా కీలుబొమ్మ ప్రభుత్వాల్ని నెలకొల్పింది. దుష్ట నియంతలైన పాపా డాక్ డువాలియర్‌నీ, అతని పుత్రరత్నం బేబీ డాక్‌నీ వెనకుండి ఆడించింది. బేబీ డాక్ ని ప్రజలు పోరాటం ద్వారా నెట్టివేశారు. తిరిగి 1987 లో సైనికపాలన వచ్చింది. తర్వాత అరిస్టిడ్ మూడింట రెండొంతుల ఓట్లతో అధ్యక్షుడయ్యాడు. అమెరికా అరిస్టీడ్‌ని అధ్యక్ష పీఠం నుంచి కూలదోసేందుకు కుట్ర చేసింది. అరిస్టిడ్‌ని సీనియర్ బుష్ ప్రమాదకరమైన తీవ్రవాదిగా భావించి, సైనికుల్ని తిరుగుబాటుకు ప్రోత్సహించాడు. ఎన్నికయిన 7 నెలలకే 1991 సెప్టెంబర్‌లో సైనికులు ఆయన్ని పదవీచ్యుతుణ్ణి చేశారు. ఆ తర్వాత క్లింటన్ అధ్యక్షుడయ్యాడు. హైతీ సైనిక పాలన మీద కొన్ని ఆర్థిక ఆంక్షలు పెట్టాడు.వాటివల్ల హైతీ ఎగుమతి పరిశ్రమలు దెబ్బతిన్నాయి. ఆ పరిస్థితుల్లో హైతీకి సైనికుల్ని పంపాడు. సైనిక పాలకుడు జనరల్ సెడ్రాస్‌ని వెళ్లిపోయేట్టు చేశాడు. 1994లో అరిస్టీడ్‌ని అధ్యక్ష స్థానంలో కూర్చోబెట్టాడు. అమెరికాకి ఎదురాడననీ, హైతీ భారీ వ్యాపారులకి అనుకూలంగా ఉంటాననీ, 1996లో పోటీ చేయకుండా తప్పుకుంటాననీ వాగ్దానం చేశాకనే క్లింటన్ అరిస్టిడ్‌కి పదవి కట్టబెట్టాడు. అరిస్టిడ్ తిరిగి గద్దెనెక్కినా, నయా ఉదారవాద పొదుపు చర్యల్ని అంగీకరించి అమలుపరచాల్సి వచ్చింది. అవసరమైన ఆహార పదార్థాల్ని ఉత్పత్తి చేసుకోగలిగినా సగం విదేశాలనుంచి దిగుమతికి ఒప్పుకోవాల్సి వచ్చింది. ఐ.ఎం.ఎఫ్. ప్రపంచ బ్యాంక్‌ల అప్పులమీద ఆధారపడక తప్పలేదు.

అంతకు ముందు1994లో వాషింగ్టన్ డిమాండ్‌ని అరిస్టిడ్ తిరస్కరించాడు. హైతీలో ప్రభుత్వ అధీనంలో ఉన్న వ్యాపార సమస్త సంస్థల్ని తక్షణమే అమ్మాలనేదే ఆ డిమాండ్. సంపన్నులైన కొద్దిమంది ప్రైవేట్ వ్యక్తుల సంపద పెంచుతుందనీ, దేశ సంపదని పేదలకి దక్కకుండా చేస్తుందనీ ఆయన వాదించాడు. ప్రపంచీకరణ వల్ల సంపద కొద్ది మందికే దక్కుతుందనీ, ప్రజలు పేదలవుతారనీ చెప్పాడు. పదవిచ్చాక వదులుకున్నాడు.

ఇచ్చిన మాటకు కట్టుబడి పదవి నుంచి తప్పుకున్నాడు. 1996లో రెనె ప్రెవాల్ అధ్యక్షుడయ్యాడు. ఐ.ఎం.ఎఫ్ చెప్పినట్లు పునర్వ్యవస్థీకరణకి పూనుకున్నాడు. ప్రభుత్వ సేవలకి కోత పెట్టాడు. ఉద్యోగాలు తగ్గించాడు. దేశీయ వరి రైతులు దెబ్బతినే చర్యలకు పాల్పడ్డాడు. 2000 మే లెజిస్లేటివ్ ఎన్నికల్లో అరిస్టీడ్ పార్టీ ఫన్మి లవలాస్ గెలిచింది.

డెమాక్రట్ అయిన క్లింటన్ గానీ కాంగ్రెస్‌లో పట్టున్న రిపబ్లికన్‌లు గానీ ఆపార్టీ గెలుపుని గుర్తించలేదు. అమెరికా సహాయాన్నీ ఆపివేశాడు క్లింటన్. 2000 నవంబర్‌లో అరిస్టిడ్ 92 శాతం ఓట్లతో భారీ మెజార్టీతో

*గాంధేయవాది **హిమాంశు కుమార్** ఛత్తీస్‌గడ్‌లోని దంతేవాడలో పరిస్థితుల పై 31 అక్టోబర్ 2009న ముంబయిలోని ప్రెస్ క్లబ్‌లో చేసిన ప్రసంగం ఆధారంగా **జ్యోతి పున్వాని** రాసిన వ్యాసం*

# సమస్య మావోయిస్టులా? రాజ్యమా?

*(గత సంచిక తరువాయి)*

**రా**కపోకలు లేకుండా చేసిన గ్రామాలలో ప్రభుత్వం అన్నింటినీ మూసివేసింది. అక్కడ ఏమీ లేవు – బడులు లేవు, డాక్టర్లు లేరు. వీళ్లందరూ నక్సలైట్లని ప్రభుత్వం హైకోర్టుకి చెప్పింది. చౌకధరల దుకాణాల ద్వారా బియ్యం సరఫరా చేస్తే దానిని నక్సలైట్లు దోచుకుంటారు కాబట్టి ఆ పని చెయ్యకూడదని పోలీసులు చెప్పారు. దాంతో గత అయిదు సంవత్సరాల నుంచి బియ్యం సరఫరా కావడం లేదు. ఏ నక్సలైట్ అయినా ఆకలితో చనిపోయాడా? అడవిలోని రోగులకు చికిత్స చెయ్యడానికి వెళితే సిఆర్‌పిఎఫ్ జవాన్లు తమని కొడుతున్నారని వైద్యాధికారులు చెపుతున్నారు. టీచర్లు వెళితే వాళ్లని కూడ కొడుతున్నారు. జవాన్లకి కోపంగా ఉంది – మీరు వెళ్లినప్పుడు మీకు ఏమీ కాదు, మేం వెళితే మా వాహనాలను ఎందుకు పేల్చివేస్తున్నారని టీచర్లని వాళ్లు అడుగుతున్నారు. మీరు కూడా నక్సలైట్లతో కలిసి పని చేస్తున్నారా అన్నది సాయుధ దళాల ప్రశ్న. మీలాగ ఆయుధాలతోటి వెళ్లడం లేదు కాబట్టి డాక్టర్లు, టీచర్లకు ఏమీ జరగడం లేదని వాళ్లతో నేను చెబుతున్నాను.

గిరిజనుల భూములను గిరిజనేతరులు తీసుకోవడానికి దంతేవాడ కలెక్టర్ ఇష్టమొచ్చినట్లు అనుమతులు ఇచ్చేస్తున్నాడు. ప్రభుత్వమే భూమిని తీసుకుని దానిని ఇచ్చి వేస్తోంది. అయితే ఇక్కడ మావోయిస్టులు ఉన్నందువల్ల ఆయా కంపెనీలు తమ ప్రాజెక్టులను మొదలు పెట్టలేకపోతున్నాయి.

నక్సలైట్లు చెడ్డవాళ్లని, రాజ్యం మంచిదని చెప్పడానికి నిరంతరం ప్రయత్నిస్తుంటారు. దంతెవాడ ఆదివాసులను ఈ విషయం గురించి అడగండి. నేను కొంతమంది రాజకీయ నాయకులకు చెప్పాను: మీరు నక్సలైట్లతో మాట్లాడవద్దు, వారి బాధితులని మీరు చెప్పే ఆదివాసులతో

---

అధ్యక్ష స్థానాన్ని కైవసం చేసుకున్నాడు. అప్పుడు బుష్ వచ్చాడు. మూడేళ్లపాటు సహాయం నిలిపేశాడు. అంతర్జాతీయ సహాయం లభించకుండా చర్యలు తీసుకున్నాడు. అరిస్టిడ్ ప్రభుత్వాన్ని ఏకాకిని చేసే ప్రయత్నం చేసాడు. చివరగా 2004 ఫిబ్రవరిలో కుట్ర పన్ని సైనిక తిరుగుబాటుని ప్రోత్సహించి అరిస్టిడ్‌ని దింపి బలవంతంగా వేరేదేశానికి పంపించాడు బుష్. రెనె ప్రెవాల్ రెండోసారి అధ్యక్షుడయ్యాడు. ఐ.ఎం.ఎఫ్ ఏదిచెబితే అది చేస్తున్నాడు. అమెరికా కార్పొరేట్ల ఆజ్ఞలని శిరసావహిస్తున్నాడు. ఇదంతా అమెరికా పాలకవర్గాల ఆర్థిక రాజకీయ ప్రయోజనాలని నెరవేర్చేందుకే. ఇందుకోసం పోయిన రెండు శతాబ్దాలూ హైతీలో ప్రజావ్యతిరేక వర్గానికి అన్నిరకాల మద్దతూ ఇచ్చింది.

ఒబామా ఆ విధానాన్నే కొనసాగిస్తున్నాడు. హోండురాస్‌లో సైనిక తిరుగుబాటూ, కొలంబియాలో తన మిలిటరీ స్థావరం ఏర్పాటు ఒప్పందమూ దీన్ని ధృవీకరిస్తున్నాయి. అమెరికా దుస్తుల తయారీ పరిశ్రమకి అతిచౌక శ్రమ హైతీయన్ల నుంచి దొరుకుతున్నది. రోజుకి 1 డాలర్ 72 సెంట్లు మాత్రమే. దారిద్ర్య రేఖకి దిగువ ఆదాయం. క్లింటన్ దాన్ని సమర్థిస్తూ హైతీకి ఐక్యరాజ్యసమితి దూతగా వ్యవహరిస్తున్నాడు. హైతీనించి అమెరికాలోకి పోయేవాళ్లని ప్రభుత్వం పట్టుకొని శిక్షించాలని అమెరికా షరతు. దాన్ని ప్రెవాల్ తు.చ. తప్పకుండా పాటిస్తున్నాడు. క్లింటన్ 1992 ఎన్నికల ప్రచారంలో ఈ పద్ధతిని ఖండించాడు. అయితే గద్దెనెక్కాక మర్చిపోయాడు. వీళ్లిద్దరికీ ఇప్పుడు హైతీ బాధ్యతలు అప్పగించాడు ఒబామా.

హైతీకి దగ్గరలో భూకంపం సృష్టించే ఆయుధాల్ని ప్రయోగం చెయ్యడం వల్లనే హైతీలో ఈ పరిణామం సంభవించిందని ఛావెజ్ ఆరోపించాడు. ప్రకృతి విలయం ముసుగులో హైతీని ఆక్రమించాలని అమెరికా చూస్తున్నదని ఇంతకుముందే అన్నాడు. వాతావరణంలో తీవ్రమైన మార్పుల్ని తేగల హై ఫ్రీక్వెన్సీ ఆక్టివ్ ఔరోరల్ రీసెర్చ్ ప్రొగ్రాం (ఎచ్ఎఎఆర్‌పి) కి సంబంధించింది. 1997 లో అమెరికా మాజీ రక్షణ మంత్రి కొన్నిదేశాలు విద్యుదయస్కాంత తరంగాల ద్వారా భూకంపాలని ప్రేరేపించడానికీ, అగ్నిపర్వతాలనీ పేల్చడానికీ ప్రయత్నాలు చేస్తున్నాయన్నాడు. ఆ దేశాలు వాతావరణ సంబంధమైన ఉగ్రవాదంలో నిమగ్నమై ఉన్నాయని ఆరోపించాడు. హైతీ భూకంపానికి అమెరికా చేసిన టెక్టానిక్ ఆయుధాన్ని ప్రయోగించి చూడటమే కారణమని ఛావెజ్ చెబుతున్నాడు. ఇది కేవలం ఎలా పనిచేస్తుందో చూసేందుకు ప్రయోగించింది మాత్రమే. అసలు ముందు లక్ష్యం ఇరాన్ అన్నాడు. దీన్ని భూ కంపాయుధం అనీ అంటున్నారు. అమెరికా, రష్యా ల వద్ద ఇలాంటి ఆయుధాలున్నాయని గతంలో చెప్పినవారున్నారు. ఛావెజ్ ఆధారాలు చూపలేదు. నిజంగా అలాంటివి ఇప్పటికున్నాయో లేదో తెలియదు. ఒకవేళ ఉంటే ఉపయోగించడానికి వెనకాడే పని ఉండదు. రెండో ప్రపంచయుద్ధం ముగిశాక, హిట్లర్ చనిపోయాక ఇతర దేశాలు చప్పబడ్డాక, ఐన్‌స్టీన్ వద్దని మొత్తుకుంటున్నా హిరోషిమా నాగసాకీల మీద ఆటం బాంబులు వేసింది వాటి వినాశకర శక్తి ఎంతో తెలుసుకోడానికీ, అన్నిదేశాల్నీ భయపెట్టడానికే. ఇప్పుడు భూకంపాయుధం ఉంటే ప్రయోగించేందుకు వెనుకాడుతుందా! వీ

మాట్లాడండి. మీరు వారికి ప్రజాస్వామ్యంలో ఎన్నికైన నాయకులు. ప్రజలు మిమ్మల్ని ప్రేమిస్తూ ఉండాలి, మీరు ప్రజల్ని ప్రేమిస్తూ ఉండాలి. ప్రజలు మిమ్మల్ని ప్రేమించడం మాని, నక్సలైట్లను ప్రేమిస్తూ ఉంటే దానికి కారణాలు ఏమిటో మీరే తెలుసుకోవాలి.

నేను వ్యక్తిగతంగా అహింసావాదిని. గత 17 సంవత్సరాలుగా నేను ప్రజాస్వామిక సంస్థలను బలోపేతం చెయ్యడానికి, రాజ్యాంగం వాళ్లకి ఇచ్చిన హక్కుల గురించి, సంక్షేమ పథకాల గురించి చెప్పడానికి, తమ హక్కుల కోసం ప్రజాస్వామిక పద్ధతుల్లో పోరాడడం గురించి నేర్పడానికి పనిచేశాను. నక్సలైట్లు తుపాకులు చేతపట్టారు కాబట్టి అహింసావాదాన్ని బలోపేతం చెయ్యడానికి మేం అక్కడికి వెళ్లాం. కాని ప్రభుత్వం మమ్మల్ని మావోయిస్టులని అంది. ప్రభుత్వం పని చేసే విధానం ఇలాగే ఉంటుంది. నిన్ను వేధిస్తుంది, నీకు ఏ దారీ లేకుండా చేస్తుంది. చివరికి నిన్ను నక్సలైటు అంటుంది.

నక్సలైట్ల గురించి వినోబా భావే 'ఈ యువతకి పేదల పట్ల ఎంతో ప్రేమ ఉంది, వారికి నా వందనాలు' అనేవాడు. ఆయన తన భూదాన ఉద్యమాన్ని మొదలుపెట్టి నక్సలైట్లు 30 సంవత్సరాల పాటు వెనుకబడేలా చేశాడు. నేను దంతెవాడలో ఉన్న ఈ 17 సంత్సరాలలో ఆదివాసుల మధ్య నక్సలైట్లు ఎలా పని చేస్తారో చూశాను. నెత్తిమీద ఒక కట్టెల మోపు తీసుకు వెళుతున్నందుకు ఆదివాసీ మహిళలను ఫారెస్ట్ గార్డు అత్యాచారం జరుపుతాడు. మూడు రూపాయల జరిమానా కట్టకపోతే మూడు వందల రూపాయలు గుంజుకుంటాడు.

1980లలో నక్సలైట్లు అక్కడకు వచ్చారు. వాళ్లు అటవీ గార్డుని పట్టుకుని చెట్టుకి కట్టేసి అతడిని కొట్టమని ఆదివాసులకు చెప్పేవారు. తమకి కూడ కొంత శక్తి ఉందని ఆదివాసులు మొట్టమొదటిసారిగా గ్రహించారు. ఈ గార్డులను శిక్షించడం ద్వారా ప్రభుత్వం ఆదివాసుల సాధికారీకరణకు దోహదం చేసి ఉండాల్సింది. ఆదివాసుల ఇప్ప పువ్వుకు ప్రభుత్వం ఎప్పుడూ కనీస ధర నిర్ణయించలేదు. కానీ నక్సలైట్లు నిర్ణయించారు.

ఆదివాసులు ఎన్నడూ హింసాత్మకంగా లేరు. కానీ, వాళ్లు ఎప్పుడైనా తమ గళాన్ని విప్పితే రాజ్యం పోలీసులను పంపించేది. నాకు వ్యతిరేకంగా నక్సలైట్లు ఎన్నడూ హింసను ఎందుకు ఉపయోగించలేదు? నాకోసం వాళ్లు మంచం వేస్తారు, మంచినీళ్లు తెస్తారు. రండి గురువుగారు, కూర్చోండి అంటారు. మా ప్రాంతంలో ఎటువంటి ప్రభుత్వ కార్యక్రమం అమలు కాగూడదని మొదట్లో మావోయిస్టులు ప్రకటించారు. కానీ మేం పని చేసుకుంటూ వెళ్లాం. ఎటువంటి రాజకీయ ఆకాంక్షలు లేవని, కాబట్టి మా పనిలో జోక్యం చేసుకోమని వాళ్లు కబురు పెట్టారు.

పోలీసులకు వ్యతిరేకంగా, అమాయక ప్రజలకు వ్యతిరేకంగా మావోయిస్టుల హింస గురించి మాట్లాడుతుంటారు. మీరు హింసను అర్థం చేసుకోవాలంటే దాని లోతుల్లోకి వెళ్లాలి. ఒక ఎస్.పి.ఒ. హత్య జరిగితే ఒక అమాయక వ్యక్తి చంపబడ్డాడని పోలీస్‌శాఖ ప్రకటిస్తుంది, ప్రసార సాధనాలు దానికి వంత పాడతాయి. ఒక ముసలి ఆదివాసిని చంపి మావోయిస్టు ప్రాంతీయ కమాండర్‌ని చంపామని పోలీసులు ప్రకటిస్తారు. ఆదివాసులు నిరంతరం భయం నీడలో జీవిస్తున్నారు. వాళ్లు దాక్కున్న చోటుని ఈ వ్యక్తి పోలీసులకు తెలియజేస్తాడని భావిస్తే... మీరు నిరంతరం వేటాడబడి, ఇల్లు వదిలి పారిపోయి, పోలీసులకు తెలియకుండా ఎక్కడో దాక్కుని ఉన్నప్పుడు మీ విషయం పోలీసులకు తెలియజేసే కొత్త వ్యక్తి వచ్చాడని అనుమానం వస్తే... నాతోటి కూడ ఒకసారి ఇలా జరిగింది. అడవిలో కూలిన ఒక విమానంలో బతికి బయటపడినవాళ్లను గుర్తించడానికి ఒకసారి ప్రభుత్వం నా సహాయం అడిగింది. లోపలికి వెళ్లాలంటే పోలీసులకు ఏమయ్యింది. హెలికాప్టర్‌లో ఉన్న వాళ్లకి ఏమయ్యిందోనని ఆ కుటుంబ సభ్యులకు ఆందోళనగా ఉంది. నేను సంప్రదింపులు జరిపి లోపలకు వెళ్లాను. కానీ పోలీసులు నన్ను మోసం చేశారు. మా వెనక రమ్మని చెప్పారు కానీ వాళ్లు మాట తప్పారు. వాళ్ల స్వభావం ప్రకారం వాళ్లు కోళ్లు, సారా బలవంతంగా గుంజుకున్నారు. నేను పోలీసులను తీసుకు వచ్చానని మావోయిస్టులు భావించారు. నన్ను చెట్టుకి కట్టివేశారు. సకాలంలో అసలు విషయం తెలియకపోయి ఉండినట్లయితే నన్ను చంపేసి ఉండేవారు. తమకు ద్రోహం చేస్తే తమలో వాళ్లని కూడ వాళ్లు చంపేస్తారు.

ఆ గ్రామంలో నేను మూడురోజుల పాటు ఉన్నాను. నలభై సంవత్సరాలు దాటిన వాళ్లు అక్కడ ఒక్కళ్లూ లేరు. అంతకంటే ఎక్కువ కాలం ఎవరూ జీవించలేరు. పిల్లల్లో పోషకాహారం లోపం కొట్టొచ్చినట్లు కనబడుతోంది. మాకు కాపలాగా ఒక ఎనిమిదేళ్ల పిల్లవాడు ఉన్నాడు. అతడికి ఒక టోపీ, ఒక ఈల ఉన్నాయి. ఆ రెండు ఉండడం అతడికి ఎంతో గర్వంగా ఉంది. మీ ఊరికి పోలీసులు ఆఖరిసారి ఎప్పుడు వచ్చారని నేను అతన్ని అడిగాను. రెండు సంవత్సరాల క్రితమని అతడు బదులిచ్చాడు. ఏం చేశారని అడిగితే 40 ఇళ్లు తగలబెట్టారు, ముగ్గురిని చంపారు, అక్కడ ఉన్న ఆమెపై అత్యాచారం చేశారంటూ ఒక మహిళను చూపుతూ బదులిచ్చాడు. ఈ గ్రామం సరిగ్గా బైలాదిల్లాకి వెనకగా ఉంది, ఇది అంతా బొగ్గు రజనుతో కప్పబడి ఉంది. అయినా అక్కడ బడిలేదు. భారతదేశ అభివృద్ధి నమూనా ఈ విధంగా ఉంది.

మీరు మావోయిస్టులకు హింసను మానుకొమ్మని చెప్పండి అని ప్రజాస్వామిక హక్కుల బృందాలతో ప్రభుత్వం చెబుతుంటుంది. ముందు మీ సాయుధ దళాలకు హింసను ఆపమని చెప్పండి అని మేం ప్రభుత్వానికి చెపుతుంటాం. మానవ హక్కుల బృందాలు మీ పోలీసులకు వ్యతిరేకంగా చేస్తున్న ఎఫ్.ఐ.ఆర్.లను నమోదు చెయ్యండి. మీరు కనీసం ఆ మాత్రం చెయ్యకుండా హింసపై మీ విధానం ఏమిటని వాళ్లని నిలదీస్తుంది. మేం ఏం చెప్పాలని కోరుకుంటున్నారు? మేం అక్కడ నివసిస్తున్నాం. మాకు అక్కడి పరిస్థితి తెలుసు. బయటి నుంచి చూస్తే కొన్ని ఘటనలు ఘోరంగా కనిపిస్తాయి. కొంతమంది ఎస్‌పిఒలు బృందంగా ఊరు తరువాత ఊరుని తగలబెడుతూ వచ్చారు. ఈ ఎస్‌పిఒల బృందాన్ని గ్రామస్తులు ఒకసారి చుట్టుముట్టి చంపెయ్యగలరు.

గత అయిదు సంవత్సరాలలో దంతేవాడకు ఒక్క రాజకీయ నాయకుడైనా వచ్చి మీ సమస్యలు ఏమిటని ఆదివాసులను అడిగిన పాపాన పోలేదు. అందుకని నేను ఆదివాసులనే ఢిల్లీకి తీసుకువెళదామని అనుకున్నాను. పెద్ద హంగామా అవుతుంది అనుకున్నాను. గాయపడిన ఆదివాసులను కాన్‌స్టిట్యూషన్ క్లబ్‌కి తీసుకెళ్లాను. కానీ ఏమీ జరగలేదు. పట్టణ వాసుల పరిస్థితి ఇప్పుడు ఇలా ఉంది. పల్లెల్లో ఏం జరుగుతుందో వాళ్లకి పట్టదు. సుఖవంతమైన జీవితాలు గడుపుతున్న వాళ్లే శాంతిని కోరుకుంటున్నారు. తమ సుఖవంతమైన జీవితాలకు ఎటువంటి ఆటంకమూ కలగకూడదని వాళ్లు శాంతిని కోరుకుంటున్నారు. కాని దాడులకు గురవుతున్న వాళ్లు న్యాయానికి ప్రాధాన్యతనిస్తున్నారు.

'అన్యాయం ఉన్న చోట శాంతి ఉండదు' అని వినోబా భావే చెప్పాడు. కానీ ప్రభుత్వం న్యాయం గురించి మాట్లాడదు.

లక్షలాది ప్రజలు ఎందుకు ఆయుధాలను చేతపట్టారు? మన మధ్యతరగతి ప్రజలకి ఈ విషయం అర్థం కాదు. మనం పట్టణాల్లో ఉంటాం, పోలీసులు మన కోసం ఉంటారు, ప్రభుత్వం మన కోసం ఉంటుంది. మనం ఒకవైపున ఉన్నాం. మరొకవైపున ఉన్న వాళ్లకు పోలీసులు లేరు, ప్రభుత్వం లేదు. వాళ్లకి తినడానికి ఏమీ లేదు. ఆయుధాలను చేతపట్టుకుంది వాళ్లే. సంవత్సరాల తరబడి వీళ్లు వంచించబడ్డారు. ఒక వ్యవస్థ ఉంది, ఆయుధాలు చేతపట్టడం ఆ వ్యవస్థ బయట ఉన్నవాళ్ల హక్కు, ఇది వాళ్ల పోరాటం. ఈ భూమి అంతా ఎవరికి చెందుతుంది అని ప్రశ్నిస్తే మనందరికీ అన్న సమాధానం వస్తుంది. అయితే వాస్తవం ఏమిటంటే కొంతమందికి ఎక్కువ భూమి ఉంది, కొంతమందికి తక్కువ భూమి ఉంది. మీరు పట్టణంలో ఉండేవాళ్లు కాబట్టి మీకు ఎక్కువ ఉంది, మీరు అగ్రకులానికి చెందిన వాళ్లు కాబట్టి మీకు ఎక్కువ ఉంది, మీరు విద్యావంతులు కాబట్టి మీకు ఎక్కువ ఉంది. ముంబయిలో మెరైన్‌డ్రైవ్ (సంపన్న ప్రాంతం)లో పుట్టిన వాళ్లు ధారవి (మురికి వాడల ప్రాంతం)లోని ఇంటిని పడగొట్టవచ్చు. ఈ పరిస్థితి తారుమారు ఎందుకు కాగూడదు?

మన వ్యవస్థలోనే అసమానత ఉంది. ఎవరి ఆధీనంలో వనరులు ఉన్నాయి అన్నది మన విలువల వ్యవస్థలోనూ, రాజకీయ వ్యవస్థలోనూ భాగమైపోయాయి. ఈ రెండింటికీ మన ఆర్థిక వ్యవస్థ మద్దతు ఉంది. మన సమాజానికి ఇవి మూలాధారంగా ఉన్నాయి. ఈ నిర్మాణమే పేదవాళ్లని పేదవాళ్లుగానే, డబ్బున్న వాళ్లని డబ్బున్న వాళ్లుగానే ఉంచుతోంది. మరి దీని దాష్టీకాలను భరించే వాళ్ల మాటేమిటి? వాళ్లు దీనిని బద్దలుకొట్టాలని అనుకుంటున్నారు. వాళ్ల పోరాటం వ్యవస్థీకృతమైన హింసకు వ్యతిరేకంగా జరుగుతోంది. వ్యవస్థ మారి అందరూ సమానులు అయ్యేవరకు ఇది ఆగదు.

కష్టాలలో ఉన్న వాడు పోరాడతాడు. ఇది పేద ప్రజల పోరాటం. నక్సలైట్లు వాళ్లతో పాటు చేరారంతే. ఒక మార్క్స్, ఒక గాంధీ లేకపోతే పేదవాళ్లు పోరాడేవారు కాదా? వాళ్లకి నక్సలైట్లు, గాంధేయవాదుల అవసరం లేదు. కానీ ఒక్కొక్కసారి ఒక వినోభా, ఒక గాంధీ, లేదా మావోయిస్టులు వాళ్ల పోరాటాల్లో చేరతారు. పేదల ఈ పోరాటాన్ని సైన్యంతో అణిచివేయవచ్చని కేంద్ర ప్రభుత్వం భావిస్తే వారు పొరబడినట్లే. తీవ్ర అణచివేత పోరాడేవాళ్లను మరింత సాహసవంతుల్ని చేస్తుంది.

కేంద్రానికి నిజంగా శాంతి కావాలంటే దానిని వారం రోజులలో సాధించవచ్చు. వాళ్లు ఆదివాసులకు సంతోషాన్ని పంచాలి. అంగన్‌వాడీలు, ఆరోగ్య కేంద్రాలు, బడులను తిరిగి తెరవండి. దానికి బదులుగా వారిపై అంచెలంచెలుగా బాధలను మోపుతూ వారిని చంపెయ్యగలమని అనుకుంటున్నారు. ఒక రజాయిని కాలిస్తే అది తగలబడుతుంది. మీరు కోబ్రా దళాలను పంపిస్తే వాళ్లు మంచంలో ఉన్న ముసలివాడిని పొడిచి చంపుతారు. మీ ప్రవర్తన గురించి మావోయిస్టులు ముందుగానే చెప్పినట్లు ఉంది. రాజ్యం అణచివేస్తుందని వాళ్లు అనేక సంవత్సరాలుగా ఆదివాసులకు చెబుతున్నారు.

ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా వనరులను అంతం చేస్తున్న వాళ్లు పేద ప్రజలను పెనుభారంగా పరిగణిస్తున్నారు. వాళ్లని సమూలంగా నిర్మూలిస్తే భూమిపై తమ పూర్తి పెత్తనాన్ని చెలాయించుకోవచ్చు. ఆదివాసులు అందరికంటే బలహీనులు. ఆదివాసులందరినీ సమూలంగా నిర్మూలించాలని ప్రభుత్వం ప్రణాళికలు తయారు చేస్తోంది. మన ఆధునిక నాగరికత పయనిస్తున్న మార్గం ఇది. మనం దీనికి మద్దతు ఇస్తామా? లక్షలాది మంది ప్రజలను చంపెయ్యగలుగుతారా? మీరు ప్రయత్నం చేస్తారు. కానీ వాళ్లు తిరగబడి మిమ్మల్ని చంపడానికి పూనుకున్నప్పుడు మిమ్మల్ని మీరు కాపాడుకోలేరు.

పేదల్లో మూడు రకాలు ఉన్నారు. 1) మీ సంపదపై ఆధారపడి బతికేవాళ్లు – ఇంట్లో పనిచేసేవాళ్లు, బూరలు అమ్మేవాళ్లు, భవన నిర్మాణ కార్మికులు; 2) తాము ఎన్నడూ ధనికులం కాలేమని అనుకునేవారు – చదువులేని వాళ్లు, తక్కువ కులాల వాళ్లు ; 3) సంపద కోసం మీరు వాళ్ల భూములపై దాడిచేసే వరకు ఆదివాసుల మాదిరిగా అడవులలో హాయిగా ఉంటున్నవాళ్లు.

అందుకనే వాళ్లు ఆయుధాలను పట్టుకున్నారు. మీరు చిదంబరం దగ్గరికి పరిగెత్తారు. మొదటి రెండు రకాల వాళ్లు మూడోరకంతో కలిసినప్పుడు మీరు మిగలరు. దీనిపై మీ విధానం ఏమిటి? 'అన్యాయాన్ని ఒప్పుకోవడం తప్పు, దీనిని ఒప్పుకోనివ్వకుండా పేదవాళ్లను నేను రెచ్చగొడతాను' అని వినోబా అనేవాడు.

హింసకి అనువైన వాతావరణాన్ని మీరు కల్పిస్తున్నారు. సల్వాజుడుంకి ముందు మావోయిస్టులు ఐదువేల మందికి మించి లేరు. సల్వాజుడుం తర్వాత మావోయిస్టుల బలం 22 రెట్లు పెరిగి 1,10,000కు చేరుకుంది. ఆపరేషన్ గ్రీన్‌హంట్ తరువాత బతికి ఉన్న ప్రతి ఆదివాసీ పూర్తికాల మావోయిస్టుగా మారతాడు. మావోయిస్టుల సంఖ్య పెరిగితే వాళ్లు తమ పరిధిని విస్తృతం చేసుకుంటారు. వాళ్లు ముంబయి, ఢిల్లీ చేరుకుంటారు. సాయుధ దళాలలోని యువకుల పట్ల కూడా నాకు జాలి ఉంది. ఎటయినా వాళ్లు నష్టపోతారు. పారామిలిటరీ, పోలీసు దళాలలో చేరకపోతే ఆకలికి చచ్చిపోతారు. అందులో చేరితే కూడా వాళ్లు చనిపోవడం ఖాయం. డబ్బున్న కార్పొరేషన్‌ల ప్రయోజనాల కోసమే కదా ఈ యువకులను మృత్యు ముఖంలోకి పంపిస్తున్నారు. కార్పొరేషన్‌లు మరింత సంపద సమకూర్చుకోడానికి వీలుగా మీరు కొంతమందిని చంపడానికి మరికొంతమందిని పంపిస్తున్నారు.

మీకు నేను చేసే విన్నపం ఒక్కటే. బస్తర్‌కి రండి, ఆదివాసుల పక్షాన నిలబడండి.

*(అయిపోయింది)*

*(తెలుగు అనువాదం : కె. సురేష్)* వీ

*దుష్టులు ఏకమైనప్పుడు మంచి మనుషులు సహకరించుకోక తప్పదు. అలా జరగపోతే ఒకరి తరువాత ఒకరు మంచి వాళ్లందరూ పడిపోతారు. ఒక అసహ్యకరమైన పోరాటంలో నిర్దాక్షిణ్యమైన త్యాగం అది.*

**- ఎడ్మండ్ బర్క్**

*సమాజాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకోవడానికీ, విమర్శించడానికీ, భవిష్యత్తును కలగనడానికీ, విప్లవ వ్యూహం రూపొందించడానికీ మార్క్సిస్ట్ గతితార్కిక సంవిధానం ఎలా ఉపయోగపడుతుందో వివరిస్తున్నారు* **బెర్టెల్ ఓల్‌మన్**

# మార్క్సిజం - రెండు నగరాల కథ

**మా**ర్క్సిజం అనే దాన్ని కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్‌లు వెలువరించిన భావాల సమ్మేళనంగా అర్థం చేసుకున్నట్టయితే అది రెండు నగరాల కథను చెపుతుంది. ఒక నగరంలోనేమో చాలా స్వేచ్ఛ ఉందని చెపుతారు, కాని ఎంత మాత్రమూ ఉండదు. మరొక నగరంలోనేమో అందరికీ అపారమైన స్వేచ్ఛ ఉంటుంది, కాని ఆ నగరం ఎక్కడ ఉందో, అక్కడికి ఎలా చేరాలో ఎవరికీ తెలియదు. మొదటి నగరాన్ని పెట్టుబడిదారీ విధానం అంటారు. ఈ నగరంలో ఉన్న నిర్మాణాలన్నిటిని స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి మూర్తీభవ రూపాలుగా చెపుతూ ఉంటారు. కాని, ఏదీ ఉచితం కాదు. ప్రతిదానికి ఖరీదు ఉంటుంది. ఆ ఖరీదు కూడ అవి అవసరమైన వాళ్లు భరించలేనంత ఎక్కువగా ఉంటుంది. చాలా మంది పౌరులకు 'స్వేచ్ఛ' అంటే అర్థం ఏమంటే తమ అందుబాటులో లేని వస్తువులను సాధించడం కోసం పోటీ పడే స్వేచ్ఛ. ఆ వస్తువులయితే వాళ్ల అందుబాటులో ఉండవు కాని, వాటికోసం పోటీ పడడం నుంచి వాళ్లను ఎవ్వరూ అడ్డుకోరు. ఏదో ఒకరోజు తామో, తమ పిల్లలో వాటిని అందుకుంటారనే ఆశ నుంచి కూడా వాళ్లను ఎవ్వరూ అడ్డుకోరు.

రెండో నగరం పేరు కమ్యూనిజం. ఈ నగరంలో మనుషులు మానవ జీవులుగా, తమ శక్తియుక్తులన్నిటినీ సంపూర్ణంగా అభివృద్ధి చేసుకునే స్వేచ్ఛ ఉంటుంది. తోటి మనుషులతో, శాంతితో, స్నేహంతో గడిపే స్వేచ్ఛ ఉంటుంది. అంటే వాళ్ల స్వేచ్ఛ అందని దానికోసం అర్రులు చాచే స్వేచ్ఛ కాదు. తమకు కావలిసినది చేసుకునే, తమకు కావలిసినట్టు మారే, తమకు కావలిసినట్టు ఉండే స్వేచ్ఛ. ఈ నగరాన్ని ఏ చిత్రపటంలోనూ కనిపెట్టలేం. ఎందుకంటే ఇప్పటిదాకా అది మొదటి నగరం నీడలలోనే మనుగడ సాగించింది. వాస్తవంగా చెప్పాలంటే పెట్టుబడిదారీ విధానం సాధించగలవన్నీ అది కలిగి ఉంటుంది. పెట్టుబడిదారీ విధానం అనే నగరంలోనే ఈ నగరం సాధించడానికి అవసరమైన సాధనాలూ, పరిస్థితులూ అన్నీ ఉంటాయి. ఆ నగరవాసులు తమ పాలకులనూ, తమ నగరంలోని జీవనాన్ని శాసించే సూత్రాలనూ కూలదోసినప్పుడే ఈ కొత్త నగరం ఉనికిలోకి వస్తుంది. పెట్టుబడిదారీ విధానం అనే నగరంలో పాలకులను పెట్టుబడిదారీ వర్గం అంటారు. లేదా, ఉత్పత్తిని, పంపిణీని, మారకాన్ని సాగించే సాధనాలన్నిటిని సొంతం చేసుకున్నవాళ్లు, అదుపులో ఉంచుకున్న వాళ్లు ఈ వర్గం. వాళ్ల పాలన సాగే ప్రధాన సూత్రం లాభాల పెంపుదల. అసలు కమ్యూనిజం అనే నగరం ఒకటి ఉన్నదనే విషయాన్ని ఈ పెట్టుబడిదారులు చాలా సురక్షితమైన రహస్యంగా కాపాడుతూ వచ్చారు. ఇలా కాపాడడానికి వాళ్లు మైక్ మీద తమ అధికారాన్ని అట్టిపెట్టుకున్నారు. ఎందుకంటే ఈ సమాజంలో ఎవరి మాటలైనా వినబడాలంటే వారి చేతిలో మైక్రోఫోన్ ఉండవలసిందే. ఇది ఉపయోగించుకొని వాళ్లు చేసినదల్లా కమ్యూనిజం అనేది నిజంగా స్వేచ్ఛకు సంబంధించినదని ఎవరూ నేర్చుకోకుండా కట్టుదిట్టం చేశారు. ఈ కమ్యూనిజం అనేది కొన్ని వెనుకబడిన దేశాల్లో ప్రయత్నించారనీ, అక్కడ అది విఫలమైందనీ ఒక అబద్ధాన్ని పదే పదే వినిపిస్తూ, నమ్మించారు.

అయితే ఈ రెండు నగరాల కథలో చెప్పేదానికన్న చాలా ఎక్కువ విషయాలు మార్క్సిజంలో ఉన్నాయి. కాని, ఈ కథ ఎందుకు చెప్పానంటే, మార్క్స్ చెప్పదలచుకున్న విషయంలోని ఏకైక స్వభావాన్ని ఈ కథ కచ్చితంగా ప్రతిఫలిస్తుంది. మార్క్సిజం అనేది పెట్టుబడిదారీ విధానం గురించి మాత్రమే కాదు. కమ్యూనిజం గురించి మాత్రమే కాదు. చరిత్ర గురించి మాత్రమే కాదు. వీటన్నిటి అంతర్గత సంబంధాలను గురించి చెప్పేదే మార్క్సిజం. పెట్టుబడిదారీ విధానం లోపల ఉన్న శక్తులు తమ పూర్తి అభివృద్ధిని సాధించుకొనే పరిణామంగా కమ్యూనిజం ఎలా లేచి నిలుస్తుందో, ఈ పరిణామక్రమపు చరిత్ర అతి ప్రాచీన కాలం నుంచి సుదూరంలో ఉన్న భవిష్యత్తు దాకా ఎలా సాగుతుందో మార్క్సిజం చెపుతుంది. మార్క్స్ నిజంగా అధ్యయనం చేయదలచుకున్న విషయం ఏమిటో కచ్చితంగా తెలియని రచయితలు చాలామంది స్నేహితులైనా, వ్యతిరేకులైనా మార్క్సిజం గురించి రాస్తూ ఆయన చేసిన అధ్యయనాన్ని అర్థం చేసుకోవడంలో పొరపాటు పడ్డారు. ఉదాహరణకు, పెట్టుబడిదారీ విధానం ఎలా పనిచేస్తుందో వర్ణిస్తూ, వివరిస్తూ మార్క్స్ చేసిన రచనలను చూసి, కొందరు రచయితలు మార్క్సిజాన్ని ఒక శాస్త్రంగా పరిగణించారు. పెట్టుబడిదారీ విధానంలోని లోపాలను ఆయన వివరించిన పద్ధతి చూసిన రచయితలు, మార్క్సిజం అంటే ప్రధానంగా పెట్టుబడిదారీ విధానం మీద విమర్శ అని అనుకున్నారు. పెట్టుబడిదారీ విధానంలోనే కమ్యూనిజానికి అవసరమైన శక్తులు నిద్రాణంగా ఉన్నాయని చెపుతూ, అవి ఎలా ఉంటాయో వివరించిన మార్క్స్ రచనలు చూసి మరికొందరు ఆయనను ఒక దూరదృష్టిగల ద్రష్టగా భావించారు. ఇక్కడి నుంచి అక్కడికి వెళ్లే రాజకీయ వ్యూహాన్ని ప్రతిపాదించిన మార్క్స్ రచనలు చూసి మరికొందరు మార్క్సిజం అంటే విప్లవం సాగించడానికి ఉపయోగపడే సిద్ధాంతం అని భావించారు.

శాస్త్రం, విమర్శ, భవిష్యత్ దృష్టి, విప్లవ వ్యూహం – ఈ నాలుగు అంశాలను సాధారణంగా ఒకదానితో మరొకటి సంబంధం లేనివిగా భావించే అభిప్రాయం ఉంది. మరికొందరయితే అవి తార్కికంగా

ఒకదానికొకటి సరిపడనివని కూడ అనుకుంటారు. అందువల్లనే మార్క్సిజం వ్యాఖ్యాతలలో చాలామంది వీటిలో ఒకదాన్నో, రెండు అంశాలనో ఎత్తిపట్టి, మిగిలిన వాటిని విస్మరించడం గానీ, చిన్నచూపు చూడడం గానీ చేశారు. మరికొన్ని సందర్భాలలోనయితే మార్క్స్‌కు స్థిరమైన దృక్పథం లేదని విమర్శించడానికి కూడా ఈ అంశాలను వాడుకున్నారు. అయితే మార్క్స్ రచనలలో ఈ నాలుగు ప్రవాహాలకు ప్రాముఖ్యత ఉన్నదనేందుకు సూచనలు విస్తారంగా ఉన్నాయి. అంతేకాదు, ఈ నాలుగు అంశాలు ఎంతగా ఒకదానితో ఒకటి కలగలిసి ఉన్నాయంటే, ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉన్నాయంటే వాటిలో ఒకదాని నుంచి మరొకదాన్ని విడదీయడం చాలా కష్టం. అందువల్ల నేనేమి అభిప్రాయపడతానంటే మార్క్సిజం అనేది శాస్త్రం, విమర్శ, దూరదృష్టి, విప్లవ వ్యూహం అనే నాలుగు అంశాల అసాధారణ విశిష్ట సమ్మేళనం. అందువల్ల మార్క్స్ స్వయంగా ఒక శాస్త్రవేత్త, ఒక విమర్శకుడు, ఒక ద్రష్ట, ఒక విప్లవకారుడు. ఈ నాలుగు లక్షణాలు ఒకదానికి మరొకటి దోహదం చేసుకుంటాయి. ఒకదాని మీద మరొకటి ఆధారపడతాయి.

అయితే, దీంతో తలెత్తే సమస్యలు ఉన్నాయి. ఇది ఎలా సాధ్యమవుతుంది? కలవడానికి వీలులేదనిపించే విషయాలను ఎవరైనా ఎలా కలపగలరు? ఏకకాలంలో శాస్త్రీయమైనవిగా, విమర్శనాత్మకమైనవిగా, క్రాంతదర్శిగా, విప్లవాత్మకంగా ఉండే సిద్ధాంతాలను రూపొందించడంలో మార్క్స్‌కు సహకరించినదేమిటి? పైన వివరించిన రెండు నగరాల కథను మళ్లీ పరిగణనలోకి తీసుకుంటే, ఈ ప్రశ్నలను మరోరకంగా వేసుకోవాలి. పెట్టుబడిదారీ విధానం లోపలే కమ్యూనిజాన్ని కనిపెట్టడానికి మార్క్స్‌కు ఉపకరించినదేమిటి? పెట్టుబడిదారీ విధానపు విమర్శను, దాన్ని కూలదోసే వ్యూహపు ప్రాతిపదికను ఒకేచోట కనిపెట్టడానికి ఆయనకు ఉపకరించినదేమిటి? ఏ శాస్త్రపు పునాది అయినా సంబంధాలను అన్వేషించడంలోనే ఉంటుంది. ముఖ్యంగా తక్షణమే ప్రత్యక్షంగా కనబడని సంబంధాల అన్వేషణే శాస్త్రం. పెట్టుబడిదారీ విధానాన్ని అధ్యయనం చేయడంలో మార్క్స్ ఉన్నదానికి, ఉండగలదానికి, ఉండకూడనిదానికి, ఈ మొత్తం గురించి చేయగలిగిన దానికి ఉండే సంబంధాలను కనిపెడతాడు. ఆయన ఇదంతా ఎలా కనిపెడతాడంటే, మొట్టమొదట అదంతా అక్కడ ఉంది గనుక. కాని, వాటిని కనిపెట్టడానికి ఆయనకు అవకాశం ఇచ్చేదేమిటి? ఎంతో మంది పెట్టుబడిదారీ విధానాన్ని అధ్యయనం చేసిన విద్యార్థులు కేవలం రూపాల దగ్గరే ఆగిపోయి, వాటికి వాస్తవాలు అనిపేరు పెట్టినప్పుడు మార్క్స్ మరింత లోతుకి ఎలా వెళ్లాడు? ఆయనకు ఆ అవకాశం ఇచ్చినది ఆయన అనుసరించిన గతితార్కిక పద్ధతి. చాలా మంది ఇతరులు వేరు వేరు మానసిక అరలుగా చూసిన అంశాలను కలిపి చూడడానికి ఆయనకు అవకాశం ఇచ్చినది గతితర్కం. ప్రత్యేకంగా చెప్పాలంటే మార్క్స్ అనుసరించినది గతితార్కిక పద్ధతి.

## 2

గతితర్కం ఏదో ఒక రూపంలో ఈ భూగోళం మీద మానవ ప్రాణులు ఉన్నప్పటి నుంచి ఉనికిలోనే ఉంది. ఎందుకంటే మన జీవితాలలో ఎల్లప్పుడూ మార్పు, పరస్పర చర్య అనే ముఖ్యమైన అంశాలు ఇమిడి ఉన్నాయి. మన పర్యావరణాన్ని ఏకమొత్తంగా చూసినప్పుడు దానిలోపల జరిగే ప్రతి విషయం మీద దానికి నిర్ణయాత్మకమైన ప్రభావం ఉంది. అలాగే 'ఇవాళ' అనేది ఎప్పుడు వచ్చినా నిన్న ఉనికిలో ఉన్న వాటి ఆధారంగా మాత్రమే అభివృద్ధి చెందుతుంది. దానిలో నిన్న ఉన్న అవకాశాలతోనే, ఆ అవకాశాలు ఎక్కడికి దారితీయగలవో అక్కడి దాకా మాత్రమే సాగి రేపుగా మారుతుంది. తమ జీవితాల మీద ఈ పరిణామాలు వేయగల సానుకూల ప్రభావాలను అభివృద్ధి చేసుకునే క్రమంలో, ప్రతికూల ప్రభావాలను తగ్గించుకునే క్రమంలో మనుషులు ఎప్పటికప్పుడు తమ చుట్టూ ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో అర్థం చేసుకోవడానికి అవసరమైన భావనలను, ఆలోచనా ధోరణులను రూపొందించుకోవడానికి ప్రయత్నించారు. ఇదంతా కూడా వారు అర్థం చేసుకోగలిగినంత మాత్రమే. అప్పటి పాలకవర్గాలు వారిని అనుమతించ గలిగిన మేరకు మాత్రమే. ఈ క్రమంలో మనుషులు మార్పు, పరస్పర చర్య, ప్రతిచర్య ఎంత విస్తృతమైనవో గుర్తించారు. ప్రతి వ్యవస్థకు దానిలో అంతర్గర్భితమైన భాగాల మీద ఉండే ప్రభావాన్ని గుర్తించారు. (మనలో ప్రతి ఒక్కరం మనలో భాగాలు ఉండే వ్యవస్థగానూ ఉంటాం, ఇతర వ్యవస్థలలో మనం ఒక భాగం అవుతాం). గత, వర్తమాన, భవిష్యత్తుల మధ్య పరస్పర సంబంధాల గొలుసు వ్యవస్థను గుర్తించారు. మానవ జాతి ఈ గుర్తింపును సాధించిన విభిన్న మార్గాలే గతితార్కిక ఆలోచనా పద్ధతి అనే సుసంపన్నమైన, వైవిధ్య భరితమైన సంప్రదాయాన్ని రూపొందించాయి. నిజానికి ఆ గతితార్కిక ఆలోచనా పద్ధతిని సమగ్రంగా అంచనా కట్టడం ఇంకా జరగవలసే ఉంది.

గతితర్కానికి మార్క్స్ రూపం ఒకటి ఉంది. అది తత్వశాస్త్ర స్థాయిలో ఎపిక్యురస్, అరిస్టాటిల్, స్పినోజా, లీబ్‌నిజ్, ముఖ్యంగా హెగెల్ వంటి మహోపాధ్యాయులతో ఆయన పెట్టుకున్న ఘర్షణల నుంచి ఉద్భవించింది. అలాగే అప్పుడప్పుడే పరిణతమవుతున్న పెట్టుబడిదారీ విధానంలో జీవన అనుభవం కూడా ఆయన గతితర్కాన్ని అభివృద్ధి చేసింది. ఇక్కడ ఒక విషయం గుర్తు పెట్టుకోవాలి. పెట్టుబడిదారీ విధానానికి అంతకు ముందరి వర్గ సమాజాలతో స్పష్టమైన తేడా ఉంది. అది అన్ని చిన్నా, పెద్దా జీవన విధులను ఒకే ఒక్క జీవ వ్యవస్థగా మార్చి దానిపైన విలువ సూత్రానికీ, డబ్బు అధికారానికీ పెత్తనం ఇవ్వడంలో మిగిలిన వర్గ సమాజాలకన్న భిన్నమైనది. అంతేకాదు, తాను సాధించిన ఈ మహా విజయాన్ని మరుగు పరచడంలో, దాచిపెట్టడంలో కూడా అది అంతకుముందరి వర్గ సమాజాల కన్న విభిన్నమైనది. పెట్టుబడిదారీ విధానంలో మనిషి మనుగడ ముక్కలు ముక్కలయిపోతుంది. మనిషి సామాజికీకరణ పొందే క్రమం పాక్షిక, ఏకపక్ష స్వభావంతో ఉంటుంది. అందువల్ల పెట్టుబడిదారీ సమాజంలో మనుషులు తమ జీవితాలలోకి ప్రవేశించే విడివిడి ముక్కలమీదనే కేంద్రీకరిస్తారు. వ్యక్తి, ఉద్యోగం, స్థలం వంటి విడి అంశాల మీద శ్రద్ధ ఉంటుంది గాని, వాటి మధ్య సంబంధాలేమిటి, అవి ఏ క్రమంలో ముందుకు సాగుతాయి అనే విషయాలు మరుగున పడతాయి. అంటే, ఈ సంబంధాలలో ఉండే వర్గం, వర్గ పోరాటం, పరాయీకరణ తదితర అంశాల మీద దృష్టి ఉండదు. ఇటీవలి కాలంలో మరీ ముఖ్యంగా సామాజిక శాస్త్రాలన్నీ ఈ ధోరణిని మరింత బలపరిచాయి. సమస్త మానవ జ్ఞానాన్ని ముక్కలు ముక్కలుగా విడగొట్టాయి. ఒకదానితో ఒకటి పోటీ పడే విజ్ఞాన శాస్త్ర అధ్యయనాలుగా, శాఖలుగా మార్చివేశాయి. ప్రతి విజ్ఞానశాస్త్ర శాఖకు ఒక ప్రత్యేకమైన, ఇతరులకు అర్థం కాని

పరిభాషను సృష్టించాయి. ఆ తర్వాత చిన్న చిన్న ముక్కలు తీసుకొని, ఆ ముక్కలను గణాంకాలతో అటూ ఇటూ మార్చగలిగే కసరత్తులు ప్రారంభించాయి. ఈ క్రమంలో ఒక పెద్ద ప్రమాదం జరిగిపోయింది. సమాజంలో జరిగే అన్నీ విషయాలకూ అనుసంధానించి ఉండే మహా క్రమం అయిన పెట్టుబడిదారీ విధానం, ప్రజా జీవితం పై నిరంతరం అతి ఎక్కువ ప్రభావం వేస్తున్న పెట్టుబడిదారీ విధానం దాదాపు కనబడకుండా పోయింది.

పెట్టుబడిదారీ విధానం గురించి మార్క్స్ చేసిన విశ్లేషణను తిరస్కరించే వారిలో చాలామంది ఆ విశ్లేషణతో కేవలం ఏకీభవించకుండా మాత్రమే ఉండరని నాకు తెలుసు. కేవలం అలాగే ఉంటే రాజకీయ చర్చలు జరపడం సులభమే. కాని, వారి సాధారణ స్పందన ఏమంటే, మార్క్స్ అంచనా వేసినటువంటి పెట్టుబడిదారీ విధానం అనేది అసలు లేనే లేదన్నట్టు నటిస్తారు. ఇది చూసినప్పుడల్లా నాకు హార్వే అనే సినిమా గుర్తుకొస్తుంది. అందులో హార్వే ఒక ఆరడుగుల రెండు అంగుళాల అదృశ్య తెల్ల కుందేలు. జిమ్మీ స్టీవార్ట్ ఆ అదృశ్య కుందేలుతో సంభాషిస్తూ ఉంటాడు. ఆయన ఒక్కడు మాత్రమే ఆ కుందేలును చూడగలుగుతాడు. ఆయన చుట్టూ ఉన్నవాళ్లందరికీ ఖాళీ కుర్చీ మాత్రమే కనబడుతుంది. అలాగే, మార్క్స్ గానీ, మార్క్సిస్టులు గానీ పెట్టుబడిదారీ విధానం అన్నప్పుడల్లా వారి పాఠకులలో చాలామంది అది ఎక్కడ కనబడుతుందా అని అటూ ఇటూ చూస్తారు. సరే, పెట్టుబడిదారీ విధానం ఏమీ అదృశ్య కుందేలు కాదు. అయితే, అదే సమయంలో అది తక్షణమే కళ్లముందర కనబడే వస్తువు కూడా కాదు. దాన్ని అర్థం చేసుకోవడం అలా ఉంచి కనీసం చూడాలన్నా మనుషుల శ్రద్ధ కొన్ని సంబంధాల మీదకు మళ్లవలసి వస్తుంది. ఆ సంబంధాల లోని అంశాలు స్పష్టంగా, ప్రత్యక్షంగా కనబడేవి కావు. మరి, పెట్టుబడిదారీ విధానం లోపల జీవించే వారిలో చాలామందికే అది కనబడనప్పుడు దాని పని విధానాన్ని వివరించే ప్రయత్నం ఏదయినా చాలా శ్రమతో, సాధనతో, ప్రయత్నంతో కూడి ఉండవలసి ఉంటుంది. అది ఉన్నదని చూపడానికి, అది ఎటువంటి వస్తువో చూపడానికి చాలా ప్రయత్నించవలసి ఉంటుంది. మార్క్స్ గురించి వెలువడిన సాహిత్యంలో అతి ఎక్కువగా విస్మరించబడిన అంశమేమంటే, మార్క్సిజంలో వివరణ ఎంత ముఖ్యమైనదో, తెలివిడి అంత ముఖ్యమైనది. నిజం చెప్పాలంటే, తెలపడం అనేది జరగకుండా వివరించడం అనేది అసాధ్యం.

పెట్టుబడిదారీ విధానం లోపలి మౌలిక క్రమాలను కలిపి ఉంచే అంతస్సంబంధాల మీద దృష్టి పెట్టడానికి మార్క్స్‌కు వీలు కల్పించినది గతితర్కం అని ఇదివరకే చూశాం. ఆ గతితర్కమే పెట్టుబడిదారీ వ్యవస్థను అంతర్గత క్రమాల సమాహారమైన క్రమంగా ఉనికిలోకి తెస్తుంది. ఆ గతితర్కమే దాన్ని కనబడేటట్టు చేస్తుంది. వివరణ అవసరమైన వాస్తవికమైన విషయంగా తయారుచేస్తుంది. పరస్పరం ఆధారపడిన క్రమాలతో తయారైన ప్రపంచంలో విభిన్న అంశాల మధ్య అంతస్సంబంధాలను అర్థం చేసుకోవాలంటే ఆ అంశాలు ఏ ముందస్తు షరతులకు లోబడి ఉన్నాయో, ఏ భవిష్యత్తు అవకాశాలను కలిగి ఉన్నాయో, ఏ అంశాల చేత ప్రభావితం అవుతున్నాయో, ఏ అంశాలను ప్రభావితం చేస్తున్నాయో అర్థం చేసుకోవలసి ఉంటుంది. అలా అర్థం చేసుకున్నప్పుడు వెలికి వచ్చే క్రమాలు, వివరణ అవసరమైన క్రమాలు మార్క్స్ వివరణలో భాగమయ్యాయి. అవి ఇప్పటిదాకా విడివిడి ప్రపంచాలలో ఉన్న విమర్శ, భవిష్యత్తు దృష్టి, విప్లవం అన్నిటినీ కలగలిపాయి. మార్క్స్ గురించి మనం చెప్పుకున్న రెండు నగరాల కథలో బయట పడిన సంబంధాల విస్తృతిని మళ్లీ ఒకసారి పరిగణనలోకి తీసుకోండి. వైరుధ్యం, అమూర్తీకరణ, సమగ్రత్వం, పరిణామం లాంటి మామూలుగా గందరగోళంగా ఉండే గతితార్కిక నిర్ధారణల సమాహారం ఒకందుకు పనికివస్తుంది. అది విషయాల గురించి జడాత్మకమైన, పాక్షికమైన, ఏకముఖమైన, ఏకపక్షమైన అవగాహనలను రద్దుచేసి ఈ అంతస్సంబంధాలలోని కొంతభాగాన్ని సులభంగా అర్థం చేసు కోవడానికి, వాటితో వ్యవహరించడానికి ఉపయోగపడుతుంది. మార్క్స్ సిద్ధాంతాలన్నీ ఆయన అనుసరించిన ఈ గతితార్కిక దృక్పథంతో, తత్ఫలితమైన నిర్ధారణలతో రూపుదిద్దుకున్నాయి. కనుక ఆ సిద్ధాంతాలను సవ్యంగా అర్థం చేసుకోవాలన్నా, అంచనా కట్టాలన్నా, వినియోగించాలన్నా గతితర్కాన్ని అర్థం చేసుకోవడం ద్వారా మాత్రమే సాధ్యం.

### 3

గతితర్కంతో నా మొదటి సంబంధం నేను నా పిఎచ్.డి. పరిశోధనా పత్రం రాస్తున్నప్పుడు ఏర్పడింది. ఆ పరిశోధనా పత్రం తర్వాతి కాలంలో 'ఎలీనేషన్ : మార్క్స్ కాన్సెప్షన్ ఆఫ్ మాన్ ఇన్ కాపిటలిస్ట్ సొసైటీ' అనే పుస్తకంగా అచ్చయింది. మార్క్స్ రచనలేవీ స్పష్టంగా ఏకపక్షమైనవి కావు. ప్రపంచం నిరంతరం చలనంలో ఉన్నదని వివరించడంలో ఆయన ఎప్పుడూ ఇబ్బంది పడలేదు. వాస్తవ ప్రపంచంలోని విభిన్న అంశాలు, పరస్పర సంబంధంలో, పరస్పర అంతర్గత జోక్యంతో సాగుతున్నాయనీ, అదే సాధారణ సూత్రమనీ, భారీ స్థాయి పరిణామాలు కూడా విరివిగా జరిగేవేననీ ఆయన గుర్తించాడు. ఇదంతా అందరికీ తెలిసిందే. అయితే, అంత స్పష్టంగా తెలియనిదేమంటే, మరీ ముఖ్యంగా నాలాంటి భాషా శాస్త్ర – తత్వశాస్త్ర పరిశోధక యువ విద్యార్థికి తెలియనిదేమంటే ఈ ప్రపంచ చిత్రాన్ని వివరించడానికి మార్క్స్ ఉపయోగించిన భావనలేమిటనేదే. మార్క్స్ ఎప్పుడూ, దేన్నీ నిర్వచించలేదు. నిర్వచనాలు లేని స్థితిలో ఆయన సాధారణంగా చెప్పిన విషయాలను అర్థం చేసుకోవడం పెద్ద కష్టం కాకపోయినప్పటికీ, ఏదైనా ఒక విషయం మీద కచ్చితంగా, నిర్దిష్టంగా కేంద్రీకరించాలనే నా శిక్షణ ప్రకారం చూసినప్పుడు మాత్రం నిర్వచనాలు దొరికేవి కావు. మార్క్స్ తన రచనలలో ఉపయోగించిన మౌలిక భావనలను బట్టి నా సొంత నిర్వచనాలను నేను తయారు చేసుకోవడానికి ప్రయత్నించినప్పుడు నాకు దిగ్భ్రాంతి కలిగింది. ఆయన ఉపయోగించిన మౌలిక భావనల అర్థాలు సందర్భం నుంచి గణనీయంగా, విభిన్నంగా ఉన్నాయి. అయితే మార్క్స్ ఉద్దేశించిన అర్థాల వ్యాకోచ స్వభావాన్ని గుర్తించి దిగ్భ్రాంతి చెందిన వారిలో నేను మొదటివాణ్ని కాను. చాలాకాలం కిందనే ఇటాలియన్ సామాజిక శాస్త్రవేత్త విల్‌ఫ్రెడో పారెటో ఒక ప్రామాణిక వ్యాఖ్య చేశాడు : 'మార్క్స్ ఉపయోగించిన పదాలు గబ్బిలాల వంటివి. వాటిని కొందరు పక్షులనుకుంటారు, మరికొందరు ఎలుకలనుకుంటారు'.

మరి ఈ సమస్యను గుర్తించిన తర్వాత మనం చేయగలిగిందేమిటి? 1) ఈ సమస్యను విస్మరించవచ్చు. 2) చాలా సందర్భాలలో మార్క్స్ ఉద్దేశించినదేమిటో, లేదా, ఉద్దేశించినట్టు కనబడుతున్నదేమిటో అర్థం చేసుకోవచ్చు. లేదా, అతి ముఖ్యమైన

సందర్భమని మనం అనుకుంటున్న సందర్భంలో ఆయన ఉద్దేశించిన అర్థం ఏమిటో కనిపెట్టి ఒక ప్రత్యేక భావనతో మార్క్స్ నిజంగా ఏమి ఉద్దేశించాడో అర్థం చేసుకోవచ్చు. 3) మార్క్స్‌లో మనకు కనబడే ఈ సందిగ్ధతను ఒక ఆయుధంగా వాడి మార్క్స్ మీద విరుచుకుపడొచ్చు. ఆయన గందరగోళంగా రాశాడనీ, తెలివితక్కువగా రాశాడనీ, నిజాయితీ లేకుండా రాశాడనీ విమర్శించవచ్చు. లేదా, 4) మార్క్స్ ప్రాపంచిక దృక్పథంలోనే ఆ భావనలకు ఒక వివరణ ఏమన్నా ఉన్నదా వెతకవచ్చు. ఆ భాషకూ, ఆ అర్థాలకూ ఆ ప్రాపంచిక దృక్పథంలో ఉన్న స్థానాన్ని కనిపెట్టవచ్చు. మార్క్స్ భాషా ప్రయోగాల గురించి ఆలోచిస్తూ నేను ఎంత సమయం వెచ్చించానంటే, నేను గుర్తించిన వాటిని విస్మరించ లేకపోయాను. ఆయన భావనల్లోని ప్రధాన అర్థం ఇది అని ఒకదాన్ని వేరుచేయగలిగే అవకాశం ఉన్నప్పటికీ మరెన్నో అర్థాలు లెక్కలోకి రాకుండా పోయాయి. ఈ ఇబ్బంది ఉన్నప్పటికీ మార్క్స్‌ను గందరగోళపు రచయిత అనో, అజాగ్రత్తతో రాశాడనో నేను కొట్టివేయలేక పోయాను. ఇక మిగిలిన అవకాశం ఆయన ప్రాపంచిక దృక్పథం ఏమిటో పరిశోధించడం. బహుశా ఆ ప్రాపంచిక దృక్పథమే ఆయన చేత అటువంటి భాష ఉపయోగింపజేసిందని గుర్తించి దాన్ని అర్థం చేసుకోవడం.

నేను ఆ మార్గం అవలంబించాను. త్వరలోనే అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం అనేదానికి చేరుకున్నాను. అది హెగెల్ దగ్గర నేర్చుకున్న వాటిలో మార్క్స్‌లో మిగిలిపోయిన అంశం. దాని ప్రకారం ఒక వస్తువును అర్థం చేసుకోవాలంటే దాని ఉనికికి కారణమయిన సంబంధాలను అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఆ సంబంధాలలో ఏదయినా ఒక గణనీయమైన మార్పు జరిగితే ఆ సంబంధాలు భాగమయిన మొత్తం వ్యవస్థే గుణాత్మకమయిన మార్పు పొందుతుందని అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఈ దృష్టి ప్రకారం వాస్తవికతను నిర్మించే మౌలిక నిర్మాణ అంశాలు వస్తువులు కాదు, వాటి మధ్య సంబంధాలు. ఏ సంబంధాన్ని గురించి మనం మాట్లాడుతున్నాం అనేదాన్ని బట్టి వాస్తవికత అనే భావన మారుతూ కూడా ఉండవచ్చు. పారెటో అద్భుతంగా వ్యాఖ్యానించిన వైచిత్రికి మూలం ఇక్కడే ఉందా? ఆలోచించగా నాకేమనిపించిందంటే మార్క్స్ గతితర్కం గురించి ఇప్పటికే వెలువడిన విస్తృత సాహిత్యంలో ఈ అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం అనేది సాపేక్షికంగా, అతితక్కువగా ఆలోచించబడింది. జార్జ్ లూకాస్, జీన్ పాల్‌సార్త్రే, హెన్రీ లెఫెబెవర్, కారెల్ కొసెక్, లూసియన్ గోల్డ్‌మెన్, హెర్బర్ట్ మార్క్యూస్ వంటి మార్క్స్‌పై వ్యాఖ్యానించిన ప్రధాన రచయితలు అందరూ కూడా హెగెల్ భావవాదాన్ని మార్క్స్ ఎలా తిరస్కరించాడో గుర్తించారు. ఆ తిరస్కరణలో భాగంగా ఆయన అంతర్గత సంబంధాల తత్వశాస్త్రాన్ని తిరస్కరించలేదనీ గుర్తించారు. కాని, మార్క్స్ వాడిన భాషలోని అసాధారణత్వానికి ఒక పునాదిగా ఈ గతితార్కిక వ్యాఖ్యానం ఉన్నదని వారు గుర్తించలేదు. ఆ పని నేను చేశాను.

అయితే, నా ఎలీనేషన్ పుస్తకంలో ప్రధాన లక్ష్యం మానవ స్వభావం గురించి, పరాయీకరణ గురించి చెప్పిన విషయాలను అర్థం చేసుకోవడంలో మార్క్స్ గతితర్కాన్ని పునర్నిర్మించడమే, ఒక ప్రత్యేక సిద్ధాంతాన్ని వివరించడానికి ఉపయోగపడినదేమిటి అని చర్చించడమే. ఆ సిద్ధాంతానికి ఆయన చేరిన మార్గం ఏమిటి అని వివరించడం కాదు. అంతేకాదు, సమాజాన్ని అధ్యయనం చేయడంలో మార్క్స్ పద్ధతిలో ఇమిడి ఉన్న ఇతర అంశాల గురించి ప్రజలకు తెలియజెప్పడం కాదు. అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం అనేది ఒక తత్వశాస్త్రమే. అది ప్రపంచాన్ని పరిశోధించే ఒక ప్రత్యేక పద్ధతిని సూచిస్తుంది. వీలుకల్పిస్తుంది. ఆ పరిశోధనలో కనిపెట్టిన అంశాలను సమీకరించడానికీ, వివరణ ఇవ్వడానికీ ఉపయోగపడుతుంది. కాని ఆ సంవిధానాన్ని తగినంతగా అర్థం చేసుకోవాలంటే, ఆ గతితర్కంలోని ఇతర అంశాలను, ముఖ్యంగా, అమూర్తీకరణ క్రమం అనే అంశాన్ని చాలా శ్రద్ధగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం మార్క్స్ తాత్విక చింతనలోంచి మారని నిశ్చల అంశాలను రద్దు చేస్తుంది. ప్రపంచం నిశ్చల భాగాలతో లేదని అది మనకు విశదం చేస్తుంది. ఆ తర్వాత అమూర్తీకరణ అనే ఆలోచనా క్రమం సహాయంతో మార్క్స్ ప్రపంచంలోని అంతర్గత సంబంధాల మధ్య కొన్ని తాత్కాలిక సరిహద్దులు గీస్తాడు. ఆ సరిహద్దుల ద్వారా మనం మన అధ్యయనానికి అవసరమైన చిన్న ముక్కల మీద కేంద్రీకరించగలుగుతాం. ఆ ముక్కలలోపల కూడా మార్పుకూ, పరస్పర చర్యకూ వీలు కల్పించే గణనీయమైన అంశాలను భాగం చేసే శ్రద్ధ తీసుకుంటాడు. ఆ విధంగా ఏ ప్రత్యేక అంశం గురించి అధ్యయనం చేయాలని తాను అనుకుంటున్నాడో దాని మీద మన కేంద్రీకరణకు వీలుకల్పిస్తాడు. ఆ పరిశోధనా ఫలితంగా వెలువడిన నిర్ధారణలు మార్క్సిజం సిద్ధాంతాలుగా రూపొందాయి. అవన్నీ ఈ ప్రాథమిక అమూర్తీకరణల ముద్రను కలిగి ఉంటాయి. అందువల్లనే, మార్క్సిజం మీద నేను ఆ తర్వాత రాసిన ప్రధాన రచన అయిన 'డయలెక్టికల్ ఇన్వెస్టిగేషన్స్'లో అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం స్థానాన్ని మార్క్స్ అమూర్తీకరణ క్రమం గురించి వివరించడానికి ఇచ్చాను. ఈ రెండిటినీ కలిపి చూడవలసి ఉంది. అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం, అమూర్తీకరణ క్రమం రెండూ కలిసి గతితర్కం గురించి నా అవగాహనలో ప్రధాన, ప్రత్యేక పాత్ర వహిస్తాయి. పెట్టుబడిదారీ విధానాన్ని, అందులోని భాగాలను అధ్యయనం చేయడానికి, మార్క్స్ సాధించిన విజయాలను అర్థం చేసుకోవడానికి, వాటిని మరింత మెరుగుగా ఉపయోగించుకోవడానికి ప్రస్తుతం జరుగుతున్న ప్రయత్నాలను ముందుకు తీసుకుపోవడానికి నా అవగాహన ఉపయోగపడుతుందనుకుంటున్నాను.

ఇటీవలి సంవత్సరాలలో గతితర్కాన్ని అధ్యయనం చేయాలనే ఆసక్తి కొంత పునర్వికసించింది. మార్క్స్ చేసిన ఇతర సిద్ధాంతాలను పరిశీలించడానికి కూడ గతితర్కం ఒక మెరుగైన దృక్పథాన్ని అందిస్తుందని అంతకంతకూ ఎక్కువ మంది మార్క్సిస్ట్ రచయితలు ఆలోచిస్తున్నారు. కొంతమంది ప్రపంచీకరణ అని పిలుస్తున్న పెట్టుబడిదారీ విధానపు ఇటీవలి దశ, సోవియట్ యూనియన్ పతనం ఈ రచయితలలో చాలామందిని ఈ పరిణామాలను అర్థం చేసుకోవడానికి ఉపయోగపడే సంవిధానం ఏమిటనే స్థితికి చేర్చాయి. తత్ఫలితంగా ఇవాళ ప్రత్యేకించి ఆంగ్లో సాక్సన్ ప్రపంచంలో మార్క్సిస్ట్ పరిశోధనకూ, చర్చకూ పునాదిగా ఉన్న సజీవమైన ప్రాంతాలలో గతితార్కిక పద్ధతి ఒకటి. (ఈ చర్చలో పాల్గొంటున్న వారిలో ముఖ్యంగా చెప్పవలసిన పేర్లు డేవిడ్ హార్వే, రిచర్డ్ లెవిన్, రిచర్డ్ లెవొంటిన్, ఫ్రెడరిక్ జేమ్‌సన్, ఇస్త్వాన్ మెస్జరోస్, ఎన్రిక్ డస్సెల్, రైఫాస్టో, మైకెల్ లూయీ, లూసియన్ సివీ, జింద్రిచ్ జెలినీ, టామ్ సెకిన్, డిరెక్ సేయర్, ఆంటోనియో నెగ్రి, ఆండ్రూ సేయర్స్, ఎర్విన్ మార్క్విట్, సీన్ సేయర్స్,

మార్టిన్ జె, స్కాట్ వారెన్, కొస్మాస్ సైకొపెడిస్, జోవాకిన్ ఇజ్రాయెల్, క్రిస్టొఫర్ ఆర్థర్, టోనీ స్మిత్, జొసెఫ్ ఓమాలి, రాయ్ భాస్కర్, మిల్టన్ ఫిస్క్, జొసెఫ్ ఫ్రాచ్యా, జాన్ ఎలిస్, టెరెల్ కార్వర్, రాబ్ బీనిష్, రొసలిన్ బొరోగ్, జార్జ్ ఇ మెకార్తీ, రాబర్ట్ ఆల్బ్రిటన్, జాన్ రీస్, కారల్ గౌల్డ్, డేవిడ్ హిలెల్ రూబిన్, జొసెఫ్ మెకార్నీ, ఇరా గొలోబిన్, హొవర్డ్ షెర్మన్, నాన్సీ హొట్సాక్, పాల్ డీసింగ్, గుగ్లీమో కార్చెడి, పాట్రిక్ ముర్రే, ఫ్రెడ్ మొస్లీ, పాల్ మాటిక్, కెవిన్ ఆండర్సన్, మైకెల్ ఎ లెబోవిచ్, స్టీఫెన్ ఎ లెస్నిక్, రిచర్డ్ డి ఓల్ఫ్, సుసాన్ బక్‌మార్స్, రొనాల్డ్ జె హొర్వ్వార్ట్, కెనెత్ డి గిబ్సన్, ఎస్ పాట్రిక్ పెరిటోర్, గ్రాహం ప్రీస్ట్, జె డబ్ల్యు ఫ్రీబర్గ్, పాల్ పొలచీ, బిల్ లివాండ్, పీటర్ స్కిలమన్, మార్టిన్ నికొలస్, సిమియన్ స్కాట్, పాల్ స్వీజీ).

ఈ పరిణామాల ఫలితాలు విశాల విశ్వవిద్యాలయాలలోకి ఇప్పుడిప్పుడే ప్రవేశిస్తున్నాయి. ఇంతకాలమూ మార్క్సిస్టేతర ఆలోచనా పరులు సాంప్రదాయికంగా విస్మరిస్తూ వచ్చిన మార్క్సిస్ట్ గతితర్కం గురించిన చర్చ ఇకముందయినా ప్రధాన స్రవంతి మేధావుల మధ్య జరగబోతుందని ఆశించవచ్చునా? అటువంటి చర్చను సాధ్యం చేయాలనే బలమైన కోరికతోనే నేను గతితర్కం మీద నా చర్చను సాగిస్తూ వస్తున్నాను.

ఈ పుస్తకంలో అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం గురించి నా సంపూర్ణమైన వివరణను, చర్చను 2, 3, 4 అధ్యాయాలలో వివరించాను. మొదటి అధ్యాయం మొత్తం విషయం గురించి ఒక విహంగ వీక్షణం చేస్తుంది. ఈ పుస్తకంలో అతి సుదీర్ఘమైనది, బహుశా అతి ముఖ్యమైనది అయిన 5వ అధ్యాయం మార్క్స్ అనుసరించిన అమూర్తీకరణ క్రమం గురించి వివరిస్తుంది. దానికీ అంతర్గత సంబంధాల తత్వశాస్త్రానికీ ఉన్న సజీవ సంబంధం ఏమిటో చూపుతుంది. ఈ పద్ధతిని ఉపయోగించి మార్క్స్ గతానికీ, వర్తమానానికీ మధ్య ఉన్న అంతర్గత సంబంధాన్ని ఎలా అధ్యయనం చేశాడో అధ్యాయం 6 వివరిస్తుంది. అంతర్గత సంబంధాల తత్వశాస్త్రానికి నిబద్ధుడైన మార్క్స్ పరిశోధనా పద్ధతిని, వివరణా పద్ధతిని అధ్యాయం 7 వివరిస్తుంది. దీన్ని కొనసాగిస్తూ మార్క్స్ సంవిధానంలోని విభిన్న అంశాలను వివరించి, మొత్తంగా పెట్టుబడిదారీ వ్యవస్థ గురించిన అవగాహనకు చేరడానికి మార్క్స్‌కు ఈ సంవిధానం ఎలా ఉపయోగపడిందో అధ్యాయం 8 వివరిస్తుంది. వర్తమానానికీ, భవిష్యత్తు కమ్యూనిస్టు సమాజానికీ మధ్య అంతర్గత సంబంధాన్ని అధ్యయనం చేయడంలో గతితార్కిక సంవిధానం ఎలా ఉపయోగ పడుతుందో వివరిస్తూ అంతకు ముందరి అధ్యాయాల సారాంశాన్ని అధ్యాయం 9 ఇస్తుంది. ఈ అధ్యాయంలోనే మార్క్స్ తన రెండు నగరాల కథను నిర్మించడానికి ఉపయోగించిన కట్టుబడిని అర్థం చేసుకునే సూచనలు ఉంటాయి. గతితార్కిక ఆలోచనా పద్ధతి గురించి ఇటీవల ప్రముఖమైన రెండు ఆలోచనా స్రవంతులు – క్రిటికల్ రియలిజం, సిస్టమెటిక్ డయలెక్టిక్స్‌లతో మార్క్స్ సంవిధానం గురించి నా వ్యాఖ్యానాన్ని పోల్చి చూపడానికి అధ్యాయం 10, 11లలో ప్రయత్నించాను. చిట్ట చివరిగా, జపాన్ వ్యవస్థలోని విలక్షణమైన అంశాలను విశ్లేషించడానికి మార్క్స్ గతితార్కిక సంవిధానంలోని కొన్ని అంశాలను ఎలా వినియోగించవచ్చునో ఒక ప్రత్యేక అధ్యయనాన్ని అధ్యాయం 12లో చేశాను.

నేను గతంలో రాసిన వ్యాసాలు, పుస్తకాలలోని అధ్యాయాలు, గణనీయంగా సవరించబడి ఈ పుస్తకంలో చేరాయి. ఇవన్నీ నేను గత ముప్పై సంవత్సరాలలో రాసినవి. గతితర్కం మీద నా జీవితం పొడవునా సాగిన కృషిలోని మేలయిన ఆలోచనలివి. ఇవన్నీ ఒకదాని తర్వాత ఒకటిగా ఒకే పుస్తకంలోని అధ్యాయాలుగా కనబడడానికి కారణమేమంటే ఈ ఆలోచనలన్నీ నేను ఎలీనేషన్ మీద పనిచేస్తున్నప్పుడే రూపొందాయి. ఆ తర్వాత కాలంలో నా మౌలిక ఆలోచనల్లో చిన్న చిన్న మార్పులు మాత్రమే జరిగాయి. అందువల్లనే ఈ పుస్తకంలో అక్కడక్కడ కొన్ని అధ్యాయాలలో పునరుక్తి కనబడుతుంది. చాలామంది పాఠకులకి తత్వశాస్త్రంతో అంత పరిచయం లేకపోవడం, తత్వశాస్త్రాన్ని అన్వయించు కోవడంలో ఉండే ఇబ్బందులు దృష్టిలో పెట్టుకొని, అంతర్గత సంబంధాల గురించి, అమూర్తీకరణ సాగించే క్రమం గురించి మళ్లీ మళ్లీ చెప్పవలసి వచ్చింది. ఇది ఒక ముఖ్యమైన శిక్షణా కర్తవ్యాన్ని నిర్వహించడానికే అనుకుంటాను. మార్క్స్ గతితార్కిక సంవిధానాన్ని ఎలా వినియోగించాలో నేర్చుకోవడం, ముఖ్యంగా, దాని మీద పట్టు సాధించడం జరగాలంటే దేని గురించయినా మనం ఆలోచించే పద్ధతిలోనే విప్లవాత్మకమైన మౌలిక మార్పు జరగవలసి ఉంటుంది. అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం అనేది ఈ మార్పు క్రమంలో అతి కీలకమైన, అవసరమైన అడుగు.

చివరిగా, ఫ్రెడరిక్ ఎంగెల్స్ పాత్ర గురించి ఒక మాట చెప్పాలి. మార్క్స్, ఎంగెల్స్‌ల మధ్య సాగిన అసాధారణమైన, విశిష్టమైన మేధో భాగస్వామ్యం ఎంత అపురూపమైనదంటే, దాదాపు ఒక శతాబ్దం పాటు, శతాబ్దం పైగా మార్క్సిజానికి సంబంధించిన అన్ని సిద్ధాంతాల విషయంలోను మార్క్స్‌కు సమానమైన వ్యాఖ్యాతగా ఎంగెల్స్‌ను గుర్తించడం జరిగింది. అయితే ఇటీవలి దశాబ్దాలలో కొంతమంది పరిశోధకులు ఈ ఇద్దరి మధ్యా ముఖ్యమైన ఆలోచనాపరమైన తేడాలున్నాయనీ, మరీ ముఖ్యంగా గతితర్కం గురించి వారు ఒకే రకంగా ఆలోచించలేదనీ అభిప్రాయపడుతున్నారు. నేను ఈ అభిప్రాయంతో ఏకీభవించను. అందుకు కారణాలను ఎలీనేషన్ పుస్తకంలో వివరంగానే చర్చించాను. అయితే, నా వివరణలో నేను మార్క్స్ ఉటంకింపులను ఉపయోగించినంత విస్తృతంగా ఎంగెల్స్ ఉటంకింపులను ఉపయోగించ లేదు. అంతర్గత సంబంధాల తత్వశాస్త్రం, అమూర్తీకరణ క్రమం అనే రెండు గతితార్కిక పార్శ్వాల విషయంలోనూ నా ఆధారాలన్నీ మార్క్స్ నుంచే తీసుకున్నాను. అయితే, మార్క్సిజాన్ని గానీ, మార్క్సిస్ట్ గతితర్కాన్ని గానీ వ్యాఖ్యానించేటప్పుడు ఎంగెల్స్ రచనలు ఎంతగానో ఉపయోగ పడతాయని అనడంలో నాకు ఏ సందేహమూ లేదు. పాఠకులు కూడా అలా ఉపయోగించుకోవచ్చునని నేను అనుకుంటాను.

*(న్యూయార్క్ విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్రంలో ప్రొఫెసర్‌గా ఉన్న బెర్టెల్ ఓల్‌మన్ ఎలీనేషన్ : మార్క్స్ కాన్సెప్షన్ ఆఫ్ మాన్ ఇన్ కాపిటలిస్ట్ సొసైటీ (1976), సోషల్ అండ్ సెక్సువల్ రెవల్యూషన్ (1979), డయలెక్టికల్ ఇన్వెస్టిగేషన్స్ (1993), మార్కెట్ సోషలిజం : ది డిబేట్ అమాంగ్ సోషలిస్ట్స్ (1998) వంటి గ్రంథాలు, ఎన్నో వ్యాసాలు రాశారు. 2003లో ప్రచురించిన 'డాన్స్ ఆఫ్ ది డయలెక్టిక్ – స్టెప్స్ ఇన్ మార్క్స్ మెథడ్' పుస్తకం ఉపోద్ఘాతానికి అనువాదం)*

*ఆహార సేకరణలో భాగంగా నడిచే, వేట కోసం రాతి పనిముట్లు తయారు చేసుకునే క్రమంలోనే మనిషి మెదడులోనూ, అవయవాలలోనూ అభివృద్ధి జరిగిందంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# తొలి మానవుల మనోవికాసం

మతాలూ, నమ్మకాలూ పుట్టుకురావడానికి మునుపు మనుషుల ఆలోచనలు స్పష్టతను సంతరించు కోవడానికి లక్షల సంవత్సరాల ఎదుగుదల అవసరమయింది. నరవానరాలకూ, మనుషులకూ తేడాలు ఒక్కసారిగా తలెత్తలేదు. అతినింపాదిగా జరిగిన ఈ పరిణామం మనుషులను క్రమంగా తక్కిన జంతువులనుంచి వేరుచేసింది. తత్ఫలితంగా కొన్ని ముఖ్యమైన వ్యత్యాసాలు ఏర్పడసాగాయి. జంతువుల్లాగా కాకుండా మనిషికి భావప్రపంచం అనేది ఒకటుంటుంది. దీనికి కారణం మనిషి మెదడులో జరిగిన అభివృద్ధి. మనిషికి రెండుకాళ్ల నడక అలవాటై, చేతులకు 'స్వేచ్ఛ" లభించడంతో బుద్ధివికాసం మొదలైందని శాస్త్రవేత్తలు ప్రతిపాదించారు. ఇందులో 'ఆధ్యాత్మికశక్తుల' ప్రమేయం లేకపోవడమే కాదు, అతి సామాన్యమైన భౌతికకారణాలే ప్రేరణలుగా పనిచేశాయి.


ఆస్ట్రలోపితెకస్ జాతి

మానవజాతి ఆవిర్భావానికి తొలి దశలో ఆఫ్రికాలో సుమారుగా 50 లక్షల ఏళ్ల క్రితం ఆస్ట్రలోపితెకస్ అనే జాతి ఒకటి ఏర్పడిందనీ, రెండుకాళ్లతో నడిచిన తొలి ప్రాణులు ఆ జాతివారేననీ శాస్త్రవేత్తలు ప్రతిపాదిస్తున్నారు. ఆ తరవాత చాలా కాలానికి అసలుసిసలు ఆధునికులనదగిన హోమోసేపియన్స్ అనే మానవజాతి పుట్టి 2 లక్షల సంవత్సరాలు మాత్రమే అయి ఉంటుందని వారి ఊహ.

సుదీర్ఘమైన ఈ వ్యవధిలో నరవానర దశను దాటిన మానవులకు మరే ప్రాణికీ లేని అనేక ప్రత్యేక లక్షణాలు ఏర్పడ్డాయి. వాతావరణం చల్లబడి, వానలుతగ్గి, వృక్షసంపద ఒక్కసారిగా క్షీణించడంతో చెట్ల చాటు కరువైన ఈ జాతివారికి రెండుకాళ్లమీద నడవడం, ప్రాణరక్షణకై పరిగెత్తడం, మైదానాల్లో ఎత్తుగా పెరిగిన రెల్లుపొదల్లో నిలబడి పొంచి ఉన్న క్రూర మృగాల జాడను పసికట్టి ప్రాణాలు దక్కించు కోవడం వగైరాలన్నీ నిత్యజీవితంలో భాగాలైపోయాయి. ఈ క్రమంలోనే ముందుకాళ్లు రెండూ చేతులుగా మారిపోయి మెదడులో అపూర్వమైన అభివృద్ధికి ప్రేరణనిచ్చాయి. ఇటువంటి మార్పులు ఇతర ప్రాణుల్లో కలగలేదు. వీరికి దాయాదులనదగిన తోకలేని వాలిడికోతులూ, మానవులుగా పరిణ మించజాలని (పేరు తెలియని) ఎన్నో నరవానరజాతులూ చెట్లలోనే ఉంటూ అప్పట్లో కొన్ని ప్రాంతాలకే పరిమితమై ఉండిపోవడంతో అవి ఈ రకమైన ఒత్తిడికి గురికాలేదు. ఉన్న శరీరలక్షణాలు పరిసరాలకు అనువైనవిగా ఉన్నంతకాలమూ వాటిలో మార్పు కలగకపోవడం జీవపరిణామపు లక్షణం కనక అవన్నీ కొద్దిపాటి మార్పులతో కొనసాగాయి.

ఆహారం కరువైన పరిస్థితిలో ఆస్ట్రలోపితెకస్ జాతివారు జంతువుల కళేబరాలను తినడం అలవాటు చేసుకున్నారు. అప్పట్లో వారికి వేటాడటం తెలియదు కనక అవన్నీ క్రూరమృగాలు తినగా మిగిలినవీ, ఇతరత్రా లభిస్తున్నవీ అయి ఉండేవి. అందువల్ల వారికి ప్రోటీన్లూ, పోషక పదార్థాలూ లభించి వారి జాతి వృద్ధి చెందసాగింది. ఈ ఆహారాన్వేషణలో చిన్నచిన్న రాతిముక్కలతో ఎముకలనుంచి మాంసాన్ని పీక్కుతినడానికి వీలుగా ఉండేది. క్రమంగా వారే చేతులతో రాళ్లను చెక్కి పనిముట్లను తయారుచేసుకోసాగారు. చేతులనేవి ప్రత్యేక అవయవాలుగా రూపొందినది ఒక్క మానవజాతికే. వారి మెదడులోనూ, అవయవాల్లోనూ అభివృద్ధి కలగడానికి అదే కారణమయింది.

ఒక్క రాతిపనిముట్ల తయారీనే తీసుకుంటే అది నరవానరానికి ఎంత క్లిష్టమైన సమస్యో అర్థం చేసుకోవచ్చు. మొదటిది అటువంటి పరికరం అవసరమనీ, భవిష్యత్తులో వాడవలసి వస్తుందనీ అనిపించడం. తరవాత దాని తయారీకి సరిపోయే రాళ్ల గురించి ఆలోచించి, వాటికై వెతకడం. పనికొచ్చే శిలను ఒక చేత్తో పట్టుకుని మరొకచేత్తో దాన్ని గట్టి రాతితో చెక్కడం. ఒదుపుగా చెక్కి, దానికి పిడినీ, పదునైన అంచునూ తయారుచెయ్యడం. వీటిలో ప్రతి ఒక్క చర్యా మెదడును ఎంతో అభివృద్ధిపరిచి ఉండాలి. అంతేకాదు, ఈ పరికరాలవల్ల ప్రాణులకు మేలైన ఆహారం లభించి, వాటి సంతతి వృద్ధిచెంది ఉంటుంది. వాటిలో బుద్ధిహీనులకు మరణమే ప్రాప్తించి ఉంటుంది. ప్రకృతిలో ఉత్పాతాలూ, క్రమంగా కలిగిన ప్రతికూలమార్పులూ ఈ ప్రాణులను కూటి కోసమే కోటి విద్యలూ అన్న పద్ధతిలో ముందుకు నెట్టాయి. తల వెనకాల కాంతి చక్రం తిరుగుతున్న ఏ దేవుడూ వారిని కాపాడలేదు. చావుతప్పి, కన్ను లొట్టపోయినట్టు లక్షల సంవత్సరాలపాటు జరిగిన ఈ పరిణామక్రమంలో చచ్చినవి చావగా మిగిలిన జీవాలు మెరుగైన తెలివితేటలు సంపాదించుకుని తమ సంతానాన్ని నిలుపుకోగలిగాయి.

మెదడూ, శరీరలక్షణాలూ ఎప్పటికప్పుడు మారుతూ, ఒకదాన్నొకటి ప్రభావితం చేసుకుంటూ పరిణామాలని ముందుకు

నెట్టాయి. గుంపులుగా, తెగలుగా ఏర్పడి, కలిసి వేటాడుతూ, కలిసి జీవిస్తూ కొనసాగిన ఆదిమానవులకు జంతువుల స్థాయిలో కూతలూ, కేకలతో సరిపోలేదు. భాష అవసరమయింది. అవసరమే కాదు, కొన్ని పరిస్థితుల్లో అది చావుబతుకుల సమస్య అయి ఉండాలి. అందుకనే మనకు భాష ఒక సంప్రదాయంగా దక్కింది. దానితో బాటు నాగరికతా, మతాలూ అన్నీ వచ్చాయి. గమనించవలసింది ఏమిటంటే ఇవన్నీ జన్యుపరంగా రాలేదు. బాహ్య పరిస్థితుల ఒత్తిడివల్ల పుట్టుకొచ్చాయి. ఇటువంటి కష్టాలు పడని నరవానరాలన్నీ మనకు అంత భిన్నమైనవి కాకపోయినా వీటిలో ఏ ఒక్క ప్రత్యేకతనూ సాధించలేకపోయాయి. ప్రకృతినీ, ప్రపంచాన్నీ అవగాహన చేసుకుంటూ ఉండవలిసిరావడం మనిషిజాతికి మాత్రమే తప్పనిసరిగా పరిణమించింది. కోతి తరహా బతుకునుంచి వేరు పడ్డాక మనిషికిక "వెనుతిరిగే" అవకాశమే లేదు.

మనిషికి ప్రపంచాన్ని గురించి అవగాహన మొదలైన ప్రాచీనయుగంలో మెదడు పూర్తిగా ఎదగలేదనేది తెలిసినదే. బతకడమే కష్టంగా అనిపించిన ఆ తొలి యుగాల్లో మనుషులు ప్రకృతిని అర్థం చేసుకోవడానికి తమకున్న పరిమితమైన అవగాహనతో ప్రయత్నాలు చేశారు. ఎందుకంటే ప్రకృతి శక్తులదే పైచెయ్యిగా, ఒక్కొక్కప్పుడు ప్రాణాంతకంగాకూడా ఉండేది. చిన్నచిన్న సముదాయాలుగా జీవిస్తూ, ఒకరిపై ఒకరు ఆధారపడుతూ, తమ అనుభవాలను పోగుచేసుకుని తరవాతి తరాలకు అందిస్తూ వచ్చారు. అనుభవమే ఆచరణకు ఆధారమైంది. జంతువుల్లాగా ఎప్పటికప్పుడు ఎదురయే పరిస్థితులకు స్పందించడంతో ఊరుకోకుండా, జరిగిన, జరగబోతున్న విషయాలను గురించి కూడా ఆలోచించగలగడం మనిషిజాతికి మాత్రమే పరిమితమైన ఒక కొత్త లక్షణంగా రూపొందసాగింది. ఈ పరిణామాలవల్ల కళ్లకు కనబడుతున్న వస్తుగతమైన యదార్థతతో సంబంధం లేకుండా, కేవలం మనసులో పుట్టుకొచ్చి, అవ్యక్తమూ, అమూర్తమూ అనిపించే నైరూప్య భావాలు మనుషుల ఊహల్లో మెదలసాగాయి. ఇటువంటి 'భావప్రపంచం'లోకి అడుగుపెట్టిన మానవజాతికిక తిరుగులేకుండా పోయింది. మొదట్లో ఇటువంటి "అసాధారణ" శక్తులు రోజువారీ జీవితానికి ఉపయోగపడ్డాయి.

గుంపులుగా చేరి వేటాడసాగిన తొలి మానవులు పథకం ప్రకారంగా తమకన్నా ఎన్నోరెట్లు పెద్దవైన జడల ఏనుగులనూ, పెద్ద ఎలుగు బంట్లవంటి క్రూర మృగాలనూ మాట్లువేసి పట్టుకుని



స్విట్జర్లండ్‌లోని సొలూత్రే ప్రాంతం


గుర్రాలను తరిమి చంపిన ఊహాచిత్రం

చంపగలిగారు. కొంతవరకూ ఇవన్నీ ఇతర జంతువులుకూడా చెయ్యగలవు. ఎలుక కోసం కంత దగ్గర పిల్లి కాచుకుని కూర్చోగలదు. తోడేళ్ల గుంపులు చాకచక్యంగా వేటాడగలవు. కానీ మనుషుల విషయంలో ఇది ఉన్నతమైన స్థాయికి చేరుకుంది. స్విట్జర్లండ్‌లోని సొలూత్రే ప్రాంతంలో గుర్రాల శవాల గుట్టల ఆనవాళ్లు కనిపించాయి. అవన్నీ ఎత్తైన కనుమకు దిగువన పడి ఉన్నాయి. ఇది ఆదిమానవులు పథకం ప్రకారం చేసిన పనేనని పరిశీలకులు భావిస్తున్నారు. తమంతట తాముగా గుర్రాలు అంత ఎత్తునుంచి దూకవు కనక వాటిని వారు తరిమి ఉండాలి. వందలేసి గుర్రాలను భయపెట్టి, మరొక దారి లేకుండా చేసి, ఎత్తయిన కొండమీది నుంచి లోయలో పడేట్టుగా తరిమి చంపగలిగారంటే వారి ఊహాశక్తి ఎంతగా ఎదిగిందో అర్థమౌతుంది.

రెండుకాళ్లమీద నడవడం ప్రారంభించిన మానవజాతికి శరీర నిర్మాణంలో అపూర్వమైన మార్పులు కలిగాయి. అప్పటివరకూ తక్కిన జంతువుల కన్నా ఎక్కువ మనోవికాసం పొందవలసిన అవసరం వారికి కలగలేదు. వారి జీవనశైలి ఇతర ప్రాణులకు భిన్నమైన దిశలో సాగడం మొదలుపెట్టేసరికి ఆలోచనలకు తొలిసారిగా ప్రాముఖ్యత ఏర్పడింది. మొదట్లో అదంతా తాత్కాలికమైన ప్రాణరక్షణ కోసమే అయినా, రానురాను పరిసరాలని గమనించడం, వాటిలోని మార్పులను ముందుగా పసికట్టడం, ఏం జరగబోతుందో ఊహించుకోగలగడం, ఇవన్నీ ఉంటే తప్ప బతకడం అసాధ్యమయే పరిస్థితులు తలెత్తాయి. ప్రకృతిని గురించి అర్థం చేసుకుంటూ, అజ్ఞానం, అయోమయం, భయాలూ, అనుమానాలూ అన్నీ కలగలిసి, ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా ప్రాణాలు కోల్పోయే దుర్భర జీవితం గడిపిన తొలిమానవులు ప్రతిదాన్నీ వింతగా, అద్భుతంగా పరిగణించారు. తమ గురించీ, బాహ్య ప్రపంచాన్ని గురించీ, వాటి రెండిటికీ ఉన్న సంబంధాన్ని గురించీ అస్పష్టమైన అవగాహనతో మొదలైన మానవ జీవితాల్లో ఎక్కువ భాగం 'బతికి బట్టకట్టడం'తోనే సరిపోయింది. ప్రకృతికి భయపడే స్థితినుంచి దాన్ని గురించి కొంతైనా అర్థం చేసుకునే స్థితికి ఎదగడానికే మనిషి సర్వశక్తులూ ఒడ్డవలసి వచ్చింది. ఈ క్రమంలోనే వారి మనోవికాసం ప్రారంభమైంది. అందులో నిత్యజీవితాలకు ఎంతో అవసరమైన పరిజ్ఞానంతోబాటు అర్థంలేని భయాలూ, ఆందోళనలూ కూడా చోటు చేసుకున్నాయి. దేవుడూ, దెయ్యాలూ వగైరాల గురించి అప్పుడు కలిగిన కొన్ని అపోహలూ, తప్పుడు భావనలూ ఈనాటికీ కొనసాగుతున్నాయంటే మనిషి మనస్సు ఎంతగా 'దెబ్బతిందో'ననిపిస్తుంది. దీనికి తోడుగా నేటి సమాజంలో అజ్ఞానాన్ని ప్రోత్సహించే శక్తులకు కొదవలేకపోవడంతో మరింత గందరగోళం ఏర్పడుతోంది. వీ

## జార్ఖండ్‌లో సంకీర్ణ ప్రభుత్వం

జార్ఖండ్ అసెంబ్లీకి జరిగిన ఎన్నికల్లో ఏపార్టీకి మెజారిటీ రాలేదు. మొత్తం 81 స్థానాలలో కాంగ్రెస్-జెవిఎం(పి) కూటమికి 25 (కాంగ్రెస్14, జెవిఎం(పి)11), బిజెపి-జెడియు కూటమి 20 (బిజెపి18, జెడియు2), జెఎంఎం 18, ఎజెఎస్‌యు 5, మరికొన్ని పార్టీలు, స్వతంత్రులు కలిసి 13 స్థానాలను గెలుచుకున్నాయి. బిజెపి, ఎజెఎస్‌యు, జెడియు, జెజెఎంతో మద్దతుతో జెఎంఎం నేత శిబూ సోరెన్ డిసెంబర్ 30న మొదబాదీలో జార్ఖండ్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు.

## ఆయుధాల కొనుగోళ్లలో భారత్‌దే మొదటిస్థానం

భారత రక్షణ కొనుగోళ్లు పెద్ద ఎత్తున పెరిగి, వర్ధమాన దేశాల్లో అతిపెద్ద ఆయుధ కొనుగోలుదారుగా భారత్ అవతరించింది. 1999 నుంచి ఇప్పటి వరకూ దాదాపు 50 బిలియన్ డాలర్ల (సుమారు 2,25,000 కోట్ల రూపాయలు) విలువైన రక్షణ ఒప్పందాలను భారత్ కుదుర్చుకుంది. ఆయుధాల మార్కెట్‌లో ఏటా 1.5 బిలియన్ డాలర్ల (6750 కోట్ల రూపాయలు) తో రష్యాది ప్రథమ స్థానంకాగా, 1బిలియన్ డాలర్ల (4,500 కోట్ల రూపాయలు) తో ఇజ్రాయిల్‌ది రెండో స్థానంగా ఉంది.

## కేంద్ర హోంమంత్రితో అఖిలపక్ష భేటీ

జనవరి 5న ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 8 రాజకీయపార్టీల ప్రతినిధులతో హోం మంత్రి సమావేశమయ్యారు. ప్రతి పార్టీ నుండి ఇద్దరు ప్రతినిధులతోపాటు ముఖ్యమంత్రి ఈ సమావేశానికి హాజరయి రాష్ట్రంలో ఉన్న పరిస్థితులను వివరించారు. ఈ సందర్భంగా హోం మంత్రి పి. చిదంబరం తెలంగాణ విషయంలో చర్చల ప్రక్రియను ముందుకు తీసుకువెళ్తానే రాష్ట్రంలో సాధారణ పరిస్థితులు పునరుద్ధరించడం అవసరమనీ, ఆందోళనలకు, బంద్‌లకు స్వస్తి పలకాలనీ చెప్పారు.

## సోహ్రాబుద్దీన్ కేసుపై సిబిఐ విచారణ

సోహ్రాబుద్దీన్ బూటకపు ఎన్‌కౌంటర్‌పై సుప్రీంకోర్టు సిబిఐ విచారణకు ఆదేశించడంతో గుజరాత్ ప్రభుత్వానికి చుక్కెదురైంది. ఈ కేసులో గుజరాత్ రాష్ట్ర పోలీసు ఉన్నతాధికారులే నిందితులు. ఈ కేసును సిబిఐ చేత విచారణ జరిపించాలని సోహ్రాబుద్దీన్ సోదరుడు చేసిన విజ్ఞప్తి మేరకు జనవరి 12న సుప్రీం తీర్పునిచ్చింది. సోహ్రాబుద్దీన్ కేసును రాష్ట్ర పోలీసులు సరిగా విచారిస్తున్నట్లు కన్పించడంలేదు అని సుప్రీంకోర్టు తేల్చిచెప్పింది.

## 'స్వచ్ఛంద' అవినీతి

నిధులను దుర్వినియోగం చేస్తున్న 833 ఎన్జీఓలు, స్వచ్ఛంద సంస్థలను కేంద్ర ప్రభుత్వం బ్లాక్ లిస్టులో పెట్టింది. ఈ జాబితాలో ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానంలో ఉండగా బీహార్, తమిళనాడులు రెండు, మూడు స్థానాల్లో ఉన్నాయి. కేంద్ర గ్రామీణాభివృద్ధిశాఖ పరిధిలోని స్వతంత్ర సంస్థ కౌన్సిల్ ఫర్ అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ పీపుల్స్ యాక్షన్ అండ్ రూరల్ టెక్నాలజీ (కపార్ట్) కొన్ని ఎన్జీఓలను, స్వచ్ఛంద సంస్థలను బ్లాక్‌లిస్ట్‌లో పెట్టినట్లు ప్రకటించింది. రాష్ట్రానికి చెందిన 192 సంస్థలతోపాటు బీహార్‌లో 125, తమిళనాడులో 83, కర్ణాటకలోని 75, రాజస్థాన్‌కు చెందిన 42, కేరళలో 35 సంస్థలు ప్రముఖంగా ఉన్నాయి.

## బిటి వంకాయ వద్దే వద్దు

దేశంలో బిటి (జన్యుమార్పిడి చేసిన) వంకాయసాగును వాణిజ్యపరంగా ప్రవేశపెట్టాలని కేంద్రం భావిస్తోంది. దేశంలో అత్యధికంగా సాగుచేసే ఏడు రాష్ట్రాల్లో ప్రజాభిప్రాయ సేకరణ సదస్సులను కేంద్ర పర్యావరణ, అటవీశాఖ నిర్వహిస్తోంది. అందులో భాగంగా జనవరి 16న భువనేశ్వర్‌లో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణ సదస్సులో బిటి వంగను వ్యతిరేకిస్తున్న రైతులు, స్థానిక విద్యార్థులు, మహిళా సంఘాల నుంచి పర్యావరణ మంత్రి జైరాం రమేశ్‌కు తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. ఇంకా అహ్మదాబాద్, హైదరాబాద్, బెంగళూరు, నాగ్‌పూర్, చండీగఢ్‌లలోనూ ప్రజాభిప్రాయ సేకరణ చేసిన తరువాత బిటి వంగసాగుపై కేంద్రం నిర్ణయం తీసుకోనుంది.

## ఆదివాసుల వెతలపై ఐరాస నివేదిక

ప్రపంచ వ్యాప్తంగా ఆదిమజాతుల స్థితిగతులపై ఐరాస రూపొందించిన తొలి నివేదిక (2010) ను విడుదలచేసింది. భారతదేశంలోని ఆదివాసీల స్థితిగతులపై ఐరాస సర్వే చేసిన నివేదికలో ఆదివాసీలు పేదరికం, అవిద్య, అనారోగ్యం, హక్కుల నిరాకరణతో దుర్భర జీవితాన్ని అనుభవిస్తున్నారని తెలిపింది. భారీ ప్రాజెక్టులు, గనుల తవ్వకాలు తదితర కారణాల రీత్యా ఆదివాసీలు పెద్ద సంఖ్యలో నిర్వాసితులవుతున్నారు. ప్రభుత్వాలు ప్రత్యామ్నాయ సౌకర్యాలను సూచించలేకపోవడంతో వారి ఉనికే ప్రశ్నార్థకంగా మారుతోందని, ప్రపంచంలోని ఆదివాసీల్లో 50 శాతం కంటే ఎక్కువ మంది మధుమేహ సమస్యతో బాధపడుతున్నారని ఆ నివేదికలో పేర్కొంది.

## జ్యోతిబసు కన్నుమూత

పశ్చిమబెంగాల్ మాజీ ముఖ్యమంత్రి జ్యోతిబసు (95) జనవరి 17న ఉదయం 11.47 గంటలకు మరణించారు. చివరలో ఆయన న్యూమోనియాతో బాధపడ్డారు. జ్యోతిబసు కలకత్తాలో 1914లో జన్మించారు. ఆయన విద్యాభ్యాసం కలకత్తాలోని సెయింట్ జేవియర్ పాఠశాలలో సాగింది. 1935లో ప్రెసిడెన్సీ కళాశాలలో ఆనర్స్ డిగ్రీ పూర్తిచేశారు. న్యాయశాస్త్ర విద్యను బ్రిటన్‌లో చదివారు. అక్కడ ఉండగానే ఇండియాలీగ్, భారత సమాఖ్య, లండన్ మజ్లీస్, బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీల్లో పనిచేశారు. 1940లో భారతదేశానికి తిరిగి వచ్చి ఇక్కడి కమ్యూనిస్టు పార్టీలో పనిచేసి మొదటిసారి 1946లో బెంగాల్ అసెంబ్లీకి ఎన్నికయ్యారు. 1964లో కమ్యూనిస్టు పార్టీ చీలిపోయినపుడు సి.పి.ఐ.(ఎం) కార్యవర్గ సభ్యులలో ఒకరు. 1977 నుంచి 2000 మధ్య 23 ఏళ్లపాటు ముఖ్యమంత్రిగా కొనసాగారు.

## హైతీలో భూకంపం

లాటిన్ అమెరికాలోని హైతీలో జనవరి 12 సాయంత్రం 4.53 నిమిషాలకు భూకంపం సంభవించింది. అది రిక్టర్ స్కేల్‌పై 7.3గా నమోదయింది. ఈ భూకంపం తాకిడికి భారీ ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించింది. ఐక్య రాజ్య సమితి అంచనా ప్రకారం రెండు లక్షలకు పైగా ప్రజలు ప్రాణాలు కోల్పోయారనీ, దాదాపు రెండున్నర లక్షల మందికిపైగా క్షతగాత్రులయ్యారనీ తెలుస్తోంది. కోటి జనాభా గల హైతీలో భూకంపం వల్ల ముప్పై లక్షల మందికి పైగా నిర్వాసితు లయ్యారు. భూకంప కేంద్రానికి చేరువలోనున్న హైతీ రాజధాని పోర్ట్ అవ్ ప్రిన్స్‌లో భూకంప తాకిడి తీవ్రంగా ఉంది. హైతీని ఆదుకోవడానికి ప్రపంచ దేశాలన్నీ ముందుకువచ్చాయి.

## చైనా ఆర్థికాభివృద్ధి

ప్రపంచ ఆర్థికాభివృద్ధి సూచిలో చైనా జపాన్‌ను వెనక్కు నెట్టి రెండవ స్థానాన్ని చేరుకుందని సెంటర్ ఫర్ చైనా ఇన్ ది వరల్డ్ ఎకానమీ (సిసిడబ్ల్యూఇ) డైరెక్టర్ తెలిపారు. చైనా స్థూల జాతీయాదాయం 2008లో 9.6 శాతానికి చేరిందని, జపాన్ స్థూల జాతీయాదాయం తగ్గడంతో చైనా దాన్ని దాటిపోయిందని నేషనల్ బ్యూరో ఆఫ్ స్టాటిస్టిక్స్ తెలిపింది. అంతర్జాతీయ ద్రవ్య సంస్థ ఈ సంవత్సర ఆరంభంలో చైనా జపాన్ కంటే ముందుకు దూసుకుపోతోందని ప్రకటించింది.

## కర్జాయ్‌కు ఎదురుగాలి

కొత్త కాబినెట్‌లో ఉన్న ఖాళీలు నింపడానికి అఫ్ఘనిస్తాన్ అధ్యక్షుడు హమీద్ కర్జాయ్ సూచించిన 24 పేర్లలో ఏడుగురిని మాత్రమే పార్లమెంట్ సభ్యులు ఆమోదించారు. తిరస్కరించబడిన వారి జాబితాలో ఇంధన శాఖ, మహిళా సంక్షేమశాఖ మంత్రులున్నారు. రక్షణ, అంతర్గత, ఆర్థిక శాఖలకు సూచించిన పేర్లకు ఆమోదం తెలిపారు. పార్లమెంట్ నిర్ణయాన్ని ఆహ్వానిస్తున్నట్లు అమెరికా ఎంబెసి ఒక ప్రకటనలో పేర్కొంది. గత ఆగస్ట్‌లో జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో చాలా అవకతవకలు చోటు చేసుకున్నప్పటికీ పార్లమెంట్‌కు ఈ ఏడాది మే 22న ఎన్నికలు జరుగుతాయని ప్రకటించింది.

## ఒబామా ప్రభుత్వానికి ఎదురు దెబ్బ

అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా ప్రభుత్వం ఏడాది కాలం పూర్తి చేసుకున్న రోజునే ఎదురు దెబ్బ తగిలింది. మసాచుసెట్స్ సెనేటర్ టెడ్ కెన్నడీ మరణించడంతో అక్కడ జరిగిన ఎన్నికల్లో రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి స్కాట్ బ్రౌన్, డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి మార్తా కోక్లీపై విజయం సాధించారు. బ్రౌన్‌కు 52 శాతం, మార్తాకు 47 శాతం ఓట్లు వచ్చాయి. డెమోక్రాట్లు గత 47 సంవత్సరాలుగా మసాచుసెట్స్‌లో ఎప్పుడు ఓటమి ఎరుగరు. ఇది ఒబామా విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు ఇచ్చినతీర్పు అని రిపబ్లికన్ పార్టీ పేర్కొంది. వాతావరణ మార్పుల పైన, ఇతర అంశాలపైన చట్టాలను రూపొందించడంలో ఒబామా ప్రభుత్వానికి ఇబ్బందికర పరిస్థితులు ఎదురుపడే అవకాశాలు ఉన్నాయి.

## పెరుగుతున్న శరణార్థులు

యెమెన్‌లో గత ఆరు సంవత్సరాలుగా ప్రభుత్వానికీ, అల్-హౌతీ గ్రూప్‌కీ మధ్య జరుగుతున్న అంతర్గత యుద్ధం వల్ల ప్రజలు ప్రాణ భయంతో తమ ఇళ్లు వదిలి పారిపోతున్నారు. దాదాపు రెండు లక్షల మందికి పైగా తమ ఆవాసాలను వదిలి శరణార్థ శిబిరాలకు చేరుతున్నారని యునైటెడ్ నేషన్స్ హై కమిషన్ ఫర్ రెఫ్యూజీస్ తెలిపింది. ఈ యుద్ధం గత ఆగస్ట్ నుంచి తీవ్రరూపం దాల్చడంతో ప్రజలు దిక్కుతోచని స్థితిలో శరణార్థ శిబిరాలకు చేరుకుంటున్నారని తెలిపింది. శరణార్థుల తాకిడి ఎక్కువ కావడం వల్ల తమ సంస్థ వారికి సరైన వైద్యం, ఆహారం అందజేయలేకపోతోందని తెలిపింది.

## లాభాలు సృష్టించిన స్వైన్ ఫ్లూ

ఔషధ కంపెనీలు తమ లాభాలే ధ్యేయంగా ఎచ్1ఎన్1 'స్వైన్‌ఫ్లూ' వైరస్ కోసం ప్రపంచవ్యాప్తంగా అనవసర ప్రచారానికి పూనుకున్నాయని యూరోపియన్ ఆరోగ్య అధికారి వోల్ఫ్‌గాంగ్ వోడర్గ్ పేర్కొన్నారు. మందుల కంపెనీలు అంటీ వైరస్ మందుల అమ్మకాలు పెంచుకోవడానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యు.ఎచ్.ఒ.) పై స్వైన్‌ఫ్లూ వ్యాధి తీవ్రతను వాస్తవానికి విరుద్ధంగా ఎక్కువ చేసి ప్రకటించే విధంగా ఒత్తిడి చేశాయని యూరప్ ఆరోగ్య మండలి విభాగపు అధిపతి వోడర్గ్ తెలిపారు. అంచనాలు వేసినంత తీవ్రంగా స్వైన్ ఫ్లూ లేదని గార్డియన్ పత్రిక పేర్కొంది. తొలుత బ్రిటన్‌లో ఈ వైరస్‌వల్ల 65,000 వరకు మరణాలు సంభవించవచ్చని భయపెట్టారు. కాని ఈ వైరస్ వల్ల ఇప్పటికి 360 మంది చనిపోయారు. ముందు జాగ్రత్తగా ఉత్పత్తి చేసిన వాక్సిన్‌లు పెద్ద ఎత్తున అలానే మిగిలిపోయాయి.

## బుర్జ్ ఖలీఫా

దుబాయిలో ప్రపంచంలోకెల్లా అత్యంత ఎత్తైన భవంతి 'బుర్జ్ దుబాయ్' 4 జనవరి 2010న ప్రారంభమైంది. దీని ఎత్తు 828 మీటర్లు (2,717 అడుగులు). ఇందులో మొత్తం 160 అంతస్తులు ఉన్నాయి. దాదాపు 150 కోట్ల డాలర్ల వ్యయంతో దీన్ని నిర్మించారు. దీని నిర్మాణానికి ఎనిమిది వేల మందికి పైగా కార్మికులు పనిచేశారు. ఈ భవంతి నిర్మాణానికి చేయుతనిచ్చిన యుఎఇ అధ్యక్షుడు షేక్ ఖలీఫాకు కృతజ్ఞతగా దీనికి 'బుర్జ్ ఖలీఫా' అని పేరు పెట్టారు. దీని నిర్మాణానికి మొత్తం ఐదున్నర సంవత్సరాల సమయం పట్టింది.

## ఆస్ట్రేలియాలో భారతీయులపై దాడులు

ఆస్ట్రేలియాలో భారతీయులపై జాతి వివక్ష దాడులు కొనసాగు తున్నాయి. విద్యార్థులు, ఉద్యోగులు, టాక్సీ డ్రైవర్లు ఇలా భారతీయులపై దాడులు జరుగుతున్నాయి. గత ఏడాది మొత్తంలో దాదాపు ఎనభైకి పైగా ఇలాంటి దాడులు జరిగాయి. ఈ పరిణామంతో అక్కడికి చదువు కోవడానికి వెళుతున్న భారతీయుల సంఖ్య జూలై-అక్టోబర్ 2009 నెలలో దాదాపు 46 శాతం వరకు తగ్గిపోయింది. ఈ దాడులను వెంటనే నివారించాలని భారత ప్రభుత్వం ఆస్ట్రేలియా ప్రభుత్వాన్ని కోరింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 డిసెంబర్ 2009 నుండి 20 జనవరి 2010 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1750)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 11 | – | 22 | 38 | 3 | 1 | 3 | 1 | 1 | 1 | 3 | 1 | 3 | 33 | 20 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 10 | 18 | – | – | – | 4 | 8 | 3 | 8 | 1 | – | 37 | 26 | – | – | – | 15 | – |
| కరీంనగర్ | 2 | 11 | – | 22 | 83 | 8 | 10 | 3 | 3 | 8 | 2 | 5 | 1 | 8 | 44 | 20 | – | – | – | 5 | 3 |
| ఖమ్మం | – | – | – | 4 | 4 | 2 | 8 | 1 | – | – | 6 | 6 | 2 | 1 | 16 | 5 | 2 | – | – | – | – |
| మెదక్ | – | 8 | – | 15 | 20 | 6 | 16 | 2 | – | 4 | 4 | 2 | 7 | 8 | 34 | 7 | – | – | – | – | – |
| నిజామాబాద్ | 1 | – | – | 6 | 8 | – | 1 | 1 | – | 1 | – | 4 | 2 | 7 | 19 | 4 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 4 | – | 7 | 6 | 3 | 6 | 2 | 4 | 10 | 8 | 5 | 2 | 3 | 24 | 5 | – | – | – | 4 | – |
| వరంగల్ | – | – | – | 10 | 12 | 8 | 10 | 7 | 2 | – | – | – | – | – | 25 | 26 | – | – | – | – | – |
| అనంతపురం | – | 1 | – | 5 | 3 | 2 | 3 | 1 | 2 | 2 | 4 | 3 | 2 | – | 38 | 7 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 4 | 4 | – | – | – | – | – | – | – | 12 | – | 27 | – | – | – | – | – | – |
| కడప | – | 3 | – | 7 | 10 | 2 | 4 | 1 | 4 | 6 | 3 | 5 | 6 | – | 14 | 6 | – | – | – | – | – |
| కర్నూలు | – | 12 | – | 19 | 15 | 4 | 5 | 2 | 3 | 5 | 2 | 7 | 2 | 3 | 41 | 18 | – | – | – | 2 | – |
| తూర్పు గోదావరి | – | – | – | 14 | 9 | – | 20 | 2 | – | – | 5 | 5 | 2 | 6 | 41 | 27 | – | – | – | 1 | – |
| గుంటూరు | – | 1 | – | 6 | 6 | 1 | 5 | – | 2 | 3 | 5 | 6 | 1 | 2 | 32 | 12 | – | – | – | 4 | – |
| కృష్ణా | – | 2 | – | 6 | 5 | 3 | 6 | 2 | – | – | 3 | 6 | 2 | – | 21 | 6 | – | – | – | – | 1 |
| పశ్చిమ గోదావరి | – | 4 | – | 1 | 2 | 3 | – | – | – | – | 3 | 2 | – | – | 15 | 3 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | 1 | 1 | 3 | 3 | 2 | 2 | 4 | 1 | 1 | 1 | 3 | – | – | 11 | 7 | – | – | – | – | – |
| విశాఖపట్నం | 1 | – | – | 9 | 7 | 1 | 1 | – | 1 | 6 | 1 | 4 | 2 | 3 | 20 | 4 | – | – | – | 4 | – |
| విజయనగరం | – | – | – | 3 | 8 | – | – | – | 2 | – | 2 | 2 | – | 1 | 22 | 8 | 3 | – | 1 | – | – |
| **మొత్తం** | **4** | **58** | **1** | **173** | **261** | **48** | **98** | **31** | **29** | **55** | **53** | **76** | **45** | **45** | **514** | **211** | **5** | **–** | **1** | **38** | **4** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – శంకరయ్య, వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – సుమలత; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; పశ్చిమ గోదావరి – టి. హేమలత; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. అరుణ; విజయనగరం – డి. సుధాకర్

వీక్షణం మీరు చదువుతున్నారా?వెంటనే చందాదారులు కండి !
మీరు చందాదారులేనా? కనీసం మరొకరి చందా చేర్పించండి!

మీ గ్రంథాలయానికి, కార్యాలయానికి, మీకు తెలిసిన ప్రజాసంఘాలకు వీక్షణం ను పరిచయం చేయండి, వీక్షణం మీ పత్రిక, ప్రజల పత్రిక నాలుగు కాలాలు నడిచేలా చూసే బాధ్యత మీదే

మీరు తప్పనిసరిగా తెలుసుకోవలసిన సమస్త సామాజిక, రాజకీయార్థిక విషయాలను సమగ్రంగా, స్పష్టంగా వివరిస్తాయి **వీక్షణం** వ్యాసాలు

**విడి ప్రతి కేవలం రు.10 మాత్రమే**

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| మూడు సంవత్సరాల చందా | రు. 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. 550 |
| పది సంవత్సరాల చందా | రు. 1000 |

**‘వీక్షణం’ పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 103 - February 2010
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 29/01/2010 • Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao